# తొలి పలుకు

ఈ వ్యాససంపుటిని ప్రకటించుటలో నా యుద్దేశ్యము విద్యార్థులకు, సాహిత్య జిజ్ఞాసువులకు కొందరు ఆంధ్రమహా కవుల కావ్యములను, వారి విశిష్ట కవితా లక్షణములను పరిచయము చేయుటయే.

బాల్యమునుండియు ప్రాచీనాంధ్రకవుల పద్యములను-రసవంతములగువానిని – నేర్చుకొనుటలో నాకు గల ఆసక్తి కావ్యాధ్యయన రూపమున పరిణమించినది. ఆంగ్లభాషాధ్యయనము ప్రత్యేకముగా చేసి, ఆ భాషాచార్యుడనైనతర్వాత, ఈ ఆంధ్ర సాహిత్యాభిలాష అధికము కాజొచ్చెను. శ్రీ వేంకటేశ్వర కళాశాలాధ్యక్షుడనైనపిదప, ఆ యా కవుల కావ్యములను చదివి, వాని సౌందర్యము నాస్వాదించి, వారి కవితారీతులను గూర్చి పలువురు కవి పండితులతో ముచ్చటించు అవకాశ మేర్పడినది. కళాశాలాధ్యక్షుడుగా తెలుగు సంస్కృత కవుల జయంత్యుత్సవములను, సాహిత్య సమీక్షలను నిర్వహించుటతో నా ఆంధ్రసాహిత్యాధ్యయనమునకు ఒక ప్రయోజనము సిద్ధించినది. ఒక దశాబ్ద కాలములో మా కళాశాలలోనే కాక, నెల్లూరు తిక్కన జయంత్యుత్సవములోను, (వ్యాసము–తిక్కన–25–2–68) అమలాపురము త్యాగబ్రహ్మ విద్వత్పరిషత్సభలోను, (వ్యాసము–సంస్కృతభాషాప్రాశస్త్యము–9–6–69) హిందూపుర సాహిత్యపరిషత్తులోను, మరికొన్ని సాహిత్యసంస్థలలోను

అధ్యక్షుడుగనో, వక్తగనో ఉపన్యసింపవలసి వచ్చుటచే, మరింత కృషి చేయగలిగితిని. ఆ యా సభలకు అధ్యక్షులు గనో, ఉపన్యాసకులుగనో విచ్చేసిన కవిపండితులు— అప్పటి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ కులపతులు కీ॥ శే॥ ఎస్. గోవిందరాజులుగారును, శ్రీయుతులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గడియారము వేంకటశేష శాస్త్రి, జటావల్లభుల పురుషోత్తం, పుట్టపర్తి నారాయణా చార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య జి. ఎన్. రెడ్డి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థనిర్వాహ కులు డా॥ జీరెడ్డి చెన్నారెడ్డిగారలును ఈ రంగమున నేనొన రించిన కృషిని అభినందించిరి. అప్పుడే నే నెరిగిన విషయ ములను, పుస్తకరూపమున, పలువురకు తెలియజేయు సంకల్పము కలిగినది. దానికి మిత్రుల, అభిమానుల ప్రోత్సాహమును లభించినది. ఈ పదియేండ్లలో నే నొసగిన ఉపన్యాసములను ఉచితరీతిని సంస్కరించి, ఈ గ్రంథ రూపమున వెలయించితిని.

వ్యాసరూపమున ప్రకటించినను, పరిమిత కాలములో కావింపబడిన ఉపన్యాసము లగుటచే కూలంకషముగా కవితా విమర్శన మొనరించుటకు ఆస్కారము లేకపోయినది. విషయ వైవిధ్యమువలన, పదియేండ్ల వ్యవధిలో రచింప బడుటవలన, ఆ కవుల ప్రత్యేక కవితా లక్షణములనే విస్తారముగా నిరూపించుటవలన ఈ వ్యాసములలో కొంత శైలీభేదము గోచరింపవచ్చును. సరళ గ్రాంథికమున వ్యాస రచన చేయుటయే కాక, సముచిత మని తోచిన పట్టుల

విసంధి గావించితిని. అర్ధానుస్వారములు, శకటరేఫములు ఉదాహరింపబడిన పద్యములలో సైతము విడువబడినవి.

ఆంధ్రమహాకవులలో కొందరి కావ్యములను పరిచయము చేసి, ఆ కావ్యగత సౌందర్యమును మాత్రమే నిదర్శనములతో దిఙ్మాత్రముగా చూపుటయే నా లక్ష్యమగుటచే, తీవ్రవిమర్శలు, ఏకపక్షనిర్ణయములు, వివాదగ్రస్తవిషయములును ఇందు పరిహరింపబడినవి. సాహిత్యాభిలాష గల విద్యార్థులును, సారస్వత ప్రియులును ఈ సుధాలహరీరసాస్వాదన మొనరించి, ఆనందించినచో, నా ఆశయము నెరవేరినట్లే.

ఇంతవరకు ఈ కవులపై, వారి కవితారీతులపై వెలువడిన విమర్శ-సమీక్షాగ్రంథము లెన్నియో నా కీ వ్యాసరచనమున కుపకరించినవి. ఆ యా గ్రంథకర్తలకు నా కృతజ్ఞతలు. ఈ పుస్తకమునకు పరిచయవాక్యములను వ్రాసిన సహృదయ మిత్రులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు ఆచార్య జి. ఎన్. రెడ్డిగారికి నా కృతజ్ఞత.

ఎంత జాగ్రత్తగా ప్రూఫులు సరిచూచినను తప్పులు, పరిమితములే యైనను, కొన్ని దొరలినవి. పాఠకులు వానిని సరిదిద్దికొనగలరు.

దీనిని సర్వాంగసుందరముగ నచ్చొత్తించి యిచ్చిన తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయమువారికి నా ధన్యవాదములు.

సముద్రాల నాగయ్య
ప్రిన్సిపాల్
శ్రీ గోవిందరాజస్వామి కళాశాల

తిరుపతి
15-12-1971

# పరిచయము

మానవసమాజం, సాహిత్యం—ఇవి రెండూ ఆధార-ఆధేయ సంబంధం గల వ్యవస్థలు. సమాజంయొక్క నాగరకతా సంస్కృతులకు ముఖ్యలక్షణం సాహిత్యం. ఏనాడూ భాష లేని మానవ సమాజం కానీ, సాహిత్యం లేని నాగరక మానవసమాజం కానీ లేదు. సాహిత్యం సమాజాన్ని ఆశ్రయించి అనుగమించినా, కొన్ని ఘట్టాల్లో సాహిత్యమే సమాజంయొక్క పురోగతికి చోదక మౌతుంది. సాహిత్యం స్రవంతివంటిది. సాహిత్యస్రవంతిని సామాజికుల మానసికానందవికాసాలకు అనుగుణంగా ప్రవహింపచేయడం కవుల కర్తవ్యం. ఆంధ్రసాహిత్య స్రవంతికి "గంగోత్రి" నన్నయ-ఆదికవి. ఆ స్రవంతిని ఆంధ్రావళి మోదముం బొరయ తెలుగునాట నలువైపుల ప్రవహింపచేసిన కవి తిక్కన-కవిబ్రహ్మ. అట్లు సుజలపూరితమైన ఆంధ్రావనిలో కావ్యారామాలు పెంచినవాడు శ్రీనాథుడు-కవిసార్వభౌముడు. అట్టి కావ్యారామాలను విలాసజనవిహారాకర్షణీయమైన ఉద్యానవనాలుగా తీర్చినవాడు పెద్దన. ఈ ఉద్యానవనం చెంత పారిజాత పుష్ప శోభిత నందనవనాన్ని నిలిపిన కవి నంది తిమ్మన. ఆ నందనవనంలో శ్లేషకవితాలతాగుల్మములను పోషించి, సాహిత్యక్షేత్రంలో "కృషిపండితు" డనిపించుకొన్న మహామనీషి రామరాజభూషణుడు. వీరందరూ ఆంధ్రసరస్వతిని అలంకరించిన మహాకవులు-గరీయఃప్రతిభులు. వీరి కవిత ఆలోచనామృతం. అట్టి ఆలోచనామృతాన్ని ఈ 'సాహితీ

సుధాలహరి'లో కొంత ప్రపంచించిన విమర్శవిహారి శ్రీ సము ద్రాల నాగయ్యగారు—ఆంగ్లాంధ్రసంస్కృత సాహిత్యార్ణ వావలోడనాసంజాతపరిజ్ఞాన సమన్వితులు.

తెలుగు సాహిత్య రంగంలో ప్రాచీనకాలంలోనే కాక, ఈనాడు కూడ కవులే ఎక్కువ, విమర్శకులు తక్కువ. సద్విమర్శ సాహిత్య వికాసానికి దోహదకారి అనడంలో అభిప్రాయభేదం ఉండదు. ఆంగ్లసాహిత్యంలో కవుల కావ్యాల కన్న, ఆ కవుల కావ్యాలను గూర్చిన విమర్శగ్రంథాలు, పరిమాణదృష్టితో పరిశీలించినప్పుడు, ఎన్నోరెట్లు ఎక్కువ. మన సాహిత్యంలో ప్రాచీన కావ్యాలకు సంబంధించిన విమర్శ కాని, ఆధునికసాహిత్యానికి సంబంధించిన పరామర్శ కాని అతిస్వల్ప మనే చెప్పాలి. అటువంటప్పుడు కొత్తగా వచ్చిన ఏ సాహిత్య విమర్శ గ్రంథమైనా మనకు ఆదరణీయమే అవు తుంది. శ్రీ నాగయ్యగారు తాము గ్రహించిన కవుల రచనా శిల్ప విశేషాదులను గ్రంథములో సోదాహరణంగా, సోప పత్తికంగా నిరూపించినారు. ఇట్లు నిరూపించిన వాటిలో కొన్ని కొత్తవి కాకపోవచ్చు. అయినా, ఒక కవియొక్క మూర్తిని, ఆత్మీయతను సమగ్రంగా వ్యాసరూపంలో కాని, ఉపన్యాసరూపంలో కాని ప్రదర్శింపదలచుకొన్నప్పుడు అట్టి వాటిని పరిహరించడం వీలుకాదు. వీరి విమర్శ కథాకథ నంతో మరుగుపడక, కవితాశిల్పావిష్కరణతో కూడి ఉండడం ఎన్నదగిన విశేషం. పారిజాతాపహరణ ప్రబంధం ఇతివృత్తనిర్మాణం దృష్ట్యా పద్యనాటక మని నిరూపించడం మౌలికమైన వీరి విమర్శనాదృష్టికి దృష్టాంతం. కృతిపతియైన శ్రీకృష్ణదేవరాయలకు, శ్రీకృష్ణభగవానునికి నంది తిమ్మన కొంత అభేదాన్ని భావించి, వర్ణించినమాట నిజమే. అతడు

ప్రబంధకవి-రాయల ఆశ్రితుడు. శ్రీ నాగయ్యగారు నంది తిమ్మనకు ఒక మెట్టు పై కెక్కి, కొంత భావాంబరవీథిలో విహరించి, చిన్నాదేవి తిరుమలదేవులను రుక్మిణీ సత్యభామ లుగా భావించడం అందరూ మెచ్చరేమో అనుకుంటాను. అల్లసానిని గురించిన వ్యాసంలో, ప్రవరమూర్తిలో పెద్దనను సాక్షాత్కరింపచేసినారు. నన్నయ-తిక్కన-శ్రీనాథ-రామ రాజభూషణులకు సంబంధించిన విమర్శవ్యాసాలలో ఆ యా కవుల కవితాప్రౌఢిమను చక్కగా విశదీకరించినారు. ఉదాహ రించిన పద్యాలలో అరసున్నలు అదృశ్యమై ఉండడం కొంద రికి అయిష్టంగా ఉండవచ్చును. అయినా, అందువల్ల రసా స్వాదనకు ఆటంకం అంటూ ఉండదు.

సాహితీవిద్యార్థులు, కవి-పండిత-విమర్శకులు ఆదరించ దగిన రచన ఈ 'సాహితీ సుధాలహరి'.

తిరుపతి
15-12-71

(సం.) జి. ఎన్. రెడ్డి
(ఆచార్య జి. ఎన్. రెడ్డి, ఎం. ఏ., ఎం. లిట్., పి. హెచ్. డి.)
ఆంధ్రశాఖాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము

# విజ్ఞప్తి

సహృదయులు, సాహితీప్రియులు నా 'సాహితీ సుధా లహరి'పై చూపిన ఆదరాభిమానములు అత్యంత ప్రశంసార్హములు. అచిరకాలముననే ప్రథమ ముద్రణపు ప్రతు లన్నియు వ్యయమైపోవుటవలన ఈ ద్వితీయముద్రణా వశ్యకత ఏర్పడినది.

ఈ గ్రంథముపై ఆదరము చూపి, నిశితముగా పరిశీలించి, చక్కని సూచనలు చేసిన కవి పండిత విమర్శకులకు సర్వదా కృతజ్ఞుడను. వారి సూచనలను అనుసరించి, ఈ ముద్రణమున ఉదాహృత పద్యములలో శకటరేఫములను, అర్ధానుస్వారములను చేర్చితిని. వారు నిర్దేశించిన చిరు సంస్కరణములును చేయబడినవి.

తెలుగు ఎం.ఏ. పట్టపరీక్షకు ఈ పుస్తకమును పాఠ్య గ్రంథముగా నిర్ణయించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాల యాధికారులకు నా కృతజ్ఞత.

ఈ గ్రంథమును ఇంత చక్కగా ముద్రించి ఇచ్చిన 'క్రాంతి ప్రెస్' ముద్రణాలయాధిపతులు శ్రీ ధనికొండ హనుమంతరావుగారికి ధన్యవాదములు.

తిరుపతి
15-8-73

సముద్రాల నాగయ్య
ప్రిన్సిపాల్
శ్రీ గోవిందరాజస్వామి కళాశాల

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

749, 46 వ క్రాసు; 8 వ బ్లాకు;
జయనగరం; బెంగుళూరు-41.
తేది: 11-3-'72.

శ్రీ నాగయ్యాగారికి నమస్సు.

విశ్వాసపూర్వకముగా మీరు పంపిన 'సాహితీ సుధాలహరి' ప్రతి అందుకొన్నాను. ధన్యవాదములు.

పూర్తిగ చదివినాను. ఎంత మంచి గ్రంథమును తెలుగువారి కందిచ్చితి రని సంతోషమును, తృప్తిని అనుభవించినాను. అట్ట, కాగితము, అచ్చు, కూర్పు అన్నియు లోపలి విషయములకు తగిన అందచందములతో నిండి యున్నవి. నేటి తెలుగచ్చు ప్రపంచములో ఇంత నిర్దుష్టమైన ముద్రణము చూడగల్గుట సామాన్యము కాదు.

సారస్వతమందు మీకున్న అభిమానాభినివేశములు సుప్రసిద్ధములే. కాని, కాలేజి పనుల, పాఠాల విరామము లేని సందడిలో, మీరు ఇన్ని విషయములను ఇంత శాస్త్రీయముగా, నికరముగా సంపాదించి, సమన్వయపరచుట, ఆయా మహాకవుల గ్రంథములను సర్వంకషముగా పరిశీలించి, వారి వారి విశిష్టగుణాల నెత్తిచూపించుటయు ఎంతో వింతపడి, అభినందించవలసిన విషయము. ఈ మీ శక్తికి, పరిశ్రమకును తెలుగువారందరును అప్పుపడియున్నారు. మీరు ధన్యులు.

మీదృష్టి, విషయోపపాదనక్రమము, అతివాదమునకు పోని సంయమము—ఇవి సాహితీ రసికులకు ఎంతో హృద్యములు; విద్యార్థులకు మంచిదారిని చూపగలవి.

సంస్కృత సాహిత్య ప్రశస్తి చేయు మీ కడపటి వ్యాసము నేటి సమయ మాణిక్యముగా నున్నది. అందుకై ప్రత్యేకముగా కృతజ్ఞతతో మిమ్మభినందించుచున్నాను.

మీ గ్రంథము పట్టపరీక్షకు పఠనీయము కాదగు నని, తప్పక అగు నని భావింతును.

మీ వాడు

(సం) రా. అనంతకృష్ణశర్మ

**HYDERABAD-29**
**16-11-72**

**Prof. G. J. Somayaji**
Chairman,
Academic Committee
Bd. of Governors (Hony)
Telugu Akademy;
Retd. Head of the Telugu Department,
Andhra University;
Retd. Chairman, Commission for
Scientific and Tech. Terminology,
Govt. of India, New Delhi

శ్రీయుతులు సముద్రాల నాగయ్యగారికి.

మీరు దయతో ఇచ్చిన 'సాహితీసుధాలహరి' పూర్ణముగా చదివి యానందించితిని.

మీ సంస్కృతాంధ్రభాషా పాండిత్యము ప్రాచ్య కావ్య విమర్శనా మార్గమున రూపంది, ఆంగ్ల కావ్య విమర్శనా పాటవమున నునుపెక్కి, చూడ సొంపై, విన నింపై, ముద్దులు మూటగట్టుచున్నది.

భాషలో, భావనమున, రచనయందు, సంతనపట్ల, జోడుకూర్చునెడ, వివరణ చేయుచోట, దోషనిరూపణ ప్రదేశముల మీరు చూపించిన సమత, నియమము మెచ్చ తగినవి.

ఎం. ఏ. పరీక్షకు బోవు విద్యార్థులకు ఇది విజ్ఞాన విషయమునను, కృతార్థతా సందర్భమునను మిక్కిలి యుపకరించును.

మీకు అనేకములయిన ఆశీస్సులు. శుభము.

భవదీయుడు

(సం) విద్వాన్ సోమయాజి

**Prof. Divakarla Venkatavadhani,**
**Head of the Dept. of Telugu**
**Osmania University,**
**HYDERABAD**

18/4 R.T
బరకత్పుర
హైదరాబాదు-27.
16-4-'72.

అనేక నమస్కారములు చేసి వ్రాయు విన్నపములు.

తమ గ్రంథమును మరల మరల చదివి, తమ విమర్శన పాటవమునకును, విషయ వివరణమునకును, భాషా ప్రయోగకౌశలమునకును కడుంగడు సంతసించితిని. ఆ విషయములను గూర్చి జిజ్ఞాసువులు తెలిసికోవలసిన విశేషములింతకంటె నేవియు నుండవు. మహాకవుల పద్యములలోనైనను అవసరమైనచోట్ల నర్ధబిందువుల నుంచుట మంచిదని నా అభిప్రాయము.

తమ వ్యాసములు తమ కాంధ్రకావ్యములతో గల గాఢమైన, నిశితమైన పరిచయమును వెల్లడించుచున్నవి. చివరి వ్యాసము తమకు సంస్కృతకావ్యములతో గల పరిచయమును, వానిపై గల అభిమానమును చాటుచున్నది.

చిత్తగించవలెను.
విధేయుడు
(సం) ది. వేంకటావధాని

CUDDAPAH

11-2-72

**Saraswathiputra, Mahakavi, Padmasri**
**Puttaparthi Narayanacharya**

క్షేమం

శ్రీయుతులు మిత్రవర్యులు సముద్రాల నాగయ్యగారికి

పుట్టపర్తి నారాయణాచార్యుల నమస్కారములు. ఉభయకుశలోపరి.

తమరు దయతో పంపిన 'సాహితీసుధాలహరి'ని రెండు నాళ్లుగా చదివినాను. తమ వ్యాసములో ముఖ్యముగా నన్నాకర్షించినది పెద్దన్నగారిపైని వ్యాసము. ప్రవరునిలో గోచరించునది 'ధర్మవీరము' అన్నమాట నా కెంతయో సమాధానమును గూర్చినది. నంది తిమ్మనపైన తమరు వ్రాసిన వ్యాసము తమ పరీక్షలోని లోతును జూపుచున్నది. రామరాజభూషణుని వ్యుత్పత్తిని, ప్రతిభను చక్కగా చూపించినారు. సంస్కృత భాషా ప్రాశస్త్యముపై తమ వ్రాత నాకాశ్చర్యము గొల్పినది. గీర్వాణమున నింతటి తలస్పర్శమగు పాండిత్యముండుట-యెంతయో సంతోషింపదగిన విషయము. ఇంతవరకును తమ గ్రంథములతో పరిచయము లేదు. పంపిన యీ యొక పుస్తకమును తమయెడ నాకు గల యాదరాభిమానములను ద్విగుణీకృతములుగా నొనర్చినది. ఆంగ్ల భాషను చదివి, ఆంగ్లమును బోధించుచు, దేశ భాషలలో నింత చొరవ కల్గించుకొనుట చాల గొప్ప విషయము. మీ పరిశ్రమకు నా ప్రణామములు.

ఇట్లు

(సం) "పుట్టపర్తి"

# విషయసూచిక

# నన్నయ

నన్నయకు పూర్వమే తెలుగు ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొని, జనవ్యవహారములో నుండినది. ఇందు వివిధములగు దేశీయకవితలు వెలసి యుండునని యూహించుట కవకాశము కలదు. అనేక కారణములవలన నవి కాలగర్భమున విలీనములై యుండుననుటయు అసంగతము కాదు. మనకు లభించు తొలికావ్యము నన్నయ భారతము.

ఆంధ్రదేశము నేలిన ప్రాచీనరాజులు సంస్కృత ప్రాకృతములనే ఆదరించుటచే వారిశాసనము లన్నియు ఆ భాషలలోనే వెలసినవి. క్రీ॥ శ॥ మూడవ శతాబ్దమునుండి ఆరవ శతాబ్దము వరకు నున్న ఈ శాసనములలో తెలుగు పదము లనేకములు గుర్తింపబడినవి. క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దము మొదలు మనకు లభించిన తెలుగు శాసనములను పరిశీలించిన, తెలుగు భాష ఎట్లు క్రమవికాసము నొందినదో గమనింప వచ్చును. తొమ్మిదవ శతాబ్దము మొదలు నన్నయ కాలమువరకు లభించిన శాసనములలో వచన రచనలేకాక తరువోజ, సీసము, గీతము, ఉత్పలమాల, అక్కర, రగడ మొదలగు ఛందోరచనములును లభించినవి. క్రీ॥ శ॥ పదునొకండవ శతాబ్దమునాటికి, ఆంధ్రభాష కావ్యనిర్మాణమున కుపయుక్తమగు స్థితి నందుకొనకున్నను, ఆవశ్యకములగు కొన్ని సంస్కరణములతో నర్హమగు స్థితిని పొందుటకు వీలు కలదని విశదమగును.

తెలుగు దేశమును సుమారు ఐదువందల సంవత్సరముల కాలము నేలిన చాళుక్య రాజులు తెలుగు సంస్కృతిని, భాషను పోషించి, ఆంధ్ర సాహిత్య సామ్రాజ్యమును కూడ నెలకొల్పిరి. నన్నెచోడ కవిరాజు:

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ, దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ, జనఁజాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."

(కు. సం. 1-23)

అని, నిగ్గుదేలిన సంస్కృతకవిత బహువిధముల విస్తరిల్లియుండగ, ఆంధ్ర దేశమున ప్రథమముగా తెలుగు కవితను వెలయింపజేసిన కీర్తి చాళుక్య రాజులకే దక్కెనని వారిని కొనియాడెను. సంస్కృత భాషను, కవిత్వమును ఉత్కృష్టముగా భావించి, వానినే ఆదరించుచుండిన కవులను, పండితులను దేశికవితకు సుముఖులుగా చేసి, తెలుగు భాషలో మధురకవితలను వెలయింప చేసినవారు ఈ చాళుక్యరాజులే.

ఈ రాజులలో నగ్రగణ్యుడు, రాజమహేంద్రవరము రాజధానిగా వేగీ దేశమును పరిపాలించిన రాజరాజనరేంద్రుడు. మహాబలపరాక్రమసంపన్ను డగు ఈ రాజు శత్రురాజుల నిర్జించి, రాజ్యమున సుస్థిర శాంతిని నెలకొల్పి, అనవరతము రాజ్యసుఖముల ననుభవించుచుండినవాడు. ఈతని యాస్థాన మున సర్వశాస్త్ర పారంగతులగు పండితోత్తములును, నవ్యార్థరచనావిశారదు లగు మహాకవులును అసంఖ్యాకులు విలసిల్లిరి. విద్యావిలాసగోష్ఠులలో, ఇష్ట కథావినోదములలో నిమగ్నుడైన రాజు ఒక్కనాడు——

# న న్న య

"తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమతత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి."

(ఆది. 1-9)

"నే ననేక పురాణములు వింటిని; అర్థ - ధర్మ శాస్త్రముల తెలంగెలింగితిని; కావ్యనాటకక్రమములు పెక్కు చూచితిని; ఈశ్వరాగమములయందు హృదయము భక్తితో నిల్పితిని. అయినను, నా హృదయంబున మహాభారత శ్రవణాభిలాష పెద్దదై యున్నది. అస్మదీయవంశమునఁ బ్రసిద్ధులైన పాండవోత్తముల చరిత్ర సతతము వినవలె ననెడు కుతూహలము గలదు. కాన, కృష్ణద్వైపాయన ముని విరచితమగు మహాభారతమును దెనుఁగున రచియింపు" మని ప్రార్థించెను. సుకవిజనవినుతుడగు నన్నయయు,

"అమలినతారకాసముదయంబుల నెన్నను, సర్వవేదశా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను, బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారతభారతీ సము
ద్రముఁ దఱియంగ నీదను, విధాతృనకైనను నేరఁబోలునే."

(ఆది. 1-19)

అని, తన విధేయతను, మహాభారత సముద్ధరణములోని క్లేశమును ప్రకటించి, రాజాజ్ఞయైనదిగాన, తా నేర్చిన విధమున నా కావ్యమును రచించెదనని, మహాభారతాంధ్రీకరణమునకు సమ్మతించెను.

వ్యాసభగవానుడు చతుర్వేదసారమును మహాభారతములో లోకసంగ్రహార్థమై నిక్షేపించెను. కావుననే యది పంచమవేదముగా పరిగణింపబడినది. ఆంధ్రజనతాహితాభిలాషియగు రాజరాజు భారతాంధ్రీకరణము తన ప్రజలకు శ్రేయస్సు నొనగూర్పగలదని భావించెను. నన్నయయు నదేకారణముగ తదాంధ్రీకరణమునకు పూనుకొనెను. భారతకథ అపూర్వము, హృద్యమునైనది. దానిని వినిన జ్ఞానము సమగ్రమగును. అది అఘనిబర్హణము. అంతేకాదు,

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని,
కవివృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని,
యైతిహాసికు లితిహాసమనియుఁ,
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని, మహిఁ గొనియాడుచుండ"

(ఆది. 1-32)

విజ్ఞానసర్వస్వముగా జగత్ప్రసిద్ధి నందినట్టిది మహాభారతము.

వ్యాసునివలె పరమాస్తికుడు, భగవద్ధ్యానైక తత్పరుడు, పరహితైషియు నగువానికి తప్ప, సర్వవేద సారమగు మహాభారత భాషాంతరీకరణము సాధ్యముకాదు. ఈ యంశములను ధ్రువపరచి, యథాసంభవముగా

నాయోగ్యతలు తమ కున్నవని నిరూపించుటకే నన్నయ తననుగూర్చియు, రాజరాజును గూర్చియు కొన్ని విశేషముల బేర్కొనెను. ఇంతియేకాని అవి ఆత్మపర స్తుతులు కానేరవు. ఈ కారణముననే రాజరాజు మహాభారతమును తన కంకిత మిమ్మని కోరుటగాని, నన్నయ అద్దానిని ఆ రాజున కంకిత మిచ్చుటగాని జరుగలేదు. ఇట్లాంధ్ర సాహిత్య సామ్రాజ్యమునకు పునాది వేసిన రాజరాజును నన్నయయు—

"ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్,
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి."
(కావ్యాదర్శము- 1-5)

అను దండ్యాచార్యోక్తి ననుసరించి, అజరామరులై, యశశ్శరీరులై, ఆచంద్ర తారార్కము, అశేషాంధ్రహృదయపీఠముల సుప్రతిష్ఠితులై వెలసియుండ గలరు.

నన్నయ కాలమున పండితపరిషత్తు లనేకము లుండెను. దిగ్దంతుల వంటి మహాపండితులకే ఆ పరిషత్తులలో సభ్యత్వ ముండెను. ఆ పరిషత్తు లలో విజయము సాధించినవాడే పండితుడు; వీనిలో ఆమోదింపబడినదే కావ్యము. నన్నయయు ఆ పరిషత్తుల సమ్మతిని సంపాదింపవలసియుండెను.

బహుముఖములుగా విస్తరిల్లియుండిన సంస్కృతసారస్వతము, ఆ కాలపు పండితుల గౌరవాదరములకు పాత్రమైయుండెను. సంస్కృతములోని మాధుర్యమును, అర్థవ్యక్తీకరణశక్తిని, ఆ గ్రంథములలోని రసభావాద్యనేక విషయజాలమును తనివిదీర గ్రోలి, నిత్యసంతుష్టులై యున్న మహాపండితు లను మెప్పించుట సుసాధ్యము కాదు. నన్నయ కున్న క్లేశ మింతమాత్రమే కాదు. నిత్యవ్యవహారమాత్రపరిమితమైనదో, లేక చిన్నచిన్న దేశికవితలకు మాత్రమే పరిమితమైనదో యగు తెలుగుభాషలో మహాగ్రంథమును వ్రాసి,

వారిమెప్పును సంపాదింపవలసి యుండెను. సర్వాంగ సుందరముగా పరిపుష్ట మైన సంస్కృతభాషకును, శైశవావస్థలో నుండు తెలుగుభాషకును సాజాత్య మేముండును? నన్నయవంటి మహామనీషియు, సాహసియు నగువాడుగాక, మరెవ్వడీ దుర్ఘటమగు కార్యమునకు పూనుకొనగలడు? నన్నయకును ఈ పండిత పరిషత్తులపై ఎనలేని గౌరవప్రపత్తు లున్నవి. ఈ పరిషత్తులు మెచ్చినగాని, తనగ్రంథము నిలువజాలదనియు నన్నయ యెరుగును. వీని మెప్పుదలను బడయుటయే తన పరమలక్ష్య మను నంశమును సూచింపుటకే, పర్వవివరణ మొనరింపతరి, ప్రతిపర్వాంతమునను ఈ పరిషత్తుల నాతడు పేర్కొనెను.

శిష్టజనాంగీకృతములగు దేశీయరూపములను స్వీకరించియు, జన సామాన్యవ్యవహారములో నుండు తద్భవరూపములను యథాయోగ్యముగ సంస్కరించి తీసికొనియు, ఆవశ్యకములగు తత్సమ రూపముల నసంఖ్యాక ముల కల్పించియు, సంస్కృత సిద్ధసమాసముల గ్రహించియు, శబ్దరూప కల్పనవిధానముల ననేకముల నేర్పరచియు, శైశవదశలో నుండు తెలుగు భాషకు పరిపూర్ణతను సాధించుటకై నన్నయ ఒక ప్రణాళిక నేర్పరచుకొని యుండవచ్చును. ఈ ప్రణాళిక నేర్పరచుకొనుటలోను, దీనిద్వారా భాషాభి వృద్ధిని సాధించుటలోను, ఇట్లు పుష్టమగు భాషమూలమున మహాకావ్యమును నిర్మించుటలోను, నిర్మితమైన గ్రంథ భాగములకు పండితపరిషత్తులలో నామోదమును సంపాదించుటలోను, నన్నయకు అనన్యాదృశమగు ప్రోత్సా హము నిచ్చి, అతనిని కార్యోన్ముఖుని గావించిన సన్మిత్రుడు నారాయణభట్టు. ఇట్లండగా నిలిచి, తనచే నీ మహాకార్యమును సాధింపజేసినవాడు కావుననే, పాకశాసనికి నారాయణునివలె, నారాయణభట్టు తనకు చేదోడు వాదోడుగా నుండె నని అవతారికలో పేర్కొనెను. ఈ ఉపకారస్మృతితో నన్నయ తన వినీత చిత్తవృత్తిని ప్రదర్శించుటయేగాక, శ్రీమన్నారాయణుడే తన మూల మున నీకార్యమును సాధించె ననియు సూచించియున్నాడు.

# న న్న య

ఇట్లు అర్హమగు భాషను సమకూర్చుకొని, నన్నయ, విఘ్నోప శాంతికై కావ్యప్రారంభమున చేయవలసిన మంగళమును-ఆశీర్వాదరూపమగు దానిని, సంస్కృత భాషలోనే కల్పించెను. దీనితో సంస్కృతముపై తన కున్న గౌరవమును ప్రకటించుటయేగాక, ఆ సంస్కృతమునకే రూపాం తరమో యనదగు తెలుగుభాషలో తాను సృష్టించిన కావ్యమును, దేశభాషలో వ్రాయబడినదే యైనను, తన్మూలమున ప్రతిపాదితమగు విషయజాలము నిర్దుష్టమైనదైనచో, గుణగ్రహణ పారీణులగు పరిషత్సభ్యులు ఆమోదించి, తమ సంతృప్తి నెరుకపరచుట భావ్యమనియు సూచించెను.

ఆశీర్వాదాత్మకమగు సంస్కృతమంగళముతో కావ్యమును ప్రారం భించిన నన్నయ, కావ్యప్రారంభమున కొక అవతారికను కల్పించెను. ఈ అవతారికా రచనపద్ధతి తర్వాతికవులకు ఒక అవర్జనీయమైన సంప్రదాయ ముగా నేర్పడినది. శ్రీకారముతో కావ్యమును ప్రారంభించుట, ఇష్టదేవతా స్తుతి, కృతిభర్తృ - కృతికర్తృవంశవర్ణనములు, గ్రంథప్రాశస్త్య నిరూ పణము మొదలగు విషయముల నవతారికలో కల్పించుట నన్నయ తర్వాతి కాలమున సంప్రదాయమై వెలసినది.

నన్నయ తన కవిత్వలక్షణముల నీ రీతి వివరించెను—

సారమతిం గవీంద్రులు ప్ర
    సన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా, నితరు
    లక్షర రమ్యత నాదరింప, నా
నారుచిరార్థసూక్తి నిధి
    నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితారచన
    బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.''

(ఆది. 1-25)

మహాకవులు, తన కవిత్వము ప్రసన్నకథా కలితార్థయుక్త మైనదని గుర్తెరింగి మేలని సంభావింతురు; ఇతరులు దానిలోని అక్షరరమ్యత నాదరింతురు; తాను నానారుచిరార్థసూక్తినిధిగాన, తన కవిత యట్టిసూక్తులతో నిండియుండును. ఇట్టి లక్షణ లక్షితమగు తన కృతికి పరమలక్ష్యము జగద్ధితమే. ఈ పరమోద్దేశ్యముతో తెలుగున తొలికావ్యమును సృష్టించిన నన్నయ ఆంధ్రుల కాదికవి యయ్యెను. నన్నయ భారతాంధ్రీకరణమునకు పూనుకొనెనేకాని, తుదివరకు నిర్వహింపలేకపోయెను. ఆది సభాపర్వములను, ఆరణ్యపర్వములో,

"శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి, సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరము లంబరపూరితంబులై."
(ఆరణ్య. 4-142)

అను పద్యము వరకును మాత్రమే తెనిగించెను. అతడు ఉత్తమ లోకముల కేగుటయే గ్రంథము మధ్యలో నాగుటకు కారణమై యుండును. ఈతని తర్వాత సుమారు రెండువందల సంవత్సరములకు తిక్కన విరాట పర్వమాదిగాగల పదేనుపర్వముల నాంధ్రీకరించెను. ఆ పిమ్మట సుమారు పంద సంవత్సరములకు ఎఱ్ఱన ఆరణ్య పర్వశేషమును తద్రచనయకా పూరించెను. ఇట్లు ఈ కవిత్రయమువలన మూడువందల సంవత్సరముల కాలములో భారతాంధ్రీకరణము సమాప్తమైనది. ఋషికల్పుడగు నన్నయ, తన ప్రార్థన పద్యములోని "భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరాః శ్రేయసే" అను వాక్యముతోను, చివరి పద్యములోని "పరపూరితంబులై, చారుతరంబు లయ్యె" అను మాటలతోను, కవిత్రయమువలననే భారతాంధ్రీకరణము పరిసమాప్తి నొందగల దని సూచించెనని కొందరు విమర్శకుల యూహ. ఇది

సత్యమే కావచ్చును. "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి" యనిగద ఆర్యోక్తి!

తిక్కన "అం దాదిదొడంగి మూడు కృతు లాంధ్రకవిత్వ విశార దుండు విద్యాదయితుం డొనర్చె" అనియు, మారన, "భారత సంహితన్ మును ద్రిపర్వము లెవ్వ డొనర్చె" ననియు, నన్నయయే ఆదిసభారణ్యపర్వ ముల రచించె నని స్పష్టముగా వ్రాసియుండుటనుబట్టి, ఆరణ్యపర్వోత్తర భాగము క్రిమిదష్టము కాగా, నష్టభాగములను మాత్రమే ఎఱ్ఱన పూరించె నని కొందరు విమర్శకు లూహించుచున్నారు. కాని ఈ యూహకు ఇతరములగు ప్రమాణము లెవ్వియు లేనందున, నన్నయ రచింపక విడచిన శేషభాగమునే ఎఱ్ఱన రచించి, భారతమును సంపూర్ణ మొనర్చెననుటయే అనేక విమర్శ కాంగీకృత సిద్ధాంతము.

నన్నయ సంస్కృతభారతమును యథాతథముగా నాంధ్రీకరింప తల పెట్టలేదు. తనది అనువాదమేయైనను, స్వతంత్ర రచనవలె భాసింపవలె ననుటయే ఆతని సంకల్పము. కావుననే అతడు మూలభారతములోని కొన్ని యంశములను పరిత్యజించియు, కొన్నింటిని సంగ్రహించియు, మరికొన్నిం టిని ఔచిత్యానుగుణముగా విస్తరించియు, కొన్ని యెడల ప్రాచీన కవుల భావములను స్వీకరించియు, మరికొన్ని యెడల వినూత్న కల్పనలు గావిం చియు, ఆంధ్రమహాభారతమును సర్వాంగసుందరముగా సృష్టించి, అను వాదమేయైనను, స్వతంత్రకావ్యమే యనునట్లు రూపింపచేసెను. ప్రధాన కథకు అంతగా నదుకక, సుదీర్ఘమై విసువును కల్గించునట్టివగు ఉపమన్యువు, ఆరుణి, వేదుడు మొదలగువారి కథలను నన్నయ పరిత్యజించెను. మూలమున బృహస్పతి, దీర్ఘతముని శపించుటకు గల కారణము అసహ్యకరమగు శృంగారముతో నిండియున్నది. ఉచితజ్ఞుడైన నన్నయ, దీనిని చాల నేర్పుతో సంగ్రహించెను. పలుతావుల పునరుక్తముల పరిహరించెను. జరత్కారుకథ,

పరీక్షిద్వృత్తాంతము, మూలమున రెండు తావుల నుండగా, నన్నయ వానిని ఉచితమగు పట్టున నొక్కచోటనే వర్ణించెను. ఖాండవ ప్రస్థమునకు వెడలిన పాండవులకు విశ్వకర్మ ఇంద్రప్రస్థపురమును నిర్మించి ఇచ్చెను. మూలమున సంక్షిప్తముగా నున్న దీనిని నన్నయ పది పద్యములలో కడు రమ్యముగా వర్ణించెను. సర్వసర్వంసహా రక్షణదక్షులగు పాండవుల పట్టణము, కౌరవుల హస్తినాపురికంటె ఎన్నియో మడుంగులు సుందరమైయుండుట న్యాయ మను తలంపుతో నన్నయ దీని నిట్లు గొప్పగా వర్ణించి యుండును. కిరాత రూపమును వీడి, స్వస్వరూపముతో ప్రత్యక్షమైన పరమశివుని, తన యప రాధమును క్షమింపు మని అర్జునుడు ప్రార్థించెను. ఈ చోటున అమూలక మగు దండకము నొకదానిని నన్నయ విరచించెను. ఈ దండకము అర్జునుని భక్తితత్పరతను నిరూపించుచున్నది.

పరాశర మునీంద్రుడు మత్స్యగంధిని చూచి, కామపరతంత్రుడయ్యె ననుటను వ్యాసుడు—

"అతీవ రూపసంపన్నాం సిద్ధానా మపి కాంక్షితామ్,
దృష్ట్వైవ చ స తాం ధీమాన్ చకమే చారుదర్శనామ్."

అను శ్లోకమున, అత్యంతరూపవతియు, సిద్ధులకును కాంక్షింపదగినదియు నగు ఆ సుందరాంగిని చూచినదే తడవుగా, ఆ ధీమంతుడు కామించెను-అని చెప్పెను. పరాశరునివంటి పరమజితేంద్రియునికూడ సమ్మోహపరచిన మత్స్య గంధిరూపము అసాధారణమైనదియే యై యుండవలెను. వ్యాసుని శ్లోకమున పరాశరుని వ్యామోహకారణము, తద్వర్ణనము చాలినంతగా లేవను తలం పుతో నన్నయ దాని నిట్లు వర్ణించెను.

"చపలాక్షి చూపులచాడ్పున కెడ మెచ్చుc,
జిక్కని చనుcగవc జీఱcగోరు,
నన్నువ కౌcదీcగ యందంబు మది నిల్పు,
జఘన చక్రంబుపైc జలుపు దృష్టి,
యభిలాష మేర్పడునట్లుండగాc బల్కు,
వేడ్కతో మఱుమాట వినcగcదివురు,
నతిఘనలజ్జావనత యగు నక్కన్య
పైcబడి లజ్జయుcబాపcగడcగు,
నెంత శాంతులయ్యు, నెంత జితేంద్రియు
లయ్యుc, గడు వివిక్తమయిన చోట
సతులగోష్ఠిc జిత్తచలన మొందుదు రెందుc,
గాముశక్తి నోర్వcగలరె జనులు?"

(ఆది. 3-38)

ఇట్లే రాజసూయయాగావసరమున, శ్రీకృష్ణున కగ్రపూజ యొనర్చుట నోర్వని శిశుపాలుడు ఆగ్రహముతో అధిక్షేపించెను. అప్పుడు సకల క్షత్రియ సంక్షోభ మేర్పడిన దనుటను వ్యాసు డిట్లు వర్ణించెను—

"తతః సాగరసంకాశం దృష్ట్వా నృపతిసాగరమ్,
రోషా త్ప్రచలితం సర్వ మిద మాహ యుధిష్ఠిరః."

దీనినే నన్నయ—

"రయవిచలత్తురంగమ త
రంగములన్ మదనాగనక్ర సం
చయముల సంచలచ్చటుల
సైనికమత్స్యములన్ భయంకరం

బయి యదువృష్ణిభోజకుకు
రాంధకవాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుత ని
తాంతసమీరితమై క్షణంబునన్."

(సభా. 2-33)

అని వ్యాఖ్యానప్రాయముగా వర్ణించెను. ఇందలి సావయవ రూపకము, వ్యాసుడనిన 'నృపతిసాగరమ్' అను మాటను స్పష్టపరచి, సంక్షుభితమైన సేనా స్వరూపమును చక్కగా నిరూపించినది.

అర్జునుడు ద్రుపదుని రథాక్షమునకు గట్టితెచ్చి ద్రోణునకు గురుదక్షిణగా నిచ్చెను. అట్టి ద్రుపదుని చూచి ద్రోణుడు ఎకసక్కెములాడుటను నన్నయ ఇట్లు చిత్రించెను—

"వీరెవ్వరయ్య? ద్రుపద మ
హారాజులె! యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె? యహహా! మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో?"

(ఆది. 6-90)

ఈ పరిహాసము అమూలమైనది. ఇందు ద్రోణుని పరాభవము, ద్రుపదునిపై ఆతని కున్న కసి, వ్యంగ్యమర్యాదతో భాసించుచునే యున్నవి. జాతీయమగు ఈ ప్రశ్న పరంపర, సన్నివేశమునకు చక్కగా పొసగి, కథను రసవత్తర మొనరించుచున్నది.

నన్నయకు వ్యాసునిపై మితిలేని భక్తి కలదు. కావుననే, కొన్ని పట్టుల మూలములోని వాక్యములను, పదములను, ఆంధ్రీకరణమున నట్లే

స్వీకరించెను. శ్రీకృష్ణుని నిందించు శిశుపాలునిపై నలిగిన భీముడు, అతి రౌద్రాకారమును దాల్చెనట. ఆ రౌద్రమూర్తిని వ్యాసు డిట్లు వర్ణించెను—

"తస్య పద్మప్రతీకాశే స్వభావాయతవిస్తృతే,
భూయః క్రోధాభితామ్రాంతే రక్తే నేత్రే బభూవతుః.
త్రిశిఖాం భ్రుకుటీం చాస్య దదృశు స్సర్వపార్థివాః,
లలాటస్థాం త్రికూటస్థాం గంగాం త్రిపథగా మివ."

దీనికి నన్నయ అనువాద మిది—

ప్రకటితకోపవేగమునఁ
బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరు
ణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ
బొల్చెఁ ద్రికూటతటీత్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజనప్రియత
నూజున కంతకమూర్తి కచ్చటన్."

(సభా 2-51)

ఇట్లు ఇతిహాసరూపమగు వ్యాస భారతము నాంధ్రీకరించుచు నన్నయ దానిలో కొన్ని కావ్యలక్షణముల సమకూర్చి, ఆంధ్రభారతము తెలుగువారి తొలికావ్య మనునట్లు దానిని మలచెను. ఇం దాతడు ప్రదర్శించిన ప్రతిభ, తిక్కనాదుల కాదర్శప్రాయమైనది.

బృహత్పరిణామిక నేర్పరచుకొని, ఉదాత్తములగు కవితా లక్షణములతో, జగత్కల్యాణ సాధనాకాంక్షియైన నన్నయ మహాభారతాంధ్రీకరణమునకు ప్రారంభించెను. అతనిచేతబడిన భారత భాగమంత రసవంతమైనది కాదు. పాండవు లరణ్యవాసము చేయుచున్నప్పుడు, భీమసేనుడు సౌగంధికాహరణమునకై వెడలి మరలివచ్చువరకు నున్న కథనే నన్నయ వివరించెను. ప్రధాన కథలో ఇది చాల తక్కువ భాగము. ఇదిగాక రసవంతములుకాని పర్వానుక్రమణిక, అక్షౌహిణీసంఖ్యా కథనము మొదలగు విషయములతోను, అనేకోపాఖ్యానములతోను ఈ భాగము నిండియున్నది. ప్రధాన కథలో రసవంతములగు ఘట్టములు, సన్నివేశములు, ఆయా పాత్రల మనోధర్మ వ్యక్తీకరణము మొదలగు విషయము లన్నియు, విరాటపర్వమునుండియే యున్నవి. అయినను, ప్రధాన కథలోని ఈ ప్రాథమిక కథా భాగమునను, ప్రాసంగికములగు ఉపాఖ్యానములలోను నన్నయ తన కవితా లక్షణముల నెట్లు ఆవిష్కరించెనో పరిశీలింపవలసి యున్నది.

ఇతని కవితా లక్షణములలో మొదటిది ప్రసన్నకథా కలితార్థయుక్తి. ప్రసన్నములగు కథలయందు సమకూర్పబడిన విషయ విశేషములతో కూడియుండునది, అనిగాని, ప్రసన్నములగు కథాగత విషయములతో నొప్పారియుండునది, అనిగాని దీని కర్థమగును. ప్రసన్నములగు కథలలోని విషయము ప్రసన్నముగనే యుండును; లేక, నిరూపింపబడిన కథలలోని విషయములు ప్రసన్నములై యుండును—అని తాత్పర్యము. ఉపపాదిత విషయము లన్నియు ప్రసన్నములైనవే యనుట సారము. కథాకథనమున నన్నయ అత్యంత శ్రద్ధ వహించె ననుట తేలిన సారాంశము.

నన్నయ భారతమున ఉపాఖ్యానము లనేకము లున్నవి. ప్రధాన కథాగమనమునకు ఆటంకము కాని విధముగా పాఠకుల మనస్సులను రంజింప

జేయుచు, ఉపాఖ్యానములను చెప్పుటలో నన్నయ ఎంతో సామర్థ్యమును ప్రదర్శించెను. ప్రసన్న కథాకలితార్థయుక్తి ఈ ఉపాఖ్యాన నిర్వహణములో అత్యంత రమణీయముగా భాసించుచున్నది. కథాగతార్థములను ప్రసన్నము లొనరించుటకై నన్నయ, అనావశ్యకములు, అసందర్భములు, కథాగతి నిరోధకములు నగు వర్ణనములను, తత్త్వకథనములను, ధర్మోపదేశములను పరిహరించెను. మూలమున స్పష్టముగా చెప్పబడని అంశములను వ్యంగ్య రూపముననో, వాచ్యముగనో స్పష్టపరచును; మూలములోని మాటలకు చమత్కారముగా వ్యాఖ్యాన మొనరించును. మూలమున లేకున్నను, ఆ యా సన్నివేశములకు, రసభావములకును, ఉచితములు, ఉద్దీపకములును నగు పద ముల ప్రయోగించియు, సంభాషణముల కల్పించియు, వానిని ప్రసన్నములు చేయును; ఈ సందర్భములలో వృత్తౌచిత్యమును గూడ పాటించును. నన్నయ ఔచితీపరిజ్ఞానము, లోకజ్ఞత, సూక్ష్మపరిశీలనాసక్తి, విశిష్టవైఖరిలో కథాకథన నైపుణ్యము, ఈ ఉపాఖ్యానములలో స్పష్టముగా గోచరించు చుండును.

ఇతివృత్తములోని వైశిష్ట్యము నాధారము చేసికొనియు, పాత్రల మనోధర్మ ప్రవృత్తుల ననుసరించియు, విశిష్టాంశములను బట్టియు ఈ ఉపా ఖ్యానములలో వైవిధ్య మున్నది. ఇందు కొన్ని రాజులకు చెందినవి; మరి కొన్ని మహర్షులకు సంబంధించినవి; కొన్ని పాత్రల మనస్తత్త్వ ప్రవృత్తుల నాధారముచేసికొని యుండునవి; కొన్ని లౌకికములు; మరికొన్ని వైదికములు. ఈ అన్ని తెగల కథలకును ఒకేవిధమగు శిల్పము ననుసరించుట యుక్త ముగా నుండదు. నన్నయ వానివాని స్వభావమునుబట్టి భిన్నభిన్న శిల్పములనే ప్రదర్శించెను. యయాతికథ, సుకన్యకథ - ఈ రెండును వస్తువునుబట్టి ఒక కోవకు చెందినవి. వీనిలో వ్యంగ్యము ప్రధానముగా భాసించుచున్నది. నలో పాఖ్యానము, దుష్యంతోపాఖ్యానము - ఇవి రాజులకు సంబంధించిన కథలు.

ఇట్టి కథలలో నన్నయ మూలములోని భావములనేగాక, ఆయా ఇతివృత్తము లకు సంబంధించిన పూర్వ సంస్కృతకవుల కావ్యాదులలోని భావములను సైతము గ్రహించెను. ఇట్టివానిలో నితివృత్తమునకే ప్రాధాన్యముండును. ప్రమద్వరకథ, ఋష్యశృంగుని కథ-ఇవి మనస్తత్త్వ ప్రధానములగు కథలు. నన్నయ పాత్రల సంభాషణాదులతోనే కథను నడిపింపడు; తాను పాత్రలలో విలీనుడుకాక, తటస్థుడుగనే యుండి, పాత్రల మనఃప్రవృత్తులను, స్వరూప స్వభావాదులను, వ్యంగ్యముగా వ్యాఖ్యానించుచు, ఆయా కథాంశములను వ్యక్తము చేయుచుండును. ఇట్టి పద్ధతులతో నన్నయ కథలను, కథార్థములను ప్రసన్నముల జేయును.

నన్నయ అతిమనోహరముగా తీర్చి దిద్దిన ఉపాఖ్యానములలో దుష్యంతోపాఖ్యాన మొకటి. దుష్యంతచక్రవర్తి మృగయార్థియై అరణ్య ములకు వెడలెను. వేటతమకమున కణ్వాశ్రమోపాంత ప్రదేశమువరకు పోయెను. ఆశ్రమమును గుర్తించిన దుష్యంతుడు కణ్వదర్శనార్థియై ఆశ్రమ మున ప్రవేశించి, శకుంతల చేసిన సపర్యల నందుకొనెను. అనన్యసాధారణ మగు ఆమె సౌందర్యము అతని హృదయము నాకర్షించెను. నీ వెవ్వర వని యామెను ప్రశ్నించెను. తాను కణ్వదుహిత నని ఆమె బదులు చెప్పెను. అప్పుడా రాజు, తన మనసులో నిట్లు వితర్కించెను—

"ఇది మునికన్యయేని, మఱి
యేలొకొ యీ లలితాంగియందు నా
హృదయము దద్దయుం దవిలె,
నిప్పలు కింతను నమ్మనేర న

యెవ్వఁడ, విజితేంద్రియుండనంగ
నిమ్మునిఁ బాయక వింద నంచు, దా
నిది కలయా పెఱుంగ నవ
నీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్."

(ఆది. 4-30)

ఈమె మునికన్యయే యైనచో నా మన సేల ఈమెయందు లగ్నమైనది? కాన,నీమాటను నమ్మ నేరక ననుకొనినాడు. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" అను కాళిదాసు మాటల నివి స్ఫురింపజేయుచున్నవి. అదే ప్రశ్న నడిగినాడు. కణ్వుడు మరియొక మహర్షికి చెప్పుచుండగా వినిన తన జన్మవృత్తాంతమును, వినినదానిని వినినట్లు, ఆతనికామె చెప్పినది. అప్పుడు దుష్యంతుడు—

"ఇది మునినాథకన్య యని
యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్త్రి నని
యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిఁగించినన్ మదన
బాణపరంపర కిప్పుడుండ నా
స్పదమయి సంచలించె నళి
పాత వికంపిత పంకజాకృతిన్."

(ఆది. 4-51)

అని యనుకొనుచు మదనాతురుడైనాడు. ఈ రెండు పద్యములతో కథాకథనమున కొక రమ్యమగు శిల్పము సమకూరుటయేగాక, శకుంతలాదుష్యంతుల సమాగమమున కొక నీతిమార్గమును ఏర్పడినది. గాంధర్వవిధితో నామెను వివాహమాడి, త్వరలో పిలిపించుకొందు నని చెప్పి, తన నగరమునకు రాజు వెడలెను. బహుకార్యమగ్నతవలన నాత డావిషయమునే విస్మరించెను. ఇట, శకుంతలకు కుమారుడు జన్మించెను. పెరిగి పెద్దయైన వాని జూచి, యౌవరాజ్యపట్టాభిషేకమున కర్హు డని భావించిన కణ్వుడు,శకుంతలను కుమారునితో దుష్యంతుని యొద్దకు పంపెను. లోకాపవాదభీతితో రా జామెను స్వీకరించుటకు నిరాకరించెను. ఆశరీరవాణి వార్తతో సత్య మెరుకపడగా, రాజు భార్యాపుత్రులను పరిగ్రహించెను. ఇది నన్నయ చెప్పిన కథాసారము. ఇం దీతడు కాళిదాసు భావములను కొన్నింటిని స్వీకరించి, తన కథా కథన సామర్థ్యముతో మూలకథను ప్రసన్నము చేసెను.

నన్నయ కథ నంతటినిగాని, దానిలోని సూక్ష్మవిషయములనన్నింటిని గాని వాచ్యముగా చెప్పడు; కొంత చెప్పి, మిగిలిన దానిని పాఠకుల భావనకు వదలివేయును. పాఠకుని యూహ కా యా విషయముల స్ఫురింపజేయుటకై వ్యంగ్యరచన సాగించును. ఇట్లాతడు చెప్పినదియు, పాఠకు డూహించు నదియు కలిసి, సమగ్రముగా రూపొంది, కథ ప్రసన్న మగును, ఇదియే నన్నయలోని విశిష్టత.

కాళిదాసుశకుంతలవలె, నన్నయశకుంతల ముగ్ధ కాదు. అవసరమగు నెడల ప్రౌఢముగా వ్యవహరింపజాలిన ధీర. మహర్షుల సన్నిధానమున నామె యెన్నియో తత్త్వార్థముల నవగతము చేసికొన్న ప్రతిభాశాలిని. ఆమె కుందు శ్రుతపాండిత్యము తలస్పర్శియైనది. ఐహికభోగములు తుచ్ఛములు; వానిపై మోహమును పెంచుకొనుట వినాశహేతువగు నను తత్త్వార్థము నామె

గ్రహించుకొనినది. కావుననే తన మాతాపితరుల ప్రణయ వృత్తాంతమును, తన జన్మక్రమమును నిర్లజ్జముగను, నిస్సంకోచముగను దుష్యంతునికి చెప్పినది. అత డామెను వివాహమాడదలచినపుడు, తనకు కల్గు కుమారునకే యౌవరాజ్య పట్టాభిషేకము చేయుట కంగీకరించినచో తా నాతనిని పరిణయ మాడ సమ్మతింతునని అనపెట్టగల్గినది. వివాహము సత్సంతాన ప్రాప్తి కుద్దేశింపబడినదే కాని, కామప్రవృత్తికి కాదనుట - ఆమె అంతరాంతరములలో జీర్ణమైన యంశము. తరువాత దుష్యంతుడు ఆమెను విస్మరించి, అసత్యవాది యైనాడు. ఆమె విరహవేదనా దోదూయమాన మానసయై, ఏకవేణీధరయై, సర్వము సేవగించి, చిక్కి శల్యావశిష్టయై పోలేదు. తన ముద్దుల కుమారుని లోనే తనపతిని చూచుకొని తృప్తిపడినది. దుష్యంతుని ఉదారముగా క్షమించినది. దుష్యంతునితో తన వివాహము సత్పుత్రఫలమును తప్పక ఇచ్చునన్నది - ఆమె ఆత్మవిశ్వాసము. ఆ కాంక్షతోనే ఆమె వివాహమునకు సమ్మతించినది, రాజభోగముల ననుభవించు తలంపుతోగాదు. యోగ దృష్టితో వీరి గాంధర్వ వివాహమును గుర్తించి, సంతసించిన కణ్వుడు, వరము వేడుమని శకుంతలను కోరగా, 'నాచిత్తం బెప్పుడు ధర్మమునంద తగిలి యుండవలయును, నాకుద్భవిల్లెడు పుత్రుడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యబలసమన్వితుండును, వంశకర్తయును గావలయును' అని ప్రార్థించినది. ఈ రెండు కోరికలతో శకుంతల యెట్టిదో మనము స్పష్టముగా నూహింపగలము. దుష్యంతుడు తనను తిరస్కరించినపుడు శకుంతల ఆతనికి హితబోధ చేసినది. మనము చేయు కార్యములకు సూర్యచంద్రాది దేవతలు సాక్ష్యముందు రనియు, సంతానవతియు, పతివ్రతయు నగు భార్యను పరిగ్రహింపకుండుట న్యాయము గాదనియు, ఇట్లింకను అనేకధర్మములను బోధించినది. వీని నన్నింటిని దుష్యంతుడును ఎరుగును. తా నెరిగి, ఆత డెరుగని విషయము నొక్కదానిని ఆమె ఎంత చక్కగా చెప్పినదో చూడుడు—

"విపరీత ప్రతిభాష లేమిటికి ను
ర్వీనాథ! యీ పుత్రగా
త్రపరిష్వంగసుఖంబు సేకొనుము, ము
క్తాహార కర్పూర సాం
ద్రపరాగప్రసరంబుఁ, జందనముఁ, జం
ద్రజ్యోత్స్నయుం, బుత్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృ
ద్యంబే? కడున్ శీతమే?"

(ఆది. 4-91)

ఈ సుఖము నీ కనుభూతపూర్వము గాదు. ఇది ఆశించినంత మాత్రముచేతనే ఎల్లరకును లభించునదియు గాదు. ఇట్టి దుర్లభ సుఖము నీకు లభింపనుండ, ఏదో కారణమున, దీనిని పోగొట్టుకొనుట, నీవంటివానికి అర్హమగునది గాదు. దీని నిప్పుడు వలదందువేని, మరి నీ జన్మలో మరల నిట్టిది లభింపదు—అని దుష్యంతుని ఎంత చక్కఁగా మందలించినది! ఇక, సత్యవాక్పరిపాలనా ప్రాశస్త్యము ననేకవిధములుగా వెల్లడిజేసినది. ఎంత చెప్పినను, లోకాపవాదభీతచేతస్కుఁడైన దుష్యంతు డంగీకరింపకపోగా, శకుంతల 'ఇంక దైవంబకాని యొండు శరణంబు లే'దని భావించి, క్రమ్మరిపోవ బయలుదేరినది. ఈ జరిగిన దంతయు దైవవిలసితమే యనియు, తన పాప విశేషమే దీని కంతకును కారణ మనియు, అనన్యగతికయై భగవంతుని శరణు చొచ్చిన, తప్పక అతని యనుగ్రహము లభించుననియు ఆమె విశ్వాసము.

ఈ శకుంతల కేవలము నన్నయసృష్టి కాదు. వ్యాసు డీతని కనుగ్రహించినదే. వ్యాస-నన్నయల శకుంతలలు అభిన్నరూపలే. అయినను, వ్యాస శకుంతలవలె నన్నయ శకుంతల నిరర్థక భాషణము లాడదు. పున

రు క్తుల పరిహరించి, చాల పొంకముగా మాటలాడనేర్చినది, నన్నయ పెంప కములో శకుంతల కీ సామర్థ్య మబ్బినది. పుత్రహీనుడగు దుష్యంతుడు, సపుత్రకయై వచ్చిన తన ధర్మపత్నినే విసర్జించు మూఢుడును, పాపాత్ము డును కాడు. తమ సంబంధము ధర్మబద్ధమైనదే యని తన ప్రజ విశ్వసించిన పిదపనే, వారిని తాను స్వీకరింపదలచినాడు. పరమధార్మికుడును, సత్యసంధు డును అగు తనకును, పరమసాధ్వీమణియు, మేనకావిశ్వామిత్రుల సంతాన మును, కణ్వర్షి పెంపుడుకూతురును అగు శకుంతలకును గల సంబంధము పవిత్రమైనదని లోకమునకు చాటి, దేవతలు తన కుపకరింపగలరని నమ్మియే వారిని తిరస్కరించినాడు. యుద్ధములలో సహాయముచేసి, ఇంద్రపదవిలో దేవేంద్రుని నిలుపజాలిన దుష్యంతునకు ఈ మాత్రపు వాక్సాహాయ్యము చేయుట దేవతలకు విధియే యగునుకాని, అనుగ్రహము కానేరదు.

నన్నయ పేర్కొనిన రెండవ కవితాలక్షణము, అక్షరరమ్యత. శ్రవణ పేయములగు పదములను ఏరి కూర్చుట, విననింపుగానుండునట్టి అక్షరముల సంయోజనము పద్యములను లయాత్మక మొనరించును. వాక్యములో పద ములు కొన్ని కొన్ని స్థానములం దున్నప్పుడే ఆ వాక్యము రమణీయముగా నుండును. ఆ యా స్థానములందు వేరు పదములను ప్రయోగించినచో, ఆ రమణీయత, అర్థగౌరవము - చెడుటయో, శ్రుతికి కటువుగా నుండుటయో సంభవించును. దీనినే మనము శయ్య అనియు చెప్పవచ్చును. ఈ శయ్యను సంకల్పించిన మొదటి తెలుగు కవి నన్నయయే. తర్వాత దీనిని నాచనసోము డనుసరింపగా, పోతన దీనికే, తన భాగవతమున ప్రాధాన్యము నొసగెను. తర్వాత ప్రబంధ కవులందరును తమ ప్రబంధములలో ఈ శయ్యాసౌభాగ్య మును ప్రముఖముగా నెలకొల్పిరి.

భావప్రకటనమందు, అర్థస్ఫూర్తియందును వర్ణములు అత్యంతసమర్థ ములై యుండును.కొన్ని అక్షరములు లలితశబ్దములను కల్పించుటలో శక్తి

మంతములు కాగా, మరికొన్ని అక్షరములు కేవలపరుషార్థమునే ధ్వనింప జేయును. రసాభివ్యక్తియందును ఈ అక్షరములకు మిక్కిలి పటుత్వము కలదు. పద్యభావము పాఠకులకు చక్కగా బోధపడుటకు అందలి అక్షర క్రమము తోడ్పడి, రసస్ఫూర్తిని కూడ కలుగజేయును. కావున అక్షరరమ్యత యనునది శబ్దగతమగు గుణమని అనుకొనవచ్చును. నన్నయ సాధించిన కథా ప్రసన్నతకు ఈ అక్షరరమ్యతకూడ ఒక కారణ మగుచున్నది. వసంతోదయ మును రమ్యములగు అక్షరములతో మనోజ్ఞముగా లయగ్రాహివృత్తములో నన్నయ ఎట్లు వర్ణించెనో చూడుడు—

"కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధు
    పమ్ములసుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధ వకు
    ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ములరవమ్ము మధు
    రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనో భా
రమ్ముల నశోకనికరమ్ములును జంపక చ
    యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్."

(ఆది. 5-138)

ఇట్టివే మరికొన్ని యుదాహరణములను చూడవచ్చును—

"దళితనవీనకందళ క
    దంబకదంబక కేతకీరజో
మిళిత సుగంధబంధుర స
    మీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా

నులియుచు మొల్లగుత్తులను
నుయ్యెల లొప్పఁగ నెక్కి యూఁగె ను
ల్లల దళినీకులంబు మృదు
లధ్వనిగీతము విస్తరించుచున్."

(అరణ్య. 4-138)

"వివిధోత్తుంగ తరంగ ఘట్టన చల
ద్వేలావనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా
లాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం
దత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజనిభు న
య్యశ్వోత్తమున్ దవ్వులన్."

(ఆది. 2-30)

నన్నయ తాను నానారుచిరార్థ సూక్తినిధి యని చెప్పుకొనెను. సూక్తులనగా మంచి మాట లని అర్థము. కావ్యమునందలి ధర్మోపదేశమునకు, తత్త్వబోధనకు ఈ సూక్తులు అత్యంతావశ్యకములు. నన్నయ మూలమునందు లేనితావుల కూడ ఈ సూక్తులను కల్పించి వ్రాసెను. వేదసారమును కలిగి పంచమ వేదమై వెలసిన భారతము నీతివాక్యములకును, ధర్మసూత్రములకును, ఆప్తవాక్యములకును నెలవు. భారతమును జాతీయ గ్రంధముగా గౌరవించు తెలుగువారి జీవితముల కుపయోగదాయకములగు సూక్తుల నెన్నింటినో నన్నయ చెప్పెను. ఉపాఖ్యానములందు అర్థాంతరన్యాసరూపమున నున్న సూక్తులే కాక, ప్రత్యేక పద్యరూపమున కల్పింపబడిన సుభాషితము లెన్నియో గలవు. ఇట్టివానికి నన్నయ కందమునే ఎక్కువగా వాడెను. దేశకాలాతీతములగు ఈ సూక్తులలో కొన్నింటిని మన మిట గాంచవచ్చును—

"క్రోధము తపముం జెఱచును,
గ్రోధ మణిమాదులైన గుణములఁ బాపుం,
గ్రోధము ధర్మక్రియలకు
బాధయగుం, గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే?"
(ఆది. 2-174)

"క్షమలేని తపసితపమును,
బ్రమత్తు సంపదయు, ధర్మబాహ్యప్రభురా
జ్యము - భిన్నకుంభమున తో
యములట్టుల యధ్రువంబులగు నివియెల్లన్."
(ఆది. 2-175)

"చను బొంకఁగఁ బ్రాణాత్యయ
మున సర్వధనాపహరణమున, వధగావ
చ్చిన విప్రార్థమున, వధూ
జనసంగమమున, వివాహసమయములందున్."
(ఆది. 3-178)

"మతిఁ దలఁపఁగ సంసారం
బతిచంచల, మెండమావులట్టుల సంపత్
ప్రతతు లతిక్షణికంబులు,
గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్." (ఆది. 5-159)

అశేషశేముషీ ధురంధరుడును, సకల విద్యా విశారదుండును, ఆంధ్ర వాగనుశాసనుండును, ఆంధ్రకవితాగురుండును, ఉభయభాషా కావ్య రచనాభి శోభితుండును, అనంత ప్రతిభాశాలియు నగు నన్నయభట్టారకుడు ప్రాచీన సంస్కృతకర్ణాట సాహిత్యముల చక్కగా పరిశీలించి, ఆంధ్రులకును, ఆంధ్ర భాషకును అనువగురీతిని తెలుగుకవిత్వమును, కావ్యమును ఆంధ్రజనుల కనుగ్రహించి, చిరస్మరణీయు డాయెను.

# తిక్కన

"ఉభయకవిమిత్రు, నత్యంతశుభచరిత్రు,
భానుసమతేజుఁ, గొమ్మయప్రభుతనూజు,
సుకృతవిభ్రాజిఁ, దిక్కన సోమయాజిఁ,
బ్రణుతబహుదేశకవిరాజుఁ బ్రస్తుతింతు."

తిక్కన మహామనీషి; సకలశాస్త్ర పారంగతుడు; రాజకీయధురంధరుడు; ఒక మహాసామ్రాజ్యమునకు మంత్రియై, దండనాధుడై, రాయబారియై ప్రభురాజ్యస్థాపనాచార్య బిరుదమును వహించినవాడు. రూపమున నపరమన్మధుడు. సకల సంపదలతో తులతూగి, మహాభోగియు, రాజలాంఛనోపేతుడు, కృతికర్త, కృతిభర్త, దానశీలి, సోమయాజియునై సహస్ర చంద్రదర్శనోత్సవము గావించుకొని, పూర్ణజీవితమును గడపిన భాగ్యశాలి. ఈ విషయములు తిక్కన జీవితకాలమందే ప్రసిద్ధి కెక్కినవి. తిక్కన వ్యక్తిత్వమును గురించి కేతన యిట్లు ప్రస్తుతించి యున్నాడు—

"సుకవీంద్ర బృంద రక్షకుఁ డెవ్వఁడనిన వీఁ
డను నాలుకకు తొడవైనవాఁడు,
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁడనిన వీఁ
డను శబ్దమున కర్థమైనవాఁడు,
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁడనిన వీఁ
డని చెప్పుటకు పాత్రమైనవాఁడు,
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁడనిన వీఁ
డని చూపుటకు గురియైనవాఁడు,

మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భార ధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి."

(దశ. చరి. 1-89)

తిక్కన పేరు వాకొన్నంతనే ఆంధ్ర మహాభారతము ప్రక్క పదముగా నాలుక కందును. మహాభారతములో ఎక్కువ భాగ మతనిచేతిమీదుగా నడచుటయే దీనికి కారణము.

సంస్కృత వాఙ్మయమున వ్యాసభారతమున కెట్టి విశిష్టత కలదో, ఆంధ్రసారస్వతమున కవిత్రయ భారతమునకును అట్టి వైశిష్ట్యమే కలదు. వేద వాఙ్మయమునందును, లౌకిక వాఙ్మయమునందును ప్రతిఫలించిన భారతీయుల జీవనవిధానము భారతేతివృత్తమగుటయే ఈ ప్రత్యేకతకు ప్రధానకారణము. భారత కథలో నిరూపింపబడిన ప్రకృతితత్త్వము, చిత్రింపబడిన ధర్మాధర్మముల సంఘర్షణము, ప్రతిపాదింపబడిన భగవంతుని సర్వవ్యాపకత్వ, సర్వశక్తిమత్త్వ, సర్వజ్ఞత్వములును భారతమునకు వేదప్రతిపత్తి నొసగి, పంచమ వేదప్రశస్తిని కలుగజేసినవి.

భారతము విజ్ఞాన సర్వస్వమని నన్నయ భారతాదిలో ఇట్లు కొనియాడెను—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని,
కవివృషభులు మహాకావ్యమనియు,

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని,
ఐతిహాసికు లితిహాసమనియుఁ,
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని, మహిఁ గొనియాడుచుండ,
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు."

(ఆది. 1-32)

భారతీయ సాహితీదృష్టి పురుషార్థపరమైనది. కావుననే 'కమనీయ ధర్మార్థ కామమోక్షములకు నత్యంత సాధనంబైన దాని' అని పురుషార్థ ప్రతిపాదనమే భారతముఖ్యోద్దేశముగా చెప్పబడినది.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ !
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్."

ధర్మార్థ కామమోక్షములను గురించి యిచ్చట నున్నదే మరియొకచోట కలదు; ఇచ్చట లేనిది మరియెచ్చటను లేదు — అను వ్యాసుని మాటలు పరమ సత్యములు.

వేయి సంవత్సరములకు పూర్వము వేగీదేశమును పరిపాలించిన సత్యాశ్రయాది బిరుదాంకితుడగు రాజరాజనరేంద్రుని యాస్థాన కవిపండితుడు, వాగనుశాసనుడు నగు నన్నయ భట్టారకుడు భారతాంధ్రీకరణమును ప్రారంభించి, ఆది సభా పర్వములను, ఆరణ్యపర్వమున కొంత భాగమును మాత్రమే

తెనిగించి దివంగతుడయ్యెను. నన్నయ కాలమునాటికి అనేకావైదిక మత వ్యాప్తివలన ధర్మహాని, మతపరమగు నశాంతియు నేర్పడి, సంఘనాశము కలుగుస్థితి సంభవించినది. దాని నరికట్టు సత్సంకల్పముతో రాజరాజు నన్నయను భారతాంధ్రీకరణమునకు ప్రోత్సహించెను.

పదుమూడవ శతాబ్దమున కవిబ్రహ్మయగు తిక్కన సోమయాజి శేష భారతాంధ్రీకరణమునకు పూనుకొని కృతకృత్యుడాయెను. ఆ మహామనీషి—

"హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథో
పేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ, మట ను
ద్యోగాదులుం గూడఁగాఁ
బదియేనింటిఁ దెనుంగుబాస జనసం
ప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టన్ రచియించుటొప్పు బుధసం
తోషంబు నిండారఁగన్."

(విరాట. 1-7)

అను నుదాత్తాశయముతో, అరణ్యపర్వశేషభాగమును వదలి, అవశిష్ట భారతాంధ్రీకరణమును పూర్తిగావించెను.

పదునాల్గవ శతాబ్దములో ప్రబంధపరమేశ్వరుడైన ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును పూర్తిచేయుటతో ఆంధ్రభారతము సమగ్రమైనది. ఇట్లు భారతాంధ్రీకరణ సంపూర్తికి మూడు వందల సంవత్సరములకాలము పట్టినది.

# తిక్కన

భారతము పంచమవేద మని కీర్తింపబడుచున్నది. వేదములు అపౌరుషేయములు, అలేఖ్యములును. భారతము లేఖ్యంబైన ఆమ్నాయము. "సకల భువన రక్షణ ప్రభువులైన త్రిమూర్తులవలె, శ్రీమదాంధ్ర మహాభారత రచనకు నన్నయ - తిక్కన - ఎఱ్ఱనలు ఆద్యులై నిలచిరి." "ఈ చరాచర ప్రపంచమునకు హరి హర హిరణ్యగర్భులు జీవాధారులు, మూలాధారులు నైనట్లు, ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునకు నన్నయ - ఎఱ్ఱన - తిక్కనలు జీవాధారులు, మూలాధారులునై వెలసినారు."

అవైదికమతవ్యాప్తిని నిరోధించి వైదికమత పునరుద్ధరణము చేయవలసినస్థితి నన్నయకాలమున నేర్పడగా, తిక్కన కాలము నాటికి ఆ స్థితి మరియొక రూపము దాల్చినది. ఆంధ్రదేశమున వీరశైవ-వీరవైష్ణవములు విజృంభించి, మతవిద్వేష ఫలితములగు కల్లోలము లధికతరములు కాజొచ్చినవి. కవులును, శివకవులనియు, భవికవులనియు, ఇరుతెగలుగా నేర్పడి, ఆంధ్రజాతి నల్లకల్లోలము గావించుచుండిరి. ఆంధ్రులలో ఆనాడు మతపరముగా నైక్యము, సామరస్యము లేకపోయినవి. తిక్కనకు కొలదికాలముముందే జరిగిన పలనాటియుద్ధము, దాని ఫలితములును అతనిని ప్రభావితుని గావించినవి. ఇట్టి యవ్యవస్థను చక్కదిద్దుటకై పరిష్కార మార్గమును అన్వేషించుచున్న తిక్కనకు——

"కరుణారసము వొంగి తొరఁగెడు చాడ్పున
శశిరేఖ నమృతంబు జాలువాఱ,
హరినీలపాత్రిక సురభిచందనమున
గతి నాభి ధవళపంకజము మెఱయ,

గుఱ్ఱయైన చెలువున నెఱసిన లోకర
　　క్షణమనంగ గళంబుచాయ దోఁపఁ,
బ్రథమాద్రిఁ దోతెంచు భానుబింబమునా ను
　　రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప,
సురనదియును గాళిందియు బెరసినట్టి
కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగఁజేయ
నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు.”

(విరాట. 1-12)

ఇట్లు ప్రత్యక్షమైన ఆ దేవుని-

“కి మస్థిమాలాం, కిము కౌస్తుభం వా,
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్?
కిం కాలకూటః, కిము వా యశోదా-
స్తన్యం, తవ స్వాదు? వద ప్రభో! మే.”

(విరాట. 1-11)

అని అద్వైతభావముతో ప్రశ్నించినాడు. ఆ సర్వేశ్వరుడే హరిహరుడు — శివకేశవుల కభేదమును పాటించి తిక్కన మలచిన అద్వైతమూర్తి. మతవైషమ్యములకు పరిష్కారముగా నతడు సృష్టించిన నూతనపథమే హరిహరాద్వైతము. ఈ ప్రయత్నమున విజయము సాధించుటలో తిక్కనకు భారతమే మూలాధారమైనది. ఈ పరమాద్వైతి హరిహరనాథునకు భారతము నంకితమిచ్చి, సర్వసిద్ధి నంది, భక్తకోటికి వరణీయుడనైతి నని చెప్పికొనెను. హరిహరాద్వైతము నభిలషించిన నాచన సోముడు తన కావ్యమును హరిహరనాథునకే అంకితమొనర్చెను.

సంస్కృత భారతరచనకును, ఆంధ్రమహాభారత రచనమునకును, "లోకసంగ్రహాపేక్షయే' పరమ ప్రయోజనము. వ్యాసునివలెనే కవిత్రయము వారును నిష్కామముగా భారతరచనకు పూనుకొనిరి. వారును ఋషికల్పులగు టయే భారతాంధ్రీకరణమున వారికి గల యోగ్యత.

మనసుపండి వినీతచిత్తవృత్తి ఏర్పడకమునుపు, హరిహరాద్వైత స్థాపనకు పూర్వము తిక్కన రచించిన కావ్యము నిర్వచనోత్తర రామాయణము. "అమలోదాత్తమనీష, నేనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్, కళావిదుఁడ" నని తిక్కన ఆనాడు సగర్వముగా చాటుకొని నాడు. కవిత్వ మీ రీతి నుండవలె నని తీర్పునిచ్చినాడు.

"జాత్యముగామి నొప్పయిన
సంస్కృత మెయ్యెడఁ జొన్ప, వాక్యసాం
గత్యము సేయుచోనయిన
గద్యము తోడుగఁజెప్పిపెట్టి, దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసముప్ర
కారము వేఱగు నక్షరంబులన్
శ్రుత్యనురూపమంచు నిడ;
సూరుల కివ్విధ మింపుఁ బెంపదే?"

(నిర్వ. 1-14)

ఇది తన కవిత్వ పద్ధతి యని నిరూపించినాడు.

లలిత పద హృద్య పద్యం
బులన, కథార్థంబు ఘటిత పూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁ, గా
హల సంధించిన విధంబు నమరఁగవలయున్."

(నిర్వ. 1-16)

అని తన రచనావిధానమును పేర్కొనినాడు.

ఈ కావ్యమున సీతా వాల్మీకుల పాత్రలను తిక్కన అత్యుదాత్తముగా చిత్రించెను. సీతాపరిత్యాగ ఘట్టమున తిక్కన కరుణరసపోషణ గావించి. రామునికాఠిన్యమును వాల్మీకినోట సున్నితముగా ప్రకటించెను. నిర్వచనముగా ఉత్తర రామాయణమును రచించు పంతము తిక్కనయొక్క ఆనాటి మనః స్థితిని సూచించును.

ఆంధ్ర మహాభారతము తిక్కనకృతులలో ద్వితీయమే యైనను సాహిత్యలోకమున నది అద్వితీయమే. భారతరచనా కాలమునకు తిక్కన చిత్తవృత్తి యజ్ఞ నిర్వహణముచే ప్రశాంతమైనది. అందులకే 'నానేర్చిన భంగిఁ జెప్పి, వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' అని సవినయముగా చెప్పి కొనెను. 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు, విజ్ఞానసంపద్విఖ్యాతుఁడు, సంయమిప్రకర సంభావ్యానుభావుండు'నగు కృష్ణద్వైపాయనుడు 'అర్థిలోక హితనిష్ఠంబూని కావించిన భారతామ్నాయమును, ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగ' తిక్కన రచించెను. అప్పు డాతని చిత్తవృత్తి 'సాత్యవతేయ సంస్మృతిశ్రీవిభవాస్పదంబయినది.'

తిక్కనభారతము సంస్కృత మహాభారతమునకు తు - చ తప్పని భాషాంతరీకరణము కాదు. ఈ విషయమున నొక విమర్శకుని యభిప్రాయము గమనింపదగినది- "తిక్కన కృతభారతము సంస్కృతభారతమునకు భాషాంతరీకరణమనుకొనుట గొప్ప పొరపాటు. ఇట్లనుకొనుట మనము తిక్కన యెడ మహాపరాధము చేయుటయే. సంస్కృత భారతము ఒక బంగారపు ముద్ద. ఆంధ్రభారతము ఆ ముద్దలో నుండి కావలసినంత బంగారమును తీసికొని, స్వర్ణకారుని బుద్ధివైభవముతో చేయబడిన సువర్ణకమలమువంటిది."

తిక్కన మూలకథను గ్రహించి, అవసరమగు చోట్ల పెంచియు, సంగ్రహించియు, మెరుగులు దిద్దియు, సహృదయ హృదయావర్జకమగురీతిని రచించెను. మూలభావమును విస్తరించిన విధము నీక్రింది యుదాహరణములలో చూడగలము.

పాండవుల యజ్ఞాతవాసారంభసమయమున మూలములో—

"కథం విరాటనగరే మమ పూర్వపితామహాః,
అజ్ఞాతవాస ముషితాః దుర్యోధనభయార్దితాః."

అని కలదు. ఈ శ్లోకములోని 'కథం' అను ప్రశ్నకు వ్యాఖ్యాన రూపముగా తిక్కన—

"మహితసముజ్జ్వలాకృతులు,
మానధనుల్, జనమాన్యు, లంగనా
సహితముగాఁగ నేమిగతి
సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ
నా పదమూఁడగు నేఁడు మత్పితా
మహులు చరించి? రంతయుఁ గ్ర
మంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా."

(విరాట. 1-44)

అను పద్యమును రచించి, భావమును విపులీకరించెను. విరాట నగరోన్ముఖముగా సాగుచున్న ద్రౌపది అలసి సొలసి 'బలవాన్ మే పరిశ్రమః' అని

అన్నట్లు మూలమున కలదు. కాని తిక్కన ఆ భావమును విస్తరించి, కోమలాంగియగు ద్రౌపదిదీనావస్థను హృదయద్రావక మగురీతిని చిత్రించెను.

"డప్పి జనించె, వ్రేళులపు
టంబులు పొక్కఁ దొడంగె, గోళ్ళలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు,
చిత్తము నాకుఁ గడున్ వశంబు గా,
దప్పుర మిచ్చుటచ్చటను
నాసల వచ్చితి, నెంత దవ్వొకో?
యిప్పటిభంగి నొక్కఁడుగు
నేఁగెడుదానికి నోర్వ నెమ్మెయిన్."

(విరాట. 1-148)

ఇటులనే గోగ్రహణ సందర్భములో—

"తదనీకం మహత్తేషాం విస్తృతం సాగరోపమమ్,
సర్పమాణ మివాకాశే వనం బహుళపాదపమ్."

అను మూలశ్లోకములోని ఉత్తరార్ధములో నుండు 'వనం బహుళ పాదపమ్' అను ఉపమానమును గ్రహించి తిక్కన ఇట్లు విపులీకరించెను—

"అభినవజలధరశ్యామంబులగు నెడ
లాకుజొంపంబుల ననుకరింప,
సాంధ్యరాగోపమచ్ఛాయంబులగు పట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ,

రాజమరాళగౌరములగు చోటులు
పఱచుఁ బూఁబొదల చందంబు నొంద,
హారిద్రరుచి సమానాకృతులగు రావు
లడరెడు పుప్పొడులట్లు మెఱయఁ

గలయ నెగసి ధరాధూళి, లలితవనము
దివికి నలిఁ గాఁపువోయెడు తెఱఁగు దాల్ప,
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడచు కౌరవరాజసైన్యంబుఁ గనియె."

(విరాట. 4-50)

ఇట్లే మూలములో అసంతృప్తికరములుగా నున్న పెక్కు తావుల తిక్కన సుందరమగు రచన గావించి, ఆ ఘట్టములను రసవంతములుగా జేసెను. ఈ మెరుగులు దిద్దుటలో మూల భారతమున చిన్న చూపు చూడబడిన సుదేష్ణావిరాటులవంటి పాత్రలును రసానుగుణముగా రూపొందింపబడినవై సహజశోభను పొందినవి. సజీవములైన పాత్రలును రసోపేతములై మరింత శోభను పొందగలిగినవి.

సహజసుందరమగు తిక్కనకవిత్వమునకు మెరుగులు దిద్దిన విశిష్ట లక్షణములు- పదసౌష్ఠవము, అర్థగాంభీర్యము, పాత్రౌచిత్యము, రసపోషణ, నాటకీయత, వర్ణనాచాతుర్యము మొదలగునవి. ఈ లక్షణములు భారతమున సర్వత్ర వ్యాపించి, తిక్కన ప్రత్యేకతను నిరూపించుచున్నవి. ఈతని వర్ణనాప్రధానమగు రచన, ఆలంకారికమగు శైలి భావిప్రబంధ రచనకు మార్గము నేర్పరచినవి.

తిక్కన చేపట్టిన మొదటిపర్వము విరాటపర్వము. దాని నాతడు స్వతంత్ర ప్రబంధముగనే తీర్చి దిద్దెను. ప్రబంధ రచనా విధానమున కనుకూలమగు ఇతివృత్తముండుటయే విరాటపర్వ విశిష్టత. ఇందలి సంఘటనములు నిత్యజీవితమునకు సన్నిహితములైనవి. కీచకునిలో నుండు కాముక ప్రవృత్తి, దానిపరాకాష్ఠ, ఫలితము అనునవియు, అట్టిదుష్టుని బారినుండి తప్పించుకొనుటకై పతివ్రత యొనర్చు యత్నములు, తత్ఫలమును ఇందు అత్యంత సహజముగను, రమ్యముగను వర్ణింపబడినవి. కీచకాశ్రితమగు శృంగారరసాభాసము అంగరసముగను, భీమగతమగు వీరరసము అంగిరసముగను భాసించి, ఈ ఘట్ట మొక సర్వాంగసుందరమగు ప్రబంధముగా రూపొందినది.

ఉద్యోగపర్వము తిక్కన మేధాశక్తికి, రాజనీతిజ్ఞతకు, లౌకికవ్యవహార నిర్వహణ కుశలతకు నిదర్శనము. ఈ పర్వము రాజకీయసమస్యలతో, జటిల విషయజాలముతో నిండియున్నది. భారతేతివృత్తమునందలి ప్రధాన పాత్రల స్వరూప స్వభావాదులను, మనస్తత్త్వములను పరిశీలించుటకు ఈ పర్వము ముఖ్యాధారము. ఇందు తిక్కన నిర్వహించిన రాయబారములు, తదనుకూలమగు రచనావైవిధ్యము, తిక్కన రాజనీతి పరిజ్ఞానమును వెల్లడిచేయుచున్నవి.

మహాభారతమున పాత్రపోషణ మనునది చాల క్లిష్టమగు కార్యము. వ్యాసుడు భారతపాత్రలకు ఆద్యబ్రహ్మ. వాని ప్రవర్తనల నాతడు భారతేతిహాసమున యథాతథముగ నిరూపించుచు పోయెను. కాని కావ్యముగా తీర్పబడిన ఆంధ్రమహాభారతమున నట్టి విధానము రసభంగమునకు దోహద మొనర్పగలదు. కావుననే వ్యాసుని పాత్రచిత్రణమునకును, తిక్కన విధానమునకును చాల భేద మున్నది. వ్యాసునిది ఐతిహాసిక దృష్టి: తిక్కనది

కావ్యదృష్టి. అందుననే ఆంధ్రభారతములోని పాత్రలు సహజత్వముతోబాటు సౌందర్యమును కూడ సంతరించుకొనినవి. వ్యాసుని భారతమున చిన్నచిన్న పాత్రలు తాత్కాలికమగు ఏదియో ఒక ప్రయోజనమును సాధించి నిష్క్రమించును. కాని తిక్కన తీర్చిన పాత్రలు అట్టి ప్రయోజనమును సాధించుటయే కాక, కావ్యమునకు జీవాత్మయగు రసపోషణమున కుపకరించి, తమ వ్యక్తిత్వమును చాటికొనినవి.

వ్యాసుని సుదేష్ణా విరాటుల పాత్రలకు విశిష్టమగు వ్యక్తిత్వము లేదు. తిక్కన ఆ పాత్రలను ప్రత్యేకముగా తీర్చి, సహజములుగా చేసినాడు. ఉత్తమపాత్రలను చిత్రించుటలో కనబరచిన మెలకువనే సుదేష్ణవంటి పాత్రల విషయమున కూడ చూపినాడు. ఇది ఆతని సూక్ష్మ శిల్పకళా నైపుణ్యములోని విలక్షణత. దీనివలననే సుదేష్ణపాత్ర పాఠకుల సానుభూతికి, మెప్పునకు పాత్రమైనది. కీచకుని యింటినుండి మదిరను తెమ్మనునప్పుడు వ్యాస భారతమున సుదేష్ణ—

"ఉత్తిష్ఠ, గచ్ఛ సైరంధ్రి! కీచకస్య నివేశనమ్,
పాన మానయ కల్యాణి! పిపాసా మాం ప్రబాధతే."

అని విరసముగా మాటలాడినది. ఈపట్టున తిక్కన సుదేష్ణ—

"కీచకుని యింట నెప్పుడు
వాచవి యగు బహువిధంపువారుణి గలుగున్,
వే చని యిచటికిఁ గొని ర
మ్మా! చూతముగాని నీగమనవేగంబున్."

(విరాట. 2-89)

అని ద్రౌపదిని బుజ్జగించునట్లు పలికి, చాల నాజూకుగా వ్యవహరించినది. దీని వలన వ్యాసభారతమున నిందితచరితగా తోచు సుదేష్ణ, చాలవరకు ప్రశంసా పాత్రమైనది. ఇట్లు ఒకటి రెండు పర్యాయములు మాత్రము మన కగపడు నట్టి పాత్రలు కూడ, అనల్ప సామర్ధ్యముతో సజీవములుగా సృష్టింప బడుటచే తిక్కన భారతము అఖండ రసపుష్టిని చేకూర్చుకొనినది.

తిక్కన తీర్చిన ద్రౌపది యొక అగ్నిశలాక. నన్నయ సృష్టిలో ఆమె ముగ్ధ. ఎన్ని పాట్లు పడినను, ఎట్టి యవమానములకు లోనైనను, భర్తలను పల్లెత్తుమాటయైనను అన సాహసింపలేకపోయినది. కాని తిక్కన రూపొం దించిన ద్రౌపది ప్రతీకార వాంఛతో బుసలుకొట్టు మహానాగాంగన. శాంతి కాముకుడైన ధర్మరాజు ఐదూళ్ళతోనే తృప్తిపడదలచినాడు. యుద్ధమే సంభ వింపకపోయినచో, ద్రౌపది పరాభవాగ్ని చల్లారు నవకాశము లేదు. ఈ సన్ని వేశమున ద్రౌపది స్వరూపస్వభావాదులు, ప్రవర్తన, ఆవేశపూరితములైన మాటలును ఆమె వ్యక్తిత్వమునకు ప్రబల నిదర్శనములు. ఈ క్రింది పద్య ములలో ప్రేటువడ్డ యురగాంగన వలె లేచిన ద్రౌపదియు, ఆమె హృదిలోని ఆరని పరాభవాగ్నియు, చిరకాలవాంఛితమును స్పష్టముగా గోచరింపగలవు -

"ద్రోవది బంధురంబయిన
క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి, వెండ్రుకల్
దా వలచేతఁ బూని, యసి
తచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో

నా విలసిల్లి వ్రేలఁగ, మ
    నంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక, బాష్పములు
    గ్రమ్మఁగ, దిగ్గన లేచి యార్తయై."

(ఉద్యో. 3-114)

"ఇవి దుస్ససేనువ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి, కౌ
రవులకడఁ దీఱు మాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వినిన్."

(ఉద్యో. 3-116)

"ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
    దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదరి రూ
    పఱియున్నఁ గని, యుడుకాఱుఁగాక,
యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది,
    పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును, పాటించి గాండీవ
    మను నొక విల్లెప్పుడును వహించు
కఱ్ఱి విక్రమంబుఁ గాల్పనే? యిట్లు ఐ
న్నములు వడిన ధర్మనందనుండు,
నేను, రాజరాజుపీనుంగుఁ గన్నారఁ
గానఁబడయమైతిమేనిఁ గృష్ణ!"

(ఉద్యో. 3-117)

కధలోని పాత్రలచేతనే మరియొక పాత్రను ప్రశంసింపజేసి, దానిని పోషించుట తిక్కన పాత్రచిత్రణ విధానములోని ఒక వైశిష్ట్యము. ద్రౌపది ధర్మజుని యౌన్నత్యమును కొనియాడిన సన్నివేశ మీ విశిష్టతకు తార్కాణము.

"ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడఁగు,
నెవ్వాని చారిత్ర మెల్ల లోకములకు
నొజ్జయై వినయంబునొఱపు గఱపు,
నెవ్వాని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద లీనుచుండు,
నెవ్వాని గుణలత లేడు వారాసుల
కడపటి కొండపైఁ గలయఁ బ్రాకు,

నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు, గేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు."

(విరాట. 2-191)

భీష్మునివంటి అకళంకమగు పాత్ర మన భారత సాహిత్యముననే కాదు, మరియే యితర సాహిత్యమునను కానరాదు. ఇట్టి మహనీయ వ్యక్తి ఇంకొకడు లేడను భావము ఈ క్రింది పద్యమువలన తెలియగలదు—

"రాజటె, రాగహీనుఁడటె, రాజితసుందరమూర్తియట్టె, వి
భ్రాజితసంపదున్నత విభాసిత వర్తనుఁడట్టె, కామినీ

రాజిమనోజ్ఞభంగిచతురత్వధనుండటె, బ్రహ్మచర్యదీ
క్షాజిత మన్మధుండునటె, జన్మము లిట్టివి యెందుఁగల్గునే!"
(శాంతి. 2-103)

భీష్ముడు యుద్ధరంగమునుండి నిష్క్రమించిన పిదపనే భారత యుద్ధ రంగమున నధర్మము ప్రవేశించినది.

భారతమున శ్రీకృష్ణుని పాత్ర అతికీలకమై, ప్రధానమైనది. ఉద్యోగ పర్వములో, విశేషించి, రాయబారపు ఘట్టమున శ్రీకృష్ణుడు ప్రదర్శించిన చాతుర్యము- రాజకీయ రంగమున తిక్కన గడించిన అపారమగు అనుభవమునకు నిదర్శనము.

శ్రీకృష్ణుడు ధర్మసంస్థాపనార్ధమై అవతరించిన పురుషోత్తముడు. సత్యధర్మములను రక్షించుట ఆతని ఆశయము; అది అతని జీవితతత్త్వము. తదనుగుణముగా నాతడు రాయబారియై, కురుసభలో గంభీరోపన్యాసము గావించెను. విశిష్టార్ధద్యోతకములు, సర్వసమ్మతములు నగు సంధి వాక్యములను వినిపించెను. సత్య ధర్మములయెడ ఉపేక్ష వహించిన దక్షులగు భీష్మ ద్రోణాదులకు సైతము చేటు తప్పదని తీవ్రముగా హెచ్చరించెను. సారమగు ధర్మము, విమలసత్యము సదా భగవద్రక్షితములై యుండు నని తెల్పెను. రాయబారపు ఘట్టమంతయు నొక అద్భుతకల్పనము కాగా, అందు శ్రీకృష్ణ పాత్ర యొక పరమాద్భుత సృష్టిగా భాసించును.

కృష్ణ పాత్రలో మనకు విశిష్టముగా గోచరించు లక్షణము ఆతని నిర్లిప్తత, అనాసక్తత. ఆద్యంతము వివిధ పాత్రలతో ప్రత్యక్షముగనో, పరోక్షముగనో సంబంధము కల్గి, వాని సుఖదుఃఖములలో, భావసంఘర్షణములలో పాలు పంచుకొనునట్లు కనిపించుచుండియు, నళినీదళగత జలబిందువు

వలె నిరాసక్తుడుగనే యుండును. ఈ నిర్లిప్తత యోగీశ్వరేశ్వరుడగు అతని కొక్కనికే చెల్లినది. శ్రీకృష్ణునివలె, ఇంతటి సంఘర్షణాత్మకమగు కథను నడుపుచు, పాత్రలమధ్య సంచరించుచు కూడ తిక్కన, తటస్థుడుగనే యుండగలిగినాడు. కావుననే "హరిహరనాథః సర్వభువనార్చిత, నన్ దయఁ జూడు మెప్పుడున్" అని తన అనాసక్తతను భగవంతునికి నివేదించుకొనుచు, మహాభారత రచనమును పూర్తిగావించినాడు.

తిక్కనకావ్యగుణములలో సర్వజనహృదయావర్జకమైనది అతని నాటకీయశైలి. తిక్కన భారతములోని పాత్రలు నాటకరంగమందలి పాత్రలవలె ప్రవర్తించును. హావభావములను, కరుణశృంగారాదిరసములను, ముఖభంగిమలతోను, అంగప్రత్యంగ విన్యాసములతోను సుస్పష్టముగా ప్రదర్శించును. ఒకపాత్ర మరియొకపాత్రతో నాటకమునందువలె భాషించును. ఆ సంభాషణలు సరళములై, సూటిగ నుండి, పాత్రల మనోవృత్తులను, గుణశీలాదులను నిరూపించును. అట్టియెడ తిక్కన రంగస్థల సన్నివేశములను, పాత్రల తత్తత్కాలోచిత స్థితినికూడ సూచించును. భారతమున 'కీచకవధ' ఘట్టములోను, నిర్వచనోత్తర రామాయణమునందలి 'రంభారావణ సంవాద' ఘట్టములోను ఈ నాటకీయత ప్రస్ఫుటముగ గోచరించుచున్నది. సైరంధ్రిని గాంచి కామించిన కీచకుని దురవస్థ, సైరంధ్రీసుదేష్ణల సంభాషణము, ద్రౌపదీ సహితుడైన భీముడు నర్తనశాల ప్రవేశించుట, తదనంతరము కీచక ప్రవేశము మొదలగున వన్నియు ప్రదర్శనయోగ్యములైన సన్నివేశములే. ఉద్యోగపర్వమందలి మూడు రాయబారములును చక్కని రాజనీతి కునికిపట్టులు. కావుననే యివి అత్యంత ప్రాధాన్యము వహించి యున్నవి. వీనిని

రూపొందించుటలో తిక్కన సంభాషణాత్మకమగు శైలినే స్వీకరించెను. ఈ శైలియే ఆ మూడింటిని సర్వలక్షణోపేతములగు రూపకములో యనునట్లు భాసింపజేయుచున్నవి. ఇందలి యితివృత్తమంతయు కేవలము పాత్రల సంభాషణములతోనే సాగినది. కవియే అదృశ్యరూపుడై, పాత్రల చాటున దాగి, కథను నడిపించినాడు. వస్తువర్ణనమునకును, కథాంశ వివరణమునకును ఆస్కారము లేకపోవుటచే ఈ రాయబారఘట్టము లన్నియు రూపకములుగనే తోచును. తదనురూపముగా సంభాషణలలో తెలుగు నుడికారపు సొంపును, వ్యవహారోచితమగు శైలిని తిక్కన పొందుపరచెను.

ఆ యా విషయములను వర్ణించునపుడు తిక్కన చూపు మెలకువ అసాధారణమైనది. ఆ వర్ణనములు కథాగమన నిరోధకములు కాక, దానికి సొంపునే కల్గించును. అవి తత్తత్సన్నివేశార్హములై రసభావాదులకు పరిపోష మునే కల్గించుచుండును. ఇది ఈ మహాకవి యుత్తమ కవితా లక్షణములలో నొకటి. పాంచాలిని భంగపరచిన కీచకుని కనుగొనినంతనే, భీమునకు మితి మీరిన ఆగ్రహము కలిగినది. అప్పట్టున తిక్కన రచించిన పద్యము భీముని రౌద్రవిస్ఫురణమును, చలనచిత్రములో వలె, చూపును.

"కనుఁగొని కోపవేగమునఁ
గన్నుల నిప్పులు రాల, నంగము
ల్దనరఁగ, సాంద్రఘర్మసలి
లంబులు గ్రమ్మ, నితాంతదంతపీ

డనరటదాస్యరంగ వికట
ట్రభుకుటీచటుల ప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ
దస్ఫురణాపరిబద్ధమూర్తియై."

(విరాట. 2-133)

స్ఫురింపజేయవలసిన రసభావాదుల కనుగుణముగా తిక్కన దీర్ఘ సంస్కృత సమాసములను రచించి, వానికి సద్యస్స్ఫూర్తిని కలుగజేయును. సైరంధ్రి కీచకుని బెదరించు సందర్భమునను, కౌరవసేనను చూచి ఉత్తరుడు భయభ్రాంతుడగు సందర్భమునను రచింపబడిన ఈ పద్యములు పై అంశమున కుదాహరణములు—

"దుర్వారోద్యమబాహువిక్రమరసా
స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథన వి
ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దో
ర్లీలన్ వెసం గిట్టి, గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట త
థ్యం బెమ్మెయిం గీచకా!"

(విరాట. 2-55)

"భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు, శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే?"

(విరాట. 4-52)

ఈ సూర్యోదయ వర్ణనము కడు సుందరమై, పవిత్రమగు తిక్కన మనఃస్థితిని చాటును—

నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన
భవ్యతపంబుల ఫల మనంగ,
దివసముఖాభినందిత చక్రయుగ్మకం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ,
హరిహరబ్రహ్మ మహానుభావంబు లొ
క్కటిగాఁగఁ గరఁగిన గట్టి యనఁగ,
నతులవేదత్రయలతికాచయము పెను
పొందఁ బుట్టెడు మూలకంద మనఁగ,

నఖిలజగముల కన్దెఱయగుచు జనస
మాజ కరపుట హృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె."

(విరాట. 2-241)

ప్రకృతిలోని వస్తువు నటులనే గ్రహించి, సహజముగా వర్ణించు తిక్కన ప్రతిభ అనన్య సాధారణమైనది. సౌప్తికపర్వమున అశ్వత్థామను క్రూరకృత్యమునకు ప్రేరేపించు ఉలూక వర్ణనము దీనికి నిదర్శనము.

"మిడుఁగుఱుగములు గ్రమ్మినయట్లు నిగిడెడు
రోచులు గల మిడిగ్రుడ్లు దనర,
మెఱుఁగారు కెంజాయ మెఱసిన యెఱకల
మోపున నెసఁగు పెన్ ప్రోఁతతోడఁ,
గాళుల భీషణాకారత వేళ్ళతో
లీలమై నెగసిన శైల మనఁగఁ,
గర ముగ్రమగు మొగ మిరుదెస మురియించి
యామిషంబుల యిక్క లరసికొనుచు,

నచటి బయలెల్లఁ దానయై యక్కజంపుఁ
జందమును, ఘోరమైన నిస్వనముఁ, జండ
గతియు భూతవితానభీకరముగా ను
లూక యొక్కటి వచ్చె భూలోకనాథ!"

(సౌప్తిక. 1-16)

భయంకరమై, జుగుప్సను, విసుగును కలిగించు యుద్ధ సన్నివేశములనుకూడ తిక్కన రసవంతములుగను, చమత్కారావహములుగను వర్ణించి, పాఠకులకు ఉల్లాసము కల్పించును. తిక్కన రచనలో యుద్ధపంచకమాదిగా గల కథాభాగము విరాటోద్యోగపర్వములవలె రసవంతము కాదని కొందరి యభిప్రాయము. కాని, అది నిజము కాదు. యుద్ధరంగములలో ప్రదర్శింపబడు రౌద్ర - బీభత్స - భయానకాది రసములు, వీర-శృంగారములవలె, మానవుని నిత్యజీవితమునకు సన్నిహితములుగా నుండునవి కావు. అయినను, ఆ సన్నివేశములనుకూడ తిక్కన తన అసమాన కౌశలముతో రసప్లావితముల జేసెనని రసజ్ఞులు గురుతింపగలరు. అత్యంతసహజములును, హృదయమును స్పందింపజేయునట్టివియునగు ఉపమానములతో తిక్కన భీకర యుద్ధమునకును మనోజ్ఞత్వము నాపాదించినాడు.

అలసి సొలసిన వీరభటులు యుద్ధరంగములో ఏనుగుల మీదనే మైమరచి నిద్రించుచున్నట్లు వర్ణించుచు, దానికి శృంగారమును జతచేసి, మనోహరత్వము నాపాదించిన తిక్కన సామర్థ్యము ప్రశంసనీయము.

"తరుణుల కుచములపై రతి
పరవశులై యొఱగు పతులపగిది సమరసం
భరితశ్రమమున నిద్రిం
చిరి కరికుంభములఁ జెంది చెన్నుగ జోదుల్."

(ద్రోణ. 5-273)

రమణీయములు, ఉదాత్తములు నగు ఉపమానములను సమకూర్చి, జుగుప్సావహము, హృదయవిదారకము నగు వస్తువులనుకూడ మనోజ్ఞముగా ప్రదర్శించుట తిక్కన రచనావిధానములోని వైశిష్ట్యము. అతిభీకర మగు యుద్ధ భూమిలో విగతజీవుడై పడియున్న అభిమన్యుని వర్ణించు ఘట్టమున తిక్కన సుందరరూపకల్పన చేసెను.

"కరికళేబరములు ధరణీధరములు, దు
రంగగాత్రమ్ములు గ్రాహసమితి,
నరశరీరములు మీనములు, గౌక్షేయక
క్షురికాది శస్త్రంబు లురగకులము,
రుధిరార్ద్రశరములు రుచిరప్రవాళముల్,
ప్రేవులప్రోవులు ఫేనతతులు,
నెత్తురువెల్లువ నీళులు, భూషణ
స్తోమాస్థిచయముల తుమురు లిసుక
గాఁగ, నంబురాశికరణి సంగ్రామభూ
భాగ మొప్ప, మిగుల భవ్యయోగ
నిద్ర నున్న విష్ణునికిఁ బాటియగుచు శో
భిల్లె నమ్మురారియల్లుఁ డందు."

(ద్రోణ. 2-128)

మృతుడగు కృష్ణునిమేనల్లుని భవ్యయోగనిద్రలో నున్న విష్ణువుతో పోల్చుట ఎంతయో హృద్యముగను, ఉచితముగను నున్నది.

అటులనే దుశ్శాసనవధ, అశ్వత్థామకృత ధృష్టద్యుమ్న సంహారము మున్నగు రౌద్రరసనిర్భరములగు వర్ణనలతో కూడి యుండియు, ఈ యుద్ధ పర్వములు మనోహరములై యున్నవి. ఇంతేకాక ధర్మజ - దుర్యోధనాదులు స్వపుత్రాదులను కోల్పోయినపుడు కరుణరసము ఉదాత్తముగా పోషింపబడి, వారి శీలము, అంతరంగము మొదలగునవియు, అప్పట్టున తక్కిన అనేక పాత్రల భావోద్వేగాది మనోవికారములును యథార్థముగా వెల్లడిచేయబడి యున్నవి. ఇట్లు తిక్కన యుద్ధపంచకములోని విభిన్నఘట్టములలో పాత్రల స్వరూపశీలాదులను వెల్లడించుచు, నానారసోల్లాస మొనర్చి, యుద్ధవర్ణనము కూడ మానవహృదయములకు ఆస్వాదయోగ్యమే యని నిరూపించినాడు.

సౌప్తికపర్వమున ద్రౌపదీశోకముతో ప్రారంభమై, స్త్రీ పర్వములోని అసంఖ్యాకస్త్రీల యాక్రందనములతో పరిపుష్టమై, ఆ పర్వము కరుణరసాత్మక మైనది. ఆ స్త్రీల ప్రతినిధిగా గాంధారి యుద్ధరంగమున నిల్చి, హృదయ విదారకములగు దృశ్యములను వర్ణించిన తీరు ఎంతటి క్రూరహృదయమునేని కలచివేయును.

ధర్మజుని రాజ్యపరిపాలనక్రమము ఆశ్రమవాసపర్వ ప్రథమభాగమున నభివర్ణింపబడియున్నది. పెద్దల యుపదేశములతో ఇప్పటి కాతని మనస్సు వినిర్మలము, శుద్ధజ్ఞానసంపన్నమునై యుండెను. కావుననే తన ముప్పది యైదు సంవత్సరముల యేలుబడిలో సాంఘికవ్యవస్థలను, సత్యన్యాయములను నిర్దుష్టముగా నెలకొల్పెను. భోగేచ్ఛతోగాక, స్వధర్మనిర్వహణము అవశ్య కర్తవ్య మను బుద్ధితోనే అతడు ప్రజాపాలన మొనరించెను. పర్వోత్తరభాగ మందలి కుంతీధృతరాష్ట్రాదుల యాశ్రమగమనముతోను, పిదప వారి నిర్యాణముతోను ఆతనిదృష్టి ఐహికవిముఖమై, ఆముష్మికాభిముఖము కాజొచ్చెను.

యుద్ధపర్వములలోని బంధువినాశముతో అత్యంతము ఉద్విగ్నమైన అతని హృదయము, స్త్రీపర్వములోని అబలల యాక్రందనములతో కరుణరసప్లావిత మైనది. ధృతరాష్ట్రాదుల మరణముతో అతని నిర్వేదము రూఢమూలమై, దృష్టిని అంతర్ముఖము చేసినది. క్రమముగా నాతడు శమప్రధానుడు కాజొచ్చెను. ఈ యంశములను తిక్కన వర్ణించిన తీరు కడు హృద్యమైనది.

మౌసలమున యాదవవంశ వినాశము అభివర్ణితము. విరాటపర్వము వీరరసప్రధానమగు మహాకావ్యముగా రూపొందినట్లే, మౌసలపర్వము కరుణ రసప్రధానమగు ప్రబంధముగా రూపుగొన్నది. అందు లేని వస్త్వైక్యము కూడ ఇందు సంఘటిల్లినది. ప్రధానములగు మహాకావ్యలక్షణము లన్నియు ఇందు సమకూరి, కరుణరసపోషణము సక్రమముగా నిర్వహింపబడినది. ఇందు ప్రసిద్ధమగు యాదవులచరిత్రము ఇతివృత్తము. సకలకల్యాణగుణ పరిపూర్ణుడు, జగన్నాటకసూత్రధారుడు నగు కృష్ణభగవానుడే నాయకుడు. ఉత్తమగుణగరిష్ఠుడగు అర్జునుడు నాయకాభిమత కార్యనిర్వహణమునకు తోడ్పడు ఉపనాయకుడు. సకలయాదవ క్షయకరమగు వీరరసము అంగ రసము. అకాండవినాశసముద్భూతమగు శోకము ఉద్వేలమై, అప్రబాధ్యమై కరుణరసాత్మకతనొంది, ఇందు అంగిరస మగుచున్నది. ఇట్లే మౌసలపర్వము విషాదాంతమగు ఒక మహాకావ్యముగా భాసించుచున్నది. మహాభారతమందలి ప్రధానరసమగు శాంతమునకు అంగముగనే కరుణ మిచట పరిపోషింపబడి నది. కావుననే ఇందు తిక్కన ఉపయోగించిన శైలియు విలక్షణముగనే యున్నది. వర్ణనాప్రధానము, ఆలంకారికము నగు రీతిగాక, రసమునకు సద్య స్స్ఫూర్తి నిచ్చు అకృత్రిమశైలియే ఇచట ఉపాత్తమైనది. ధర్మజుని హృద యము ఇప్పటికి శమాభిముఖమైనట్లు, తిక్కన శైలియు ప్రశాంతమై, కరుణ రసాభివ్యక్తికి ఎంతయు తోడ్పడి, మౌసలపర్వమునకు ఉత్తమకావ్యత్వమును సిద్ధింపజేసినది.

సర్వయాదవ వినాశమును, బలరామ కృష్ణుల నిర్యాణమును, యాద వాంగనల విలాపములను అర్జునుడు దుఃఖోపహతుడై వర్ణింపగా విని, ధర్మ సుతాదులు మితిలేని నిర్వేదము నొందిరి. విధినిర్ణయము ఎట్టివారికైనను అను ల్లంఘ్య మనియు, భవబంధము దుఃఖహేతు వనియు, ఈ బంధవిచ్ఛిత్తికై జీవుడు ఐహికములం దనాసక్తుడై, ఆముష్మికోన్ముఖుడు కావలె నను పరమ తత్త్వమును వారు గ్రహించి, మహాప్రస్థానాభిముఖు లైరి. ఇట్లు పాండవులు పరమశాంతులై, సంసారబంధములను సర్వథా పరిత్యజించి, స్వర్గము నధి రోహించుట కుపక్రమించుటతో, మహాభారతప్రతిపాద్యమగు శాంతము పరి పక్వమై రససిద్ధి నొందినది.

నన్నయది సంస్కృత బహుళమైన రచన. తిక్కనరచనలో తెనుగు దన మెక్కువ. తనకాలమునాటి పండితులను తృప్తిపరచుటకై నన్నయ సంస్కృత ప్రచురమైన రచన నాదరింపవలసి వచ్చినది. అవ్యవస్థితముగా నున్న ఆంధ్రభాషను సంస్కరించి, ఆ భాషలో తొలిసారిగ కావ్యరచన కావించుటచే, నన్నయ భాషావిషయమున సర్వస్వతంత్రుడై వ్యవహరింప లేకపోయి యుండవచ్చును. కాని, మహాభారతము ఆంధ్రజాతికి సన్నిహిత మైనదగుటచే, తద్ద్వారా వారిని ప్రభావితులను చేయుటకై తిక్కన, దేశీయ మగు రచనా విధానమే ఉత్కృష్ట సాధనమని భావించి, అద్దానినే పరిగ్రహిం చెను. కావుననే తిక్కనభారతము తెలుగు పలుకుబడులతో, జాతీయములతో, సామెతలతో నొప్పి, ఆంధ్రులకు పరమప్రీతిపాత్రమైనది. తెలుగుపదములను విరివిగా ప్రయోగించుట, ఎట్టి భావమునైనను తెలుగులోనే సులభముగా చెప్ప గల్గుట, వ్యావహారిక భాషావాక్యములను పోలునట్లుగా గ్రాంథిక శైలిలో రచించుట, తిక్కన భాషావిషయమున చూపిన మెలకువలు.

కధను సంభాషణాత్మకశైలిలో నడపి, ఆ యా ఘట్టములకు నాటకీయతను కల్పించుట తిక్కనకవితాశిల్పములోని ప్రత్యేకత. దీని కుదాహరణములు గ్రంధమున ననేకములు గలవు. కీచకుడు సైరంధ్రిని చూచినాడు. ఆమె సౌందర్య మాతని వివశుని జేసినది; తమక మధికమైనది. ఆమె పుట్టు పూర్వోత్తరముల నెరుంగుటకై వేగిరపడి, అక్కను సమీపించినాడు. అప్పటి వాని తహతహ ఎంత చక్కని శైలిలో వర్ణింపబడినదో ఈ క్రింది పద్యములో గోచరించును—

"ఇయ్యరవిందగంధికుల
మేమి? చరిత్రము చంద మెల్లు? పే
రెయ్యది? నాధుఁ డెవ్వఁ? డిది
యెచ్చట నెప్పుడు నుండు? నిప్డు దా
నియ్యెడ కేఁగుదేవలయు
నే పని సేయఁగఁ బూని? దీనిపై
నెయ్యముకల్మి యేకొలఁది
నీమది? కింతయు నాకుఁ జెప్పుమా!"

(విరాట. 2-40)

కర్ణుడు భీష్ముని ముదుకడని పరిహసించినప్పుడు, వృద్ధుడగు నాతని సమాధానము కర్ణునకు మర్మఘాతియై, చదువరుల కెంతో హృద్యముగా నున్నది. సందర్భమునకు తగినట్లు శైలియు నమరియున్నది.

"ముదుకఁడనైన నాదు బల
ముం జలమున్ వివిధాస్త్ర శస్త్రసం
పదయును, బోయి నీగురుఁడు
భార్గవుచే విను, మాజిభూమి నా
కెదిరినవారు పెక్కు్డల
నేమయిరో యెఱుఁగున్ జగంబు, నా
ముదిమియు, నీకుమారుతన
మున్ వరుసన్ విజయుం డెఱింగెడున్."

(ఉద్యో. 4-246)

ఈ విధమగు రచనా విధానమునే తిక్కన గద్యములందును అనుసరించెను. అతని వచనములు అలతి యలతి పదములతో నుండి, చెప్పదలచిన భావమును సూటిగను, విస్పష్టముగను చెప్పును. ఉదాహరణముగా ఈ క్రింది వచనమును తీసికొనవచ్చును—

"విద్యయు అవిద్యయు అనగా రెండు కలవు. అవిద్యా దూషితుండై తమోగ్రస్తుండయినవాడు విష్ణుని ఎరుంగడు; విద్యా సంపన్నుడు ఎరుంగును; అనిన విద్య యనునది యెట్టిది? దానిని చెప్పుమనుటయు . ..."

"ఇట్టి క్రూరుల యింటి కిచ్చిన మనవారి నందుగాక" యను కుంతి పలుకులు జాతీయములై ఆంధ్రుల యాడుబిడ్డలను తలపించుచున్నవి.

తిక్కన వాడిన జాతీయములు, సామెతలు సార్వకాలికములై, నేడును మన నిత్యవ్యవహారములో వినిపించునవియే.

'మంటలో మిడుతలు సొచ్చినట్లు'
'కయ్యమునకు కాలుద్రవ్వుట'
'అందని మ్రాకుల పండ్లు కోయ దలచుట'
'మడుగుచీరయందు మసి దాకినట్లు'
'అరచేత ప్రాణంబు లిడి'
'ఉరిసిన పుండుల నుప్పుపెట్టుట'
'చెవులు పట్టి యాడించుట'
'నేతికుండపై ఎలుక'
'పాలతోడ విషం బిడుపగిది'

ఇట్టి వాక్యములు తిక్కన రచనలలో పెక్కు లుండి, భారతమును ఆంధ్రజనజీవనమునకు దగ్గరగా చేర్చినవి.

నీతులను, అర్థ-ధర్మశాస్త్రాది విషయములను, ఉత్తమ తత్త్వములను స్పష్టముగా సరళముగా చెప్పుటలో తిక్కన కడు సమర్థుడు. శాంతిపర్వమున నివి మెండుగా నున్నవి. గృహస్థాశ్రమధర్మ మీ క్రింది విధముగా వివరింప బడినది —

"నిజదారైకపరత్వముం, గరుణయున్,
నిక్కంబునుం, దాల్మియున్,
సుజనాసంగము, దేవపిత్రతిథి సం
శుద్ధార్చనల్, హవ్యభు

గ్భుజనంబున్, సకలాశ్రమస్థులను శ
క్త్యప్రక్రియం బ్రోచు పం
కజగర్భుండు, గృహస్థధర్మములుగాఁ
గల్పించె నుర్వీశ్వరా!"

(శాంతి. 2-231)

జీవిత పరమలక్ష్యమగు ఈ యుత్తమతత్త్వమును గమనింపుడు—

"గతమునకు వగవ,కనా
గతమునకు నోరు దెఱచి కడుఁగోరక, దీ
నతఁ బొందక, దైవం బే
గతిఁ బుచ్చిన దానఁ బోదుఁగా కనవలయున్."

(శాంతి. 3-30)

ఇట్టిదే ఈ క్రింది రాజనీతియును—

"రాజునకుఁ బ్రజ శరీరము,
రాజు ప్రజకు నాత్మ, గాన రాజుం, బ్రజయున్
రాజోత్తమ! యన్యోన్యవి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్."

(శాంతి 2-274)

ఈ నీతులను చెప్పుటకు తిక్కన కందపద్యములనే ఎక్కువగా వాడి నాడు. తిక్కన భారతములోని మొత్తము గద్యపద్యములలో రమారమి మూడవవంతు కందపద్యములే. కందపద్య రచనకు తిక్కన పేరుగన్నవాడు కట్టమంచి రామలింగారెడ్డిగారు 'అంతా కవులము గామాః అంతంతగ కంది పద్య మల్లగలేమా॰' అని యనిరి. కాని తిక్కనవలె కందపద్యములన అల్లుట ఎందరకు సాధ్యమగును' ఈ నేర్పున కుదాహరణములుగా ఈ క్రింది పద్యములను గ్రహింపవచ్చును-

"ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పను, మా
కీ పుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!"

(ఉద్యో. 3-6)

"లక్కయిలు గాలినది మొద
లక్కట! మా తల్లి మాకునై నెవ్వగతోఁ
బెక్కుడుమలఁ బడుచున్నది
దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్."

(ఉద్యో. 3-13 6)

"క్షీరోదకగతిఁ బాండవ
కౌరవు లొడఁగూడి యునికి కార్యం, బది నీ
వారసి నడపుము, వారన
వీరనఁ గురుముఖ్య! నీకు వేఱుంగలదే!"

(ఉద్యో. 3-258)

ఛందస్సులో తిక్కన యొక విలక్షణతను పాటించునట్లు తోచును. సౌప్తికపర్వములోనే చాల మహాస్రగ్ధర లున్నవి. తిక్కన సాధారణ వృత్తములనే తప్ప విశేష వృత్తముల నుపయోగింపడను ఆక్షేపణ యొకటి యుండినదనియు, దానిని తొలగించుకొనుటకే స్త్రీపర్వమున పెక్కు విశేష వృత్తములను వాడెననియు, కొందర యభిప్రాయము. రసస్ఫూర్తికి అవసర మని ఆ పర్వములో అన్ని విశేష వృత్తములను రచించి యుండవచ్చునని కొందరి యూహ. ఇందు అంబురుహము, ఉత్సాహము, ఉపజాతి, తరల, తరువోజ, తోటకము ఇత్యాదులగు విశేషవృత్తముల నుపయోగించుటయే కాక, ఉత్పల - చంపకమాలలు, శార్దూల - మత్తేభముల వంటి సామాన్య వృత్తములను పరిహరించినాడు. స్త్రీ పర్వమున మహాస్రగ్ధరలుకూడ కానరావు.

తిక్కనకు వ్యాసునిపై అపారభక్తి గౌరవము లున్నవి. వ్యాసుని ధ్యేయము 'లోకహితనిష్ఠ'. తిక్కన ఆశయము 'ఆంధ్రావళిమోదము'. ఇంతటి భావసామ్యము గల వ్యాసునిపై తిక్కనకు అంతటి భక్తితత్పరత యుండుట వింతకాదు. కావుననే వ్యాసుని ప్రసక్తి వచ్చినప్పుడెల్ల, తిక్కన భక్తిపార వశ్యముతో పులకిత గాత్రుడై, అతనిని స్తుతించును; మహోదాత్తమగు ఆ మూర్తిని దివ్యముగా ప్రదర్శించును-

# తి క్క న

"ప్రాంశుఁ, బయోదనీలతను
భాసితు, నుజ్జ్వలదండధారుఁ, బిం
గాంశు, జటాచ్ఛటాభరణు,
నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారుఁ, గృష్ణమృగ
చర్మకృతాంబరకృత్యు, భారతీ
వంశ వివర్ధనుం, ద్రిదశ
వందితు, సాత్యవతేయుఁ గొల్చెదన్."

(భీష్మ. 1-71)

తిక్కనకు సాక్షాత్కరించిన వ్యాసుని మహోజ్జ్వలరూప మిట్టిది.

మహాభారతమునందలి సాంఘికేతివృత్తము విభిన్నమనఃప్రవృత్తులకు నిలయమైనది. ఇందలి సమస్యలు, పరిష్కారములు ఆంధ్రుల నిత్యజీవనాను భవమున నున్నవే. కావుననే ఆంధ్రులు తిక్కన భారతమున తమ జీవన ప్రతిబింబమును చూడగలరు. జాతీయ శ్రేయస్సునే జీవితధ్యేయముగా గలిగిన మహావ్యక్తి తిక్కన. ఇంతటి విశాల జాతీయభావము గల ఆంధ్రకవి మరియొకడు లేడు.

ఎఱ్ఱనాదులగు తెలుగుకవులేకాక, సంస్కృతకవయిత్రియగు గంగాదేవికూడ తన 'మధురావిజయ' కావ్యమున, తెలుగు కవులలో తిక్కనను మాత్రమే యిట్లు స్తుతించినది-

"తిక్కయజ్వకవే స్సూక్తిః కౌముదీవ కలానిధేః,
సతృష్ణైః కవిభి స్స్వైరం చకోరై రివ సేవ్యతే."

(మధురావిజయము-1-13)

(వెన్నెలను చకోరములు గ్రోలినట్లు, కళానిధియగు తిక్కనకవి సూక్తులను కవులు మిక్కిలి కుతూహలముతో నాస్వాదింతురు.)

సమకాలమునను, తరువాతికాలమునను, సకలాంధ్రకవి స్తుతులకు పాత్రుడగుటయేగాక, సంస్కృతకవుల స్తోత్రములకును పాత్రుడగు ఘనత తిక్కన కొక్కనికే దక్కినది. అశేషాంధ్రజన హృదయములలో అగ్ర స్థానము నాక్రమించియుండు ఈ మహోజ్జ్వలమూర్తి సర్వదా ఆంధ్రుల జీవితముల నుజ్జ్వల మొనరించుగాత!

# శ్రీ నా థు డు

కవిత్రయమువారి తరువాత ఎన్నదగినవాడు - నూతన ప్రక్రియలకు మార్గదర్శకుడు, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమును బ్రోచినవాడుగా రామ రాజభూషణునిచే కీర్తింపబడినవాడు, సరస కవితాదురంధరుడు, సకలవిద్యా సనాధుడు - మన కవిసార్వభౌముడు శ్రీనాధుడు. చాళుక్యుల కాలమున వాగను శాసనుడును, కాకతీయయుగమున కవిబ్రహ్మయు, రెడ్డిరాజుల ప్రారంభ దశలో ప్రబంధపరమేశ్వరుడును ఆంధ్రసరస్వతిని కావ్యకుసుమములతో పూజించిరి. శ్రీనాధుడు ఆ సరస్వతిని వినూత్న భూషణములతో నలంకరించి అలరించినాడు. ఈ సాహితీభగీరధుడు ఆంధ్రకవితా వియద్వాహినిని దేశమం దంతటను ప్రవహింపజేసి, పునీత మొనరించెను; సారస్వతాకాశమున ధ్రువ తారగా నిలచెను.

బాల్యమునుండియు కవిత్వరచనాశీలియై ఇతడు, తన జీవితకాల మందలి ఒక్కొక్క దశకు ప్రతీకగా ఒక్కొక్క కావ్యమును, ఆంధ్రావళికి అర్పించెను. శ్రీనాధుడే తన బహుకావ్య కర్తృత్వమును ఇట్లు చాటు కొనెను___

"చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర,
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి,
సంతరించితి నిండు జవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ,
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమఁ,

ప్రాయ మెంతయు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండ మను మహాగ్రంథ మేను
తెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి."

(కాశీ. పీఠిక-7)

ఇచ్చట పేర్కొనబడక పోయినను, హరవిలాసము, పండితారాధ్య చరిత్ర, శివరాత్రి మాహాత్మ్యము, క్రీడాభిరామము, పలనాటి వీరచరిత్ర అను కావ్యములును శ్రీనాథవిరచితములుగనే లోకప్రసిద్ధి నందియున్నవి. మరుత్త రాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రయు మన కిపుడు లభించుటలేదు. శాలివాహన సప్తశతిలోనివిగా లక్షణ గ్రంథములలో రెండు పద్యములు మాత్రము ఉదాహరింపబడియున్నవి.

ఇతడు తాను కవిత్రయమువారిచే ప్రభావితుడైనట్లు చెప్పికొన్నాడు-

"భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు,
వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు,
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరునిలేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు."

(కాశీ. పీఠిక-13)

మనప్రాచీనకవులలో తిక్కనాదులు అర్థభావముల నారాధింపగా, నన్నయ సుందరశయ్యకు అంకురార్పణము జేసెను. దీనికే నాచనసోముడు బహుభంగుల దోహద మొనర్చెను. ఈ శయ్యాసౌభాగ్యమును శ్రీనాథుడు పరిణతికి తెచ్చెను. ఇతడు పురాణకవులకును, ప్రబంధకవులకును మధ్యకాల

మున వెలసినవాడు. మాతృకానుసారముగా ఇతడు అనువదింపగా, ఇతని తరువాతి కవులు ప్రబంధమార్గమును సృష్టించుకొని, ఇతనిశైలిని ఎంతగనో అనుకరించిరి. రసపోషణలో, అంగప్రత్యంగవర్ణనలో, పాత్రచిత్రణములో, ఆలంకారికశైలిలో, సమతాగుణప్రధానమగు సీసపద్యరచనలో శ్రీనాథుడే ప్రబంధకవులకు మార్గదర్శకుడు.

సంస్కృత సాహిత్యార్ణవావలోడన సంజాత పరిజ్ఞానమంతయు శ్రీనాథునికావ్యములలో ప్రతిఫలించుచుండును. రసభావభావనా మహనీయ కవితా సముల్లాసుడగు కాళిదాసుని కుమారసంభవమునందలి గిరిజాకల్యాణ ఘట్టమును 'హరవిలాసమున' అనువదించెను. నిరవద్యగద్యపద్యనిబంధ పరితోషిత స్థాణుడగు భట్టబాణుని 'కాదంబరి' నుండి సుందరసుకుమార వాక్యముల నెన్నింటినో 'శివరాత్రిమాహాత్మ్యమున' చేర్చెను. అతుల గుణ స్ఫారుడగు మయూరునిసూర్యశతకమునందలి శ్లోకసౌందర్యమునకు ముగ్ధుడై, కొన్నింటిని తెనిగించి, 'కాశీఖండమున' సమకూర్చెను. అంభోధివార్వీచి గంభీరతాసార వాక్సముత్కృష్టుడగు శ్రీహర్షుని 'నైషధకావ్యము'ను 'శృంగార నైషధప్రబంధము'గా అనువదించి, మహితయశోమండను డాయెను.

శ్రీనాథుని కావ్యములలో నవరసభావానుబంధుర మగు శృంగార నైషధమునకు సిద్ధించిన ప్రశస్తి ఇతర కృతులకు లభింపలేదు. అందు కొన్ని మాహాత్మ్యముల నభివర్ణించునవి; మరికొన్ని శివలీలలను వర్ణించి, శివభక్తి నుద్బోధించునవి. 'అష్టాదశవర్ణనా గర్భంబుగా అత్యాశ్చర్యకరంబై యుండ, శివరాత్రిమాహాత్మ్యమును రచియింపబూనితి' నని చెప్పికొనెనే గాని, అది యును మాహాత్మ్యగ్రంథమే యైనది. పూర్వాంధ్ర కవులు పురాణేతిహాసాదు లనే తెనిగింప, శ్రీనాథుడు హర్షనైషధకావ్యము నాంధ్రీకరించుటకు నెన్ను

కొనుటలో ఒక విశేషము, ఔచిత్యము ఉన్నట్లు తోచును. శ్రీహర్షుడు కన్యాకుబ్జ రాజాస్థాన రంగ మంగళాభరణము, వైతండికకమలషండవేదండము; షట్తర్క మర్మైక చక్రవర్తి, చింతామణిమంత్రసిద్ధుడు, కవిచక్రవర్తి. శ్రీనాథుడును బ్రాహ్మీదత్త వరప్రసాదుడు; ఉరుప్రజ్ఞా విశేషోదయాజిహ్మ స్వాంతుడు; బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానము; ఆగమజ్ఞాననిధి, తత్త్వఖని, సంగీత సాహిత్యచాతుర్యకవిత చెప్ప నేర్చినవాడు. ఇన్నిట శ్రీహర్షునితో సాటిరాగల మేటి శ్రీనాథుడు.

సంస్కృతనైషధము మహాకావ్యమైనను, తత్కర్తయగు శ్రీహర్షుడు కాళిదాస-భవభూత్యాది కవీశ్వరులతో సాటిరాడు. వారి రససిద్ధి అతనికి లభింప లేదు. శబ్దచమత్కృతి, కల్పనా చాతుర్యము, పాండిత్యప్రకటనము, అతని కవిత్వమందు ప్రస్ఫుటముగ భాసించుచుండును. శ్రీనాథుడు పండితుడేగాక, మహాకవి. కావుననే విద్వదౌషధమగు సంస్కృత నైషధమును విద్వదమృత మగు సుందర శృంగారప్రబంధముగా తెనిగించెను. శ్రీహర్షుడు తన కావ్యమునకు "శృంగార నైషధ" మని పేరుపెట్టలేదు కాని "శృంగారభంగ్యా మహాకావ్యే చారుణి నైషధీయచరితే" అని నైషధచరిత శృంగారరసవృత్తిచే సుందరమైన దని చెప్పెను. శ్రీనాథుడును ఆంధ్రనైషధకర్తగా తనను చాటు కొనుటలోనే మితిలేని సంతృప్తిని పొందియుండును. చూడుడు—

"కల్పించినాడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష."

"పలుకుతోడై తాంధ్రభాషామహా
కావ్యనైషధగ్రంథసందర్భమునకు."

# శ్రీ నా థు డు

"సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష."

"ఆంధ్రభాషానైషధాబ్జభవుని."

నైషధకావ్యోపసంహారవచనమున శ్రీనాథుడు తన అనువాదవిదానము నిట్లువివరించెను-"నైషధశృంగారకావ్యప్రబంధ విశేషంబున నశేష మనీషి హృదయంగమంబుగా శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గురించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున జెప్పబడిన ఈ భాషా నైషధ కావ్యంబు విలసిల్లు నాచంద్రతారార్కంబు." ఈ అనువాదవిధానమును నైషధకావ్య రచనయందేకాక, తక్కిన కృతుల యందును పాటించెను.

శ్రీహర్షుని శబ్దవిన్యాసమును, వాక్యములను, తెలుగు విభక్తిప్రత్యయములు మాత్రము చేర్చి, కొన్ని తావుల శ్రీనాథు డటులనే గ్రహించెను. ఈ విషయమునే పిడుపర్తి సోమనాథకవి తన బసవపురాణమున 'అతడు పద్య కావ్యము చేసె, నైషధ మంచిత హర్ష వాక్యముల బెట్టి' అను మాటలతో వివరించెను. కాని శ్రీనాథుడు తన ఆంధ్రీకరణములో తెలుగుభాషా సంప్రదాయములకు భంగమురాని విధముగా మూలభావములను, భాషను సంస్కరించి, సంగ్రహించి, అనువాదమును కొనసాగించెను.

కొన్ని తావులలో శ్రీనాథుడు మూలములోని పదములను, పదబంధములను యథాతథముగా గ్రహించి, తెలుగు విభక్తులను చేర్చి రచించినాడు. కావ్యారంభమున—

"సువర్ణదండైకసితాతపత్రిత -
జ్వలత్ప్రతాపావళికీర్తిమండలః"

(నైష. 1-2)

అని మూలమున నుండగా—

"తపనీయదండైకధవళాతపత్రితో
ద్దండతేజఃకీర్తిమండలుండు"

(శృం. నై. 1-46)

అనియు,

"అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవా -
జిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా"

(నైష. 2-102)

అను మూలమును—

"వేదాభ్యాసవిశేషపూతరసనా
విర్భూతభూరిస్తవా
సాదబ్రహ్మముఖౌఘవిఘ్నితనవ
స్వర్గక్రియాకేళిచే"

(శృం. నై. 2-41)

అనియు, నీత డాంధ్రీకరించెను.

ఇట్టి మూలవిధేయమైన అనువాదము హరవిలాసములోని గిరిజా కల్యాణ ఘట్టములోను కాననగును. చూడుడు—

"నిష్కంపవృక్షం నిభృతద్విరేఫం
మూకాండజం శాంతమృగప్రచారమ్,
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారంభ మివావతస్థే."

(కుమా. 3-42)

అను కాళిదాసుశ్లోకము శ్రీనాధుని రచనలో "నిష్కంప వృక్షంబును, నిభృత ద్విరేఫంబును, మూకాండజంబును" - ఇత్యాదిగా గల వచనముగా రూపొందినది.

శ్రీహర్షుడు విచిత్రములును, వినూత్నములును అగు సమాసములను, శబ్దకల్పనలను తన కావ్యమున సృష్టించి, తన పాండితీగరిమను, అపూర్వ శబ్దప్రయోగచాతురిని వెల్లడించుకొనెను. అట్టి పదబంధములను తన అనువాదమున సంతరించుటకు శ్రీనాధుడు ఒకే విషయమును రెండు పద్యములలో పునరావృత్తముచేసి తృప్తి చెందెను. హర్షనైషధమున హంస తాను బహు దేశసంచారము కావించుచు, విదర్భదేశమున దమయంతిని కాంచినట్లు నలునితో పలికినది.

"సరసీః పరిశీలితుం మయా
గమికర్మీకృతనైకనీవృతా,
అతిథిత్వ మనాయి సా దృశోః
సదసత్సంశయగోచరోదరీ."

(నైష. 2-40)

ఈ శ్లోకమునందలి గమికర్మీకృతనైకనీవృతా, సదసత్సంశయగోచరోదరీ - అను రెండు సమాసములను, మూలములో వలె ఒకే పద్యమునందిముడ్చుటకు సాధ్యము కాలేదు. కావున రెండు పద్యములను వ్రాసి తృప్తి జెందినాడు. చూడుడు—

"మృదురీతిం బ్రతివాసరంబు గమిక
ర్మీభూతనానానదీ
నదకాంతారపురీశిలోచ్చయుఁడనై
నైకాద్భుతశ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నా
రీరత్నముం గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శర
త్సంపూర్ణచంద్రాననన్."

(శృం. నై. 2-20)

"కమలేందీవరషండమండితలస
త్కాసారసేవారతిన్
గమికర్మీకృతనైకనీవృతుఁడనై
కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్
రాకేందుబింబాననన్
సమపీనస్తని నస్తినాస్తివిచికి
త్సాహేతుశాతోదరిన్."

(శృం. నై. 2-21)

ఇట్టి అనువాదమును చూచి, కొందరు సంస్కృత పండితులు 'నీ డుము వు లు నీవు గ్రహించి, మా నైషధమును మాకి' మ్మని పరిహసించి నట్లు ఒక కథ ప్రచారమున కలదు. కాని, శ్రీనాథుని కావ్యానువాద మంతయు ఇట్లే శ్రీహర్షుని శబ్దాడంబరముతో నిండియుండు నని భావించుట అను చితము. ఎన్నియో సందర్భములలో మూలశ్లోకములకు సుందరము, సరళము

నగు ఆంధ్రీకరణము కావించి, భావమును స్ఫుటముగా వ్యక్తపరచెను. హంస దమయంతికడ తన మహత్త్వమును, ఆ కన్యపై తనకు గల ప్రీత్యతిశయమును-చాటుకొనుచు ఇట్లనెను—

"విధిం: వధూసృష్టి మపృచ్ఛమేవ
తద్యానయుగ్యో నలకేళియోగ్యామ్,
త్వన్నామవర్ణా ఇవ కర్ణపీతాః
మయాస్య సంక్రీడతి చక్రచక్రే."

(నైష. 3-50)

"రథమును వహించు సందర్భమున నలకేళికి యోగ్యయగు వధూ సృష్టిని గూర్చి బ్రహ్మను ప్రశ్నించితిని. ఆ చక్రముల కోలాహలమున, ఆతడు పలికినది, నీ పేరునందలి వర్ణములుగా నాకర్ణముల సోకినవి' అని శ్లోక భావము. దానికి శ్రీనాథుని తెలుగు సేత—

"అడిగితి నొక్కనాఁడు కమ
లాసనుతేరికి వారువంబనై
నడచుచు, 'నుర్విలో నిషధ
నాథున కెవ్వతె యొక్కొ భార్య య
య్యెడు?' నని, చక్రఘోషమున
నించుక యుంచుక గాని, యంత యే
ర్పడ విననైతి, నీ వనుచుఁ
బల్కిన చందము దోఁచె మానినీ!"

(శృం. నై. 2-58)

ఇట్టి సరళానువాదముల నాతడు ఇతర కావ్యములందు కూడ కావించెను.

"ఏకం తు తనయముఖకమల దర్శనసుఖం న లేభే, తథాసంభుజ్యమానమపి, నిష్ఫలపుష్పదర్శనం శరవణ మివాంతఃపుర మభవత్."

(కాదంబరి-పేజీ 59 - Peterson Edn.)

అను బాణుని కాదంబరీవచనమును తన శివరాత్రి మాహాత్మ్యమున నిట్లు అనువదించెను—

"తనయసంతానలబ్ధి దౌదవ్వ గాఁగ
విభవసంప త్తి గల్గియు విన్నవోయి
వనిత నిష్ఫలపుష్పదర్శనముఁ దాల్చె
శరలతాకాననమువోలె జవ్వనంబు."

భట్టగోపాలుని కావ్యప్రకాశికావ్యాఖ్యానమగు 'సాహిత్య చూడామణి' అవతారికలో సరస్వతీప్రార్థన మిట్లున్నది—

"ప్రణౌమి క్వణదోంకారమణిఘంటావిభూషితామ్,
కవిలోకకుటుంబస్య కామధేనుం సరస్వతీమ్."

ఈ శ్లోకమును శ్రీనాథుడు కాశీఖండ పీఠికలో—

"కంఠపట్టిక నోంకారఘంట మొరయఁ
జెలఁగుఁగావుత మన్మనఃక్షేత్రసీమఁ
గవికుటుంబంబుపాలిటి దివిజసురభి
జలజసంభవుబోటి భాషావధూటి."

(కాశీ. పీఠిక-5)

అను పద్యరూపమున తెనిగించెను. 'నాదముచేయుచున్న ఓంకారమణి ఘంటచే విభూషితయు, కవికుటుంబమునకు కామధేనువునగు సరస్వతికి నమస్కరింతు' నని శ్లోకార్థము. 'కవికుటుంబము పాలిటి కామధేనువును, బ్రహ్మపత్నియు నగు వాణి,కంఠపట్టికయందు ఓంకారఘంట నినదించుచుండగా, నా హృదయ

సీమలో ప్రకాశించుగాక' అని పద్యభావము. శ్లోకములోని భావము పద్యములో అతిసుందరముగా రూపొందినది.

మూలమున సామాన్యముగా నున్న భావమును శ్రీనాథుడు విపులీకరించి, రసభావబంధురముగా తీర్చును.

"మదేకపుత్రా జననీ జరాతురా
నవప్రసూతి ర్వరటా తపస్వినీ,
గతి స్తయో రేష జన స్త మర్దయన్
అహో! విధే! త్వాం కరుణా రుణద్ధి నో?"

(నైష. 1-135)

అని హంస నలుని ప్రార్థించినది. తెనుగు నైషధమున హంస—

"తల్లి మదేకపుత్రక, పెద్ద, కన్నులు
గాన విప్పుడు, మూఁడుకాళ్ళముసలి,
యిల్లాలు గడు సాధ్వి, యేమియు నెఱుఁగదు,
పరమపాతివ్రత్యభవ్యచరిత,
వెనుక ముందర లేరు నెనరైన చుట్టాలు,
లేవడి యేంతేని జీవనంబు,
కానక కన్న సంతానంబు శిశువులు,
జీవనస్థితి కేన తావలంబు,

కృపఁదలంపఁగదయ్య యో నృపవరేణ్య!
యుభయ మీవయ్య యో తుహినాంశువంశ!
కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖి!
నిగ్రహింపకువయ్య యో నిషధరాజ!"

(శృం. నై. 1-109)

శ్లోకములోని ఒక్కొక్క పాదమునందలి అంశములకు తెలుగు పద్యములోని ఒక్కొక్క పాదము వ్యాఖ్యాన ప్రాయముగా నున్నది. ఇందు కరుణరస పూరితమైన హంసదైన్యస్థితి కన్నులకు గట్టినట్లు చిత్రింపబడినది.

మూలమున గల అనౌచిత్యమును ఎన్నియో తావులలో శ్రీనాథుడు పరిహరించెను. దమయంతి పాదస్పర్శతో ధన్యములైన రాజమార్గములు గల పట్టణముగా మూలమున విదర్భ వర్ణింపబడినది.

"భైమీపదస్పర్శకృతార్థరథ్యా
సేయం పురీ త్య్వత్కలికాకుల స్సన్."

(నైష. 6-5)

దమయంతి తన పాదపల్లవములతో రాజవీధులందు నడచుట అనుచితమని భావించి, దానిని శ్రీనాథుడు 'దమయంతీసుకుమారపాదకమలద్వంద్వార్పణా ధన్యకుట్టిమహర్మ్యంబగు' పట్టణముగా వర్ణించెను. దమయంతి సంచరించు సౌధములను కలిగియుండుటచే ధన్యమగు పట్టణము - అనుటలో ఔచిత్యము ఎంతేని కలదు.

దేవదూతగా వచ్చిన నలునితో దమయంతి—

"గిరః శ్రుతా ఏవ తవ శ్రవస్సుధాః
శ్లథా భవన్నామ్ని తు న శ్రుతిస్పృహా,
పిపాసుతా శాంతి ముపైతి వారిజా
న జాతు దుగ్ధాత్ మధునోఽధికా దపి."

(నైష. 9-5)

అని పలికినది. 'శ్రవణామృతతుల్యములగు నీ వాక్కులను వింటిని కాని నీ పేరును తెలిసికొనుటయందు నా కాసక్తి లేదు. నీటికై జనించిన దప్పి

మిక్కుటమగు పాలవలన గాని, తేనెవలనగాని ఎన్నడును తీరదు' అని ఈ మాటలకు అర్ధము. దీనిని శ్రీనాథుడు స్వల్పముగా మార్చెను.

"అధికతరు లైనఁగాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీ వంశకథలయందె,
దప్పిగొన్నట్టివారి కా దప్పి దీఱ
సలిలపూరంబు హితవొ? యాజ్యంబు హితవొ?"

(శృం. నై. 4-52)

'దేవేంద్రాది దిక్పాలకులు మహోన్నతులే కావచ్చును కాని నీవంశకథను వినుటయందే నాకు కుతూహలము మెండు. పిపాసార్తుడగువానికి దప్పిదీరుటకు జలము హితముగా నుండును కాని, నేయి కాదు' అని దీని అర్థము. నీటికన్నను మధురములగు పాలు, తేనె కొంతవరకునైన దాహమును తీర్ప సమర్థములు కాగలవేమో? నేయి నీటికంటె ఉత్కృష్టమైనను, ఆస్వాద యోగ్యమైనను, దానివలన దప్పి హెచ్చునే కాని తీరదు కదా? కాన దేవతలు నలునికంటె అధికులే అయినను, నలునిచే మాత్రము తొలగు తన తాపము, వారివలన తీర దను భావము నిట దమయంతి స్పష్టము చేసినది.

రసభంగమునకు కారణ మగునది అనౌచిత్యముకంటె మరియొకటి లేదని ధ్వన్యాచార్యుని అభిప్రాయము. శ్రీహర్షుడు విశృంఖలముగా సాగించిన వర్ణనములలో దొరలిన కొన్ని అనౌచిత్యములను శ్రీనాథుడు పరిహరించి, ఆ సన్నివేశములకు సరసత్వము నాపాదించెను. నలునికడ తనకు గల చనవును గురించి ముచ్చటించుచు హంస, దమయంతితో—

"సువర్ణశైలా దవతీర్య తూర్ణం
స్వర్వాహినీవారికణావకీర్ణైః,
తం వీజయామః స్మరకేళికాలే
పక్షై ర్నృపం చామరబద్ధసఖ్యైః."

(నైష. 3-22)

అని-రతికేళిసమయమున శ్రమాపనోదనార్థమై, ఆకాశగంగాజలకణసిక్తము లగు తమ పక్షములతో నలునకు వీతుమని దమయంతికడ చాటుకొనినది. కన్యకడ నలుని 'స్మరకేళి' కాలమును ప్రసక్తము చేయుట అనుచితమని శ్రీనాథుడు, దానిని 'వైశాఖవేళ'గా మార్చెను.

"కనకశైలంబు డిగ్గి యాకాశసింధు
సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల
వీతు మతనికి వైశాఖవేళలందు."

(శృం. నై. 2-51)

వేసవితాపమును తీర్చుటకై, గంగాసలిలావగాహనమున మిగుల చల్లనగు స్వర్ణమయపక్షములతో హంసలు నలునకు వీచినవి. చామర సౌందర్యమునకు తోడు, మారుతధర్మ మగు శైత్య మిందు చేరి,భావమును పెంపొందించినది.

నలుని సౌందర్య విభవాదికములకు ముగ్ధలై, లోకమాతలగు లక్ష్మి, పార్వతి, సరస్వతులును, శచీదేవియు ఆతనియందు చాపలమును వహించి రని మూలమునందు కలదు. జగన్మాన్యలు, అతిపవిత్రలు నగువారి కీ దోషము

నంటగట్టుట అనుచితమని భావించి, శ్రీనాథుడు, ఆ శ్లోకములను తెనిగింపక వదలివేసెను. దేవవేశ్యయగు రంభ నలుని కాంక్షించియు, పొందనేరక, నామ సాదృశ్యము గల నలకూబరుని వలచె నను భావమును మాత్రము ఆంధ్రీక రించుటతో, ఔచిత్యమును సాధించుటయేకాక, రసభంగమును నివారించెను.

శ్రీనాథుడు కొన్ని సందర్భములలో అమూలకములగు కల్పనలతో భావమును సుందరతరము గావించెను. ఇంద్రుని దూతిక దమయంతితో-

"లిపి ర్న దైవీ సుపరా భువీతి
తుభ్యం మయి ప్రేరితవాచకస్య"

(నైష. 6-77)

అని, దేవలిపిని భూలోకవాసులు చదువలేరు కాన నీకు ప్రణయలేఖ వ్రాయక, దేవేంద్రుడు నన్ను పంపె నని పలికినది. శ్రీనాథుడు ఈ భావమునకు కొంత కల్పన చేర్చి, మెరుగులు దిద్దినాడు.

"చంచలనేత్ర! దివ్యలిపి
సంతతి భూజనముల్ పఠింపలే
రంచును మానెఁ గాని, నఖ
రాగ్రమునన్ లిఖియించి నీకుఁ బు
త్తెంచుఁ జుమీ మహేంద్రుఁడు మ
దీయకరంబున దేవతావనీ
కాంచనకేతకీకుసుమ
గర్భదళంబునఁ గార్యపద్ధతుల్."

(శృం. నై. 3-122)

దేవలిపిని భూజనులు చదువలేరనియేగాని, లేకున్న మహేంద్రుడు నందనోద్యానమందలి బంగారు మొగలిరేకుపై వలరాచకమ్మను లిఖించి, నా చేత పంపియుందును-అని చెప్పుటతో భావము సుందరమై, చమత్కారముగ భాసించినది.

దండి తన కావ్యాదర్శమున అష్టాదశవర్ణనాబహుళముగా కావ్య ముండ వలె నను నియమము నేర్పరచెను. శ్రీనాధుడు పురాణములనుండియు, సంహితలనుండియు, స్థలమాహాత్మ్యములకును, శివలీలలకును సంబంధించిన ఇతివృత్తములను గ్రహించి, రచించినను, అవి నగర, శైల, సముద్ర, సూర్యోదయ, చంద్రోదయ, వన, జలకేళీ, రతాది వర్ణనములతో కూడి యున్నవి. కుండినపుర, రత్నపురముల వర్ణన, వింధ్యనగవర్ణన, క్షీరాబ్ధివర్ణన, వసంతాది ఋతువర్ణనలు శ్రీనాధుని వర్ణనాదక్షతను వెల్లడించును. తర్వాతి ప్రబంధములకు ఈ అష్టాదశవర్ణనలు ముఖ్యలక్షణముగా నేర్పడినవి.

అలంకారభూషితములగు శ్రీనాధుని పెక్కు వర్ణనములు ధ్వనియుక్తములై, ఉదాత్తములుగా భాసించుచున్నవి.

"చరమాచల శిఖరంబునఁ
దిరమై యొక్కింతతడవు దినకరుఁ డొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించుటద్దం బగుచున్."

(భీమ. 2-27)

అస్తమించు సూర్యుడు పడమటికొండపై నించుక ఆగినాడట. అప్పుడా భానుబింబము తద్దిశాధిపతియగు వరుణుని అంతఃపుర కాంతలకు అద్దము వలె నున్నదట.

నక్షత్రోదయకాలమున, నీలాకాశముపై ప్రకాశించు నక్షత్రములు నీలవస్త్రముపై పరచిన ముత్యాలహారములవలె నున్నవని కవి వర్ణించినాడు-

"ప్రబలమై యంధకారంబు బలిసియుండఁ
దారకంబులు కాంతి నెంతయును బెరసె,
నీలిపట్టంబుఁ బఱచి పై నిలిపినట్టి
వలుఁద ముక్తాఫలముల తావళములట్లు."

(భీమ. 2-36)

గోదావరీప్రవాహము చిత్రగతుల సుందరముగా, వడిగా పారుచున్నది. దానిని గౌతమకన్యకగా రూపించి, కన్యల నడ బెడంగులు, ఒయ్యారపు సొంపులు, సోయగములు స్ఫురించునట్లు శబ్దములను సమకూర్చి, చమత్కారముగా నిట్లు చిత్రించెను-

"మలఁగి మలంగి భీమపతిమందిరమండలసిద్ధభూమికిన్
దొలఁగి తొలంగి యుచ్చలితతోయతరంగపరంపరోద్ధతిన్
జెలఁగి చెలంగి యారభటిశీర్ణదరాధరధాతురేణులన్
గలఁగి కలంగి పాఱె వడి గౌతమకన్యక దక్షవాటికన్."

(భీమ. 4-192)

వస్తువునకు శబ్దవిన్యాసముతో రూపకల్పన గావించి, అది మన కన్నుల యెదుట సాక్షాత్కరించునట్లు చేయుటలో కవిసార్వభౌముని ప్రతిభ అద్వితీయము. ఒక ఆంగ్ల విమర్శకుడు-'Poetry is the art of doing by means of words, what the painter does by means of colours.' అనెను. అనగా చిత్రకారుడు రంగులతో రేఖలతో కల్పించు రూపమునే కవి పదసంయోజనముతో కల్పించు నని అర్థము. ఆంగ్లకవులలో స్పెన్సర్, ఆంధ్రకవులలో శ్రీనాథుడు ఇట్టి శబ్ద చిత్రణమునకు ప్రసిద్ధులు.

అర్జునుని పరీక్షించుటకై శివుడు ఇంద్రకీలాద్రికి వచ్చెను. అగజ చెంచెత కాగా, అతడు కిరాతు డైనాడు. ప్రభువుమన సెరిగిన శివచిహ్నాము లన్నియు, కిరాతచిహ్నములుగ మారినవి. ఆ రూప మెట్లున్న దన-

"వికటపాటలజటామకుటికాభారంబు
కఱుకైన జుంజుఱు నెఱులుగాఁగఁ
జారుసుధాధామశకలావతంసంబు
పెడకొప్పుపై నుండు పీఁకెగాఁగ,
ఘనలలాటంబునఁ గనుపట్టు కనుచిచ్చు
గైరికద్రవతిలకంబుగాఁగ,
భుజమధ్యమునఁ గ్రాలు భుజగహారంబులు
గురిజపూసలగుబ్బసరులుగాఁగ,
శంకరుండు కిరాతవేషంబు దాల్చి,
యగజ చెంచెతయై తోడ నరుగుదేరఁ,
బాణి నోంకారదివ్యచాపము ధరించి,
వచ్చె విష్వచ్చువరతపోవనముకడకు."

(హర. 7-41)

అగస్త్యుడు దర్శించిన వ్యాసునిమూర్తి నేటికిని ఈ వర్ణనమున మనకు సాక్షాత్కరించును-

"భస్మత్రిపుండ్రాంకఫాలప్రదేశుని,
రుద్రాక్షమాలికారూఢవక్షు,
నుపవీతకృష్ణాజినోత్తరాంగమువానిఁ,
బల్లవారుణజటాపటలధారుఁ,

దా|మహస్తాంగుళీదర్భమాలపవి|త్రుఁ,
దరుణకింశుకలతాదండధారుఁ,
|బావృషేణ్యవినీలపాథోధరశ్యాము,
సాలవృక్ష|ప్రాంశుఁ, జారుదేహుఁ,
బరమభాగవతో_త్తమ|ప్రథమగణ్యు,
విమలమాహేశ్వరాచారవిధికథకు,
నఖిలనీవారముష్టింపచా|గ్రసరునిఁ,
బులినసంభవుఁ బొడగాంచెఁ గలశజుండు.”

(భీమ. 2-83)

|శ్రీనాథుడు అఖండ పాండితీగరిమ సంపన్నుడు. |శ్రీహర్ష నైషధాం|ధ్రీకరణము, కాశీఖండరచన, అతని సంస్కృతభాషా పాటవమును చాటును. పాణినిసూ|త్రస్థవిషయములను చి|త్రముగా చమత్కరించి, వివరించిన తీరు, ఇతని అపార సంస్కృత వ్యాకరణ పాండిత్యమునకు నిదర్శనము.

“|ప్రాతఃకాలము వాయసంబు ‘ఫణినా
పత్యోక్తశాస్త్రంబులోఁ
దాతజ్స్థానులు చెప్పఁ డెవ్వి?’ యను చం
దంబొప్పఁ ‘గా? కౌ?’ యనం,
జాతుర్యం బలరార నుత్తరము వి
స్పష్టంబుగాఁ గోకిల
|వ్రాతం బిచ్చెఁ ‘దుహీ, తుహీ’ యని గృహా
రామ|ప్రదేశంబులన్.”

(శృం. నై. 8-19)

"తుహ్యోః తాతజ్ ఆశిషి అన్యతరస్యామ్" (7-1-35) అనునది పాణిని సూత్రము. పరస్మైపదమున లోట్ ప్రథమ మధ్యమ పురుషైకవచనములగు 'తు, హి' అను ప్రత్యయములకు ఆశీరర్థమున వికల్పముగా 'తాతజ్' అనునది ఆదేశ మగునని ఈ సూత్రమున కర్థము. 'తాతజ్' ఆదేశమునకు 'తు, హి' అను ప్రత్యయములు స్థానులు. ఈ వ్యాకరణాంశమును శ్రీనాథు డిట్లు సరసముగా చమత్కరించెను. ప్రాతఃకాలమున వాయసము తాతజ్ ఆదేశమునకు స్థానులు ఏవి? ఏవి? (కౌ? కౌ?) అని ప్రశ్నింపగా, కోకిలవ్రాతము విస్పష్టముగా, 'తుహీ, తుహీ' యని చతురముగా బదులు పలికినవట.

"వినువాచున్నది కాలయాపనకు, ను
	వ్విళ్ళూరెడున్ భావముల్,
రసభంగం బగు మానరోష మతిమా
	త్రంబయ్యెనే, నింతటం
బ్రసభాలింగనపూర్వకంబుగ మనో
	రాగంబు రెట్టింపఁగా
ణిసిధాత్వర్థ మనుగ్రహింపఁగదవే
	నీరేజపత్రేక్షణా!"

(శృం. నై. 8-52)

ఇట్లు వ్యాకరణాంశమునకు సరసత్వము నాపాదించు శ్రీనాథుని రాసిక్యము శ్లాఘాపాత్రము. (ణిసి-చుంబనే.) 'ణిసి' ధాతువు చుంబనార్థమున ప్రయోగింపబడును.

శ్రీనాథుడు పరిహాసప్రియుడు; చమత్కారి. కాశికా నగరమున మరణించినవారికి అర్ధనారీశ్వరత్వము సిద్ధించును. ఆ భావమునే శ్రీనాథుడు చమ

త్కారముగా, జంతువులు నిద్రలో కన్నులు మూసి తెరచినంతనే తమ శరీరములో ఒకవైపు పురుషభాగముగను, రెండవవైపు స్త్రీభాగముగను ఉండుటను గమనించి, ఆశ్చర్యపడుచుండు నని వర్ణించెను.

"కటకట! కాశికాపురి నొ
కానొక నిద్దురఁ గన్ను మోడ్చి, య
ప్పటఁ గనువిచ్చి చూచి, కుడి
భాగముఁ గన్గొని చోద్యమందు, దా
పటిదెసఁ జూచి యచ్చెరువు
పాటు వహించు మనస్సరోజసం
పుటమున, నాఁడులాగు, మగ
పోఁడిమియుంగల జంతుసంతతుల్."

(కాశీ. 3-99)

సులభమగు శైలిలో, చిన్న చిన్న పదములతో పద్యము లల్లుట శ్రీనాథునకు దుష్కరము కాదు. కాశీఖండమున విప్రకన్య యగు సుశీలముగ్ధరూప మిట్లు వర్ణింపబడినది—

"లలన సాక్షాత్కరించిన లక్ష్మిపోలెఁ
గంకణంబులతో నూడిగములు రాయ,
విశ్వనాథునికల్యాణవేదియందు
ముగ్గువెట్టంగ మోహించు ముజ్జగంబు."

(కాశీ. 5-145)

శ్రీనాథుడు పలువిధములగు సీసములను వివిధప్రయోజనముల నుద్దేశించి రచించెను. తర్వాతి కవు లెందరో సీసపద్య రచనయందు శ్రీనాథుని అనుకరించిరి. సీసముమీద తేటగీతినే వాడుట ఇతని సీసపద్యముల ప్రత్యేకత.

శృంగార నైషధమున ఒక్కచోట మాత్రము సీసము తర్వాత ఆటవెలది కలదు. కథాకథనమునకు శ్రీనాథుడు సీసపద్యములను అధికముగా ఉపయోగించెను. క్లుప్తముగ ఒక వృత్తాంతమును వివరించుచు, ఒక్కొక్క పాదమునందును, ఒక్కొక్క కథాంశమును చెప్పును.

దమయంతి జన్మవృత్తాంత మంతయు, ఇట్లు ఒక్క సీసపద్యమున సంగ్రహముగా నిబద్ధమైనది—

"ప్రత్యర్థిసార్థసార్థకనామధేయుండు
భూమీశ్వరుం డొప్పు భీముఁ డనఁగ,
నా రాజు త్రిదివంబు నమరేంద్రుఁడును బోలెఁ
దేజంబున విదర్భదేశ మేలు,
దమనాహ్వయుండైన తపసిసద్వరమునఁ
గాంచె నాతఁడు కన్యకాలలామ,
సర్వలోకాంగనాసౌభాగ్యగరిమంబు
దమియించుకతమున దానినామ
మభ్రభారతి దమయంతి యనుచు నొడివెఁ,
దద్గుణంబులు వర్ణింప ధరణినాథ!
యబ్జసూతికినైన శక్యంబుగాదు,
పలుకుఁబూఁబోఁడికైనను నలవిగాదు."

(శృం. నై. 2-9)

సముద్రమథన వృత్తాంతమున మాయామోహిని సురాసురులకు అమృతము పంచు సందర్భమున కూడ శ్రీనాథుడు తర్వాతి కథనంతను సంగ్రహముగా ఒక సీసపద్యములో నిట్లు రచించినాడు—

"వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి
కైకొనె నిజమూర్తి కైటభారి,
హరి తమ్ము వంచించె సరివేళ గా దని
దైత్యులు చనిరి పాతాళమునకు,
నమృతంబు భుజియించి యమృతకుంభముఁ గొంచుఁ
జనిరి వేల్పులు నిజస్థానమునకు,
బహువారములయందు బహువస్తువులు గాంచి
కలశపాదోరాశి కాను పుడిగె,
నుక్కివడి యున్కిమాని పెల్లుబ్బె నాక
మప్సరఃకామినీతురంగాదికముల,
నచ్యుతుఁడు లచ్చి నటఁ బెండ్లియాడి యరిగె
నాగరిపు నెక్కి వైకుంఠనగరమునకు."

(హర. 6-132)

శ్రీనాథునివంటి మహామనీషి శృంగారి యనియు, స్త్రీలోలు డనియు వాదప్రతివాదములును, ప్రచారమును జరిగినవి. శ్రీనాథుడు తన కావ్యములలో స్త్రీవర్ణనమును, శృంగారవర్ణనమును మితిమీరి చేసియుండుటయు, అతనిపేర లోకమున బహుళ ప్రచారములో నున్న చాటువులును, అతనిని శృంగార మూర్తిగా, విలాసపురుషునిగా నిరూపించునట్లు తోచును. శ్రీనాథునకు లభించిన రాజపోషణ, అవకాశానుభవములు, అతడు రసమయ జీవనమును సాగించుటకు తోడ్పడియుండును.

అతనికి స్త్రీవర్ణనయందు ఆసక్తి అధికము. దేవర్షియగు నారదుడు యాత్రాసందర్భమున వింధ్యాద్రిని సమీపించును. ఆజన్మబ్రహ్మచర్యదీక్షాపర తంత్రుడు, వీణాగానవినోదియు నగు నారదుడు ఏకాంతయు లేక, ఏకాంత

ముగా నుండుటకు శ్రీనాథుని అంతరాత్మ అంగీకరింపలేదు కాబోలును, గాంధర్వ మభ్యసించు ఒక తనుమధ్యను నారదున కిట్లు జతచేసినాడు—

"త్రసరేణుపరిమాణధాతుధూళీపాళి
యలకంబులకు వింత చెలువ మొసఁగ,
ఘనమైన రారాపుచనుదోయిరాయిడి
నిఱుపేదనడిమికి వెఱపు చూపఁ,
బొలుపాఱు మెఱుఁగుఁదీఁగెలఁబోలు కన్నులు
వడదాఁకి యొక్కింత వాడుఁబాఱ,
సింధూరతిలకంబు చెమటచిత్తడిఁ దాఁకి
యలకభాగంబునం దసలుకొనఁగఁ,
గనకమేఖల జఘనచక్రమున జాఱ,
నీవిబంధంబు నాభిపై నెమ్మివదల,
మహతి ధరియించి యొక తనుమధ్య తన్ను
ననుసరించుచు గాంధర్వ మభ్యసింప."

(కాశీ. 1-90)

శ్రీనాథుని శృంగారాత్మక ప్రకృతి, విరాగియగు శివుని రూపమును, కట్టుబొట్టును కూడ మార్చివేసినది.

"గజచర్మ మెన్నఁడోకాని నిచ్చలు గట్టు
పసిఁడికమ్మల పట్టుపచ్చడమ్ము,
భసిత మెన్నఁడొకాని ప్రతిదినమ్ము నలందు
మలయజమ్ము కురంగమదము గూర్చి,

నిడుదపాములరాజుతొడవు లెన్నఁడొకాని
  తారహారములు నిత్యము ధరించు,
నృకరుండరుండమాలిక లెన్నఁడోకాని
  ధరియించు కల్హారదామ మెపుడు,
కాటినడుచక్కి నెన్నఁడోకాని - యుండు
దక్షవాటి సువర్ణసౌధముల మీఁద,
నెన్నఁడొ పిశాచులనుగాని, యిందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు."

(భీమ. 1-116)

శ్రీనాథుని పాలబడిన భీమేశ్వరుడు గజచర్మమును వదలి, పట్టు వస్త్రమును కట్టినాడు;బూదిని కడిగి, గంధమును, కస్తూరిని అలదినాడు; సర్పహారములను విడచి, తారహారములను, రుండమాలికలను పారవైచి, కల్హారమాలను ధరించినాడు; శ్మశానమును, పిశాచులను వీడి, దక్షవాటికా సువర్ణసౌధముల మీద ఇందుముఖులతో విహరించుచుండును.

ఈ ప్రకృతి ఆతని కావ్యములందుకంటె చాటువులలో ఎక్కువగా గోచరించును. శ్రీనాథుని పేర శృంగారమయములగు పద్యము లెన్నియో ప్రచారమున నున్నవి. కావ్యరచనలో కవికిగల పరిమితులు, మర్యాదలు చాటువులలో నుండవు; అనవసరములు నగును. సందర్భానుసారముగా కవి చెప్పిన ఆశు పద్యములు, కవి మనస్తత్త్వమును, ప్రవృత్తిని కొంతవరకు ప్రతిబింబింప జేయును. సింహాద్రి తిరునాళ్ళలో తన కన్నుల యెదుట మెరసిన భోగగుణ ధామయగు ఆంధ్రనియోగిభామను, వేపారిమచ్చెకంటిని, అగసాలివన్నె లాడిని, సాతానివెలదిని, ఒడ్డెకులవధూటిని తనివిదీర వర్ణించెను. ఒక్క ఎల నాగను, భోగముదానిని చేయక, దాసరిదానిని చేసిన విధాతను తూలనాడినాడు.

బలుగబ్బిమిటారి చూపుల కాపుదానికి బెబ్బులి నంటగట్టిన పయోజగర్భుని అన లేక, మగనాలికి ఇంత విలాస మేటి కని ఈసడించుకొనెను. రోటిలో పిండి రుబ్బు మోహనాంగిబాహుకుశలతను చూచి, నేత్రోత్సవముగా వర్ణించినాడు.

శ్రీనాధుడు రసికశేఖరుడు; అనుభవపరాయణుడు. రాజాశ్రయమున కోరిన కోర్కెలెల్ల తీర్చుకొని, నిత్యకల్యాణము పచ్చతోరణముగా జీవిత మును గడపెను. ఆతని గ్రంధములలో కాననగు కపురపుటోగిరములు, పిండి వంటలు, ఆజ్యధారలు, పుండ్రేక్షుఖండములు, కమ్మని తావుల నీను రుచ్యము లగు పదార్ధములు, దధిక్షీరసమృద్ధి, కస్తూరికాది సుగంధ ద్రవ్యములును శ్రీనాధుడు నిత్యమును అనుభవించి తెలియజెప్పినవే. రాజభోజనముల నార గించిన భాగ్యశాలి శ్రీనాథుడు, అరటియాకు ఎట్లుండవలెనో కూడ నిర్దే శించినాడు—

"మొగి విరిసి, కఱకుగూడక,
పగులక, వెడలుపును, నిడుపుఁ, బసిమియుఁ గల లేఁ
జిగురరఁటాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్."

(భీమ. 2-128)

ఇట్టి శ్రీనాథుని అంగనాప్రియత్వమునకు, భోజనప్రియత్వమునకు పల నాటిసీమ పర్యటన ఎదురుచుక్కగా నిలచినది. పలనాడు జొన్నలకు ప్రసిద్ధ మైనది. 'సన్నన్నము సున్న సుమీ పన్నుగ పలనాటి సీమ ప్రజలందరకున్' అని వాపోయినాడు. ఆ జొన్నన్నము, జొన్నంబలి, జొన్నకలి విశ్వాస్త వడ్డింపగా, తినవలసి వచ్చినందుకు దుఃఖించినాడు.

"చిన్న చిన్న రాళ్ళు చిల్లరదేవళ్లు
నాగులేటినీళ్లు నాపరాళ్లు
సజ్జజొన్నకూళ్ళు సర్పంబులును తేళ్లు
పల్లెనాటిసీమ పల్లెటూళ్ళు."

అని పలనాటిపల్లెలను వర్ణించినాడు. పలనాటికి పోయిన అప్సరఃకాంతయైనను ఏకులు వడకవలసినదే; వసుధేశుడైనను భూమి దున్నవలసినదే; కుసుమాస్త్రుడైనను జొన్నకూడే మ్రింగవలయు నని బాధపడెను. కుసుమాస్త్రుని పోలి, రంభవంటి భామల పొంది, వసుధేశుని జీవితమును గడపిన శ్రీనాథునకు ఆ సీమలో ఎదురైన కష్టము లనూహ్యములు. 'అంగడి యూర లేదు; వరి యన్నము, శుచిత్వమును లేవు, నీటికై భంగపడగ పాల్పడు కృపాపరులు; దాతలు సున్న. కాన ఇట్టి పలనాటికి మాటికి బోవనేటికిన్' అని నిశ్చయించుకొనెను. ఆ సీమలోని నీటికొరతను చూచిన ఈ కవికి, గంగను నెత్తి కెక్కించుకొనిన స్వామి మనసున మెదలియుండును.

"సిరిగలవానికిఁ జెల్లును
తరుణులఁ బదియారువేలఁ దగఁ బెండ్లాడన్,
దిరిపమున కిద్ద రాండ్రా?
పరమేశా! గంగ విడుము, పార్వతి చాలున్."

అని శివుని చమత్కారముగా అధిక్షేపించెను. ఎదుట నున్న జొన్నముద్దలను మ్రింగలేని కష్టసమయమున ఆ సిరిగలవానినే, 'అలనాడు పూతనా స్తనవిషము గ్రోలితి నని గర్వించుచుంటివేమో, ఈ జొన్నముద్ద నొకదానిని మ్రింగిన నీపస వెల్లడియగు' నని ఎకసక్కెము లాడినాడు.

కాని శ్రీనాధుని పలనాటిసీమ పర్యటనము ఆంధ్రసాహిత్యమునకు అపూర్వమగు బహూకృతి నొసగినది. శ్రీనాధునకు చెన్నకేశవుడు స్వప్నమున సాక్షాత్కరించి, పలనాటి వీరుల గాధను కావ్యముగా కీర్తించి, తన కంకిత మిమ్మని కోరెనట. ఈ గ్రంధమంతయు శ్రీనాధకృతము కాదనియు, కల్లు ప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము అనునవి మాత్రమే శ్రీనాధవిరచితములనియు ప్రధ కలదు. జ్ఞాతులమధ్య సంభవించిన దాయవిభాగసంబంధియగు యుద్ధమును వర్ణించు ఈ గ్రంధమునకును, మహాభారతమునకును పోలికలు కలవు. కావుననే దీనికి పలనాటి భారత మను ప్రశస్తి కూడ ఏర్పడినది. ఇందలి బ్రహ్మనాయకుడు శ్రీకృష్ణుని వంటివాడు. బాలచంద్రుడు వీరాభిమన్యుడే. మాంచాల ఉత్తర ప్రతిరూపము. పల్నాటి వీరచరిత్ర వీరగాధావాఙ్మయ మునకు చెందిన ఉత్తమ గ్రంధము, మంజరీద్విపదలో నడచిన మనోజ్ఞ కావ్యము. ఇది పామరజనరంజకమై, బుర్రకథల రూపమునను, జానపద గీతముల రూపమునను జనబాహుళ్యమున ప్రచారము నందియున్నది. పలనాటి వీరచరిత్ర శ్రీనాధునిచేత బడుట, ఆంధ్ర జానపదసాహిత్యము, ద్విపదవాఙ్మ యము చేసికొనిన అదృష్టము. పలనాటి వీరకథ శ్రీనాధుని ఆంధ్రజాతీయతాభి మానమునకు చిహ్నము.

తన భాషను 'పలుకునుడికారమున నాంధ్రభాష యంద్రు' అని ఇతడే ప్రశంసించుకొనెను. తెలుగువారికి, వారి వ్యవహారమునకు సహజములగు జాతీయములను, లోకోక్తులను వాడుటచేతనే నుడికారము సొంపెసలారినది. నైషధములోని బువ్వపుబంతివర్ణనము, శివరాత్రి మాహాత్మ్యమునందలి సుకు మార-చండాలాంగనాసంవాదము, భీమఖండమందలి అమూలములగు పిఠా పురవర్ణనము, దక్షారామాప్సరోవర్ణనము, కాశీఖండమందలి గుణనిధి-ఉపాఖ్యానములోని వైదిక బ్రాహ్మణ కుటుంబములలో ప్రత్యేకముగా నిలచిన సంభాషణా విధానము, హరవిలాసమునందలి సముద్రమథనమునకు పూర్వ

రంగముగా సురాసురులు కావించు విష్ణ్వీశ్వరపూజయు శ్రీనాథుని దేశీయతను చాటుచున్నవి.

శ్రీనాథుని కావ్యములవలన మనకు తెలియనగు విశేషములు ఆనాటి సాంఘిక మతాది పరిస్థితులు. శ్రీనాథకృతముగా అంగీకరింపబడిన క్రీడాభిరామమున ఆనాటి జనజీవనవిధానము, విశ్వాసములు, సంఘమర్యాదలును విపులముగా వర్ణింపబడియున్నవి. దీని ఆశ్వాసాంతగద్యలో 'సుకవిజనవిధేయ వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామం బను వీథీనాటకంబు నేకాశ్వాసము' అని కలదు. కాని ఇందు శ్రీనాథుని కవితాశైలి, లక్షణములు మిక్కుటముగా గోచరించుచుండుటచే, ఇది శ్రీనాథవిరచితమై, వల్లభరాయని పేర ప్రకటింపబడియుండు నని విమర్శకులు నిర్ణయించిరి. అవతారికాభాగమున, రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామ'మను సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణముగా ఈ క్రీడాభిరామము రచింపబడినట్లు చెప్పబడినది. ఇద్దరు మిత్రులు ఒకనాటి వేకువజామున ఏకశిలానగరమును ప్రవేశించి, ఆ పట్టణములోని వింతలను చూచుచు వినోదించిరి. వారు దర్శించిన విశేషములను వర్ణించుటలో ఆనాటి సాంఘికాచార వ్యవహారములు, దేవతలు, ఉత్సవములు, వేశ్యవాటికలు మొదలగునవి ప్రసక్తములైనవి.

శ్రీనాథుడు పురాణకవులకును, ప్రబంధకవులకును నడుమ నున్నవాడు. కవిత్రయమువారు తమపేర ప్రత్యేకముగ సాహిత్య యుగములను సృష్టించి, స్థిరస్థానము నార్జించిరి. వారితర్వాత శ్రీనాథున కొక్కనికే అట్టి స్థానము లభించెను. శ్రీనాథుడును తనకాలమునాటి సాహిత్యమునకు ప్రతినిధియై, వివిధములగు సాహిత్య ప్రక్రియల చేబట్టి తర్వాతికవులకు మార్గదర్శకుడయ్యెను. ఈతని మాహాత్మ్య గ్రంథముల తర్వాత, మాఘమాహాత్మ్య-పాండురంగ మాహాత్మ్యాది కావ్యములు వెలసినవి. శ్రీనాథుని గుణనిధికథ, సుకుమారునికథయు, రామకృష్ణుని నిగమశర్మ కథకు ఒరవడియైనవి.

ఇతడు కొండవీడు - రాజమహేంద్రవరము - విజయనగర సంస్థానములలో సంచరించుచు, వాదోపవాదములు చేయుచు, కవిత్వవిజయోత్సాహములను గైకొనుచు, విజయధ్వజములను స్థాపించెను. రెడ్డిరాజుల మెప్పించి కావ్యముల నంకితమొసగి, మహాగౌరవములను పొందెను. సాంపరాయని పుత్రుడగు తెలుగు రాయనికడ కస్తూరికాదానమును గ్రహించెను. విజయ నగరమున ఉద్భట వివాదప్రౌఢిని గౌడ డిండిమభట్టు నోడించి, ఆతని కంచు ఢక్కను పగులగొట్టించెను. ప్రౌఢరాయల ప్రశంసకు పాత్రుడై, దక్షిణాధీశు ముత్యాలశాలలో దీనారటంకాల తీర్థమాడినాడు. కొండవీటిరాజ్యమున విద్యాధికారిగా నుండి, దానశాసనములను వ్రాయుచు, సరస సాహిత్యగోష్ఠి ప్రసంగములను జరుపుచు, కవి పండితుల యోగ్యతలను పరిశీలించి సన్మానములు చేయించుచు, రాజ్యమందలి విద్యావిషయము లన్నింటికి ప్రభుత్వము వహించెను. వేమభూపాలునకు అఖిలపురాణ విద్యాగమములను వినిపించినాడు. విద్యాపరీక్షణవేళలందు బహుదేశబుధులతో భాషించినాడు. విశదకీర్తి స్ఫూర్తి కర్పూరములను దిశాంగణములందు వెదజల్లినాడు.

కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగా రన్నట్లు-"బహుదేశములు తిరిగి, బహుశాస్త్రముల నెరిగి, రసవత్కవిత రచించి, రాజాధిరాజుల పూజలు గొని, విద్వద్ఘోష్ఠులం దారితేరి, విద్యావివాదములందు విజయము లంది, భువన భరిత కీర్తియై, పూర్ణపురుషాయుషజీవియై, దివిజకవివరుగుండియలు దిగ్గురనగ, స్వర్లోకప్రస్థానమును సల్పిన మన కవిసార్వభౌముని వంటివాడు ఆంధ్ర కవులం దింకొకడు అగపడడు."

# అల్లసాని పెద్దన

పెద్దనపేరు వినినంతనే ఆంధ్రభోజుడును, సరసకవితాగోష్ఠివినోదియు నగు కృష్ణదేవరాయలపేరు స్ఫురణకు వచ్చును. ఇతనివలె ఆంధ్రకవులను పోషించి, కవితామృతమును తరువాతి తరములవారికి తరుగకుండ నందించిన ధన్యజీవి మరియొకడు లేడు. రాయలు అసదృశపరాక్రమోపేతుడై మహాసామ్రాజ్యమును ప్రతిష్ఠాపించి, ప్రజలను సుఖశాంతులతో తులదూగజేసెను. అద్వితీయ ప్రతిభాశాలియై, బహుగ్రంథకర్తయై, కవికుల పోషకుడై, ఉత్తమ ప్రబంధ నిర్మాణమునకు ప్రోదిచేసిన రసిక శేఖరుడు ఈ కవిరాజు. సాహితీ సమరాంగణ చక్రవర్తియగు ఈ మహారాజు భువనవిజయ సభాప్రాంగణము నలంకరించిన కవులలో అగ్రాసనము పెద్దనదే. కావుననే, కృష్ణదేవరాయలచే గండపెండెరమును తొడిగించుకొని, అనన్య సామాన్య గౌరవమును సముపార్జించుకొనిన భాగ్యశాలి పెద్దన.

నన్నయలోని ప్రసన్నకథాకలితార్థయుక్తిని, తిక్కనలోని పాత్రచిత్రణ తత్త్వమును, ఎఱ్ఱనలోని ఔచితీ పరిపాలనమును, నాచనసోమునిలోని నవీన గుణములను, శ్రీనాథునిలోని శయ్యాసౌభాగ్యమును స్వీకరించి, వానికి తన వర్ణనా నైపుణ్యమును జోడించి, శిరీషకుసుమ పేశల సుధామయోక్తులతో, చతురవచోనిధి పెద్దన కవిత్వ మల్లెను. కావుననే బహుభాషాపండితు లుండు కృష్ణదేవరాయల సభలో ఈతనికే పెద్దరిక మబ్బినది. పెద్దనకృతులలో 'మనుచరిత్ర' యొక్కటే మనకు లభ్యమైనది.

కృష్ణదేవరాయల కాలమున వెలువడిన ప్రబంధములలో మనుచరిత్ర మగ్రగణ్యము. ఆంధ్రసారస్వతమున ప్రబంధముల కున్నంత వైశిష్ట్య మితర కావ్యప్రక్రియలకు లేదు. నన్నయ యుగము మొదలు పెద్దనకాలమువరకు

తెలుగు కావ్యము లనేకములు వెలసినవి. కాని,వానిలో నేదియు ప్రబంధస్థాయి నందుకొనలేదు. నన్నెచోడుని - కుమారసంభవమునను, ఎఱ్ఱన - నృసింహ పురాణమునను, ప్రబంధ లక్షణములు పెక్కులు గోచరించును. కాని, ఆ కావ్యములందు పురాణవైఖరి ప్రాధాన్యము వహించుటచేత వానికి సంపూర్ణ ప్రబంధస్వరూప మేర్పడలేదు. సర్వప్రబంధలక్షణ సముపేతముగ వెలసిన తొలి కావ్యము మనుచరిత్రము. భారతాదికావ్యములలో కథాకథనము ప్రముఖ స్థాన మందగా, మనుచరిత్రాది ప్రబంధములలో కల్పనాచమత్కృతి, పాండితీ పటిమ, వర్ణనావైదగ్ధ్యము, ఆలంకారికశైలి మున్నగునవి ప్రచురములైనవి.

తెలుగు విమర్శకులు ప్రబంధశబ్దమును ప్రాచీనార్థమున గాక, ఒక విశిష్టార్థమున వాడుచున్నారు. సంస్కృతాలంకారికుడు విశ్వనాథుడు మహాభారతమును, రామాయణమును, మాలతీమాధవాది నాటకములను, తన అలంకార గ్రంథమగు సాహిత్య దర్పణమును ప్రబంధము లనియే పేర్కొనెను. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రములో భాస- సౌమిల్లకాదుల నాటకములను ప్రబంధము లనియే వ్యవహరించెను. భోజుడు దృశ్య-శ్రవ్య భేదముతో ప్రబంధము నిరు తెరగులుగా విభజించెను. ఇట్లు ముక్తకములు గాక తక్కిన సంస్కృత సారస్వత ప్రక్రియలకు చెందిన గ్రంధము లన్నియు ప్రబంధములుగానే పరిగణింపబడినవి.

తిక్కన, కేతన,ఎఱ్ఱన, సోమన, శ్రీనాథుడు మొదలగు తెలుగుకవులు తమ గ్రంథముల నన్నింటిని ప్రబంధము లనియే పేర్కొనిరి. తిక్కన తన భారతమును ప్రబంధమండలి యని చెప్పికొనెను. ఒక్కొక్క పర్వ మొక ప్రబంధముకాగా, భారతము ప్రబంధమండలి యైనది. నన్నయ కాలము మొదలు, శ్రీనాథుని కాలమువరకు వెలువడిన గ్రంథములలో పూర్వ పూర్వ కావ్యములలోకంటె, ఉత్తరోత్తర కావ్యములలో వైలక్షణ్యము స్ఫుటముగా

భాసించుచున్నది. అయినను, ఈ కవులందరును తమ కావ్యములను ప్రబంధము లనియే చెప్పికొనియున్నారు. వీ రా శబ్దమును సంస్కృత కవులు వాడినట్లే ఇంచుమించు ఉత్తమ కావ్య పర్యాయముగ వాడియున్నారు.

ఆంధ్రలాక్షణికులు మాత్రము ప్రబంధమున కొక ప్రత్యేకలక్షణమును కల్పించి, ఆ శబ్దము నొక విశిష్టార్థమున వాడుచున్నారు. సంస్కృతాలంకారికులు సర్గబంధరూప మగు మహాకావ్యమునకు చెప్పిన లక్షణమునే, వారు తెలుగు ప్రబంధమునకు లక్షణముగా పేర్కొనిరి.

ప్రబంధ మనగా ప్రకృష్టమైన బంధము కలది. అనగా పూర్వాపర విషయములకును, పద్యగద్యములకును సుశ్లిష్టమైన సంబంధము కలిగి యుండుట. ఈ యర్థమున ఈ పదము వాఙ్మయమందలి సర్వగ్రంథముల కును అన్వయించును. కాని, విపులార్థవాచియగు ఈ పదము పెద్దన కాలము నుండి ఒక పరిమితార్థమున రూఢమైనది. యోగాత్ రూఢిః బలీయసీ. కాన, నేటికాలమున ప్రబంధ మనగా తెలుగువారికి నూతనార్థమే స్ఫురించును.

అధునికాంధ్ర విమర్శకులు తెలుగు ప్రబంధముల నన్నింటిని పరిశీ లించి, దానిలక్షణము నిట్లు నిర్దేశించిరి. ప్రబంధమున వస్త్వైక్యము, అష్టాదశ వర్ణనములు నుండవలెను; ధీరోదాత్తాదులలో నొకడు నాయకుడై యుండును; ప్రధానరసము శృంగారము, తక్కిన రసములు యథాసంభవముగా అంగము లగును; శైలి ఆలంకారిక మైనది; రచన కేవలము భాషాంతరీకరణము గాక స్వతంత్రమైనదిగా నుండవలెను. ఇవి ఆంధ్ర ప్రబంధములకు సామాన్య లక్షణములు. ఈ లక్షణములు గల తొలి ప్రబంధము మనుచరిత్రము. కావు నసే, పెద్దనయుగమును ప్రబంధయుగముగా పరిగణింతురు. ప్రబంధ లక్షణ ములు నన్నయ నాటినుండియు క్రమ వికాసము నొందుచు, పెద్దన నాటికి

పూర్ణస్వరూపమును సంతరించుకొనినవేకాని, హఠాత్తుగా ఆవిర్భవించినవి కావు.

నన్నయ భారతములో ఈ ప్రబంధచ్ఛాయలు గల ఘట్టము లనేకము లున్నవి. తిక్కన భారతము ప్రతిపర్వరసోపేతము. ఇందలి పాత్ర పోషణము ప్రబంధ పద్ధతిలోనే నడచినది. ప్రబంధ పరమేశ్వరుడు ఎఱ్ఱన - హరివంశమునను, నృసింహపురాణమునను ఈ ప్రబంధరీతి మరింత విస్పష్టముగా నున్నది. కావ్య బాహ్య స్వరూపమునకు సౌందర్యము నాపాదించు వానిలో ప్రధానమైనదగు వక్రోక్తి చమత్కారమును తన ఉత్తర హరివంశములో బహువిధములుగా ప్రదర్శించి, నాచన సోముడు సలక్షణ ప్రబంధావిర్భావమునకు మార్గము నేర్పరచెను. రసపోషణము, అంగప్రత్యంగ వర్ణనము, పాత్రచిత్రణము, ఆలంకారికశైలి, సమతాగుణప్రధాన మగు సీస పద్యనిర్మాణ మను నంశములలో శ్రీనాథుడు సరిక్రొత్త త్రోవల చరించి, ప్రబంధ కవులకు మార్గదర్శకు డయ్యెను. పెద్దన మనుచరిత్రము సర్వ లక్షణ లక్షితమగు తొలి మహాప్రబంధమై, తరువాతి ప్రబంధములకు ఆదర్శప్రాయమై ఒప్పారుచున్నది.

మనుచరిత్రమున కా పేరు లోకమున ప్రసిద్ధమైయున్నను, పెద్దన పెట్టిన పేరు 'స్వారోచిష మనుసంభవ' మనియే. శ్రీకృష్ణదేవరాయలు "మనువులలో స్వారోచిషమనుసంభవ మరయ రస సముంచిత కథలన్ వినవింపు, కలిధ్వంసకము; భవచ్చతుర రచన కనుకూలంబున్; కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునన్ జెప్పుము" అని, కర్పూర తాంబూలము నిచ్చి పెద్దనను ప్రార్థించెను. అతడును 'మోదంబున నమ్మహాప్రబంధ నిబంధనంబు'నకు ప్రారంభించెను. ప్రత్యాశ్వాసాంతమునను తన గ్రంథమును స్వారోచిషమనుసంభవ మనియే పేర్కొనెను. ఈ ప్రబంధము

స్వారోచిషమనుసంభవ మనియు, మనుసంభవ మనియు, మనుసంభవచరిత్ర మనియు, మనుచరిత్ర మనియు అనేకవిధములుగా వ్యవహరింపబడియుండును. గ్రంథప్రాశస్త్యమును బట్టియు, గ్రంథకర్త గొప్పదనమును బట్టియు కవి జీవిత కాలముననే ఈ ప్రబంధమునకు గొప్ప ప్రతిష్ఠ ఏర్పడి, జనులు తరచుగా దానిని పేర్కొనుట సంభవించియుండును. ఈ పేర్కొనుటలో 'మనుచరిత్ర' మను పేరు లలితముగను, సంగ్రహముగను నుండుటచే ఎక్కువ ప్రచారమునకు వచ్చి, క్రమముగా జనులవాడుకలో నదియే నిలిచి యుండును. అందుననే పెద్దనయు రాయల నిర్యాణానంతరము చెప్పిన చాటువులో ఈ గ్రంథమును 'మనుచరిత్ర' మనియే చెప్పియున్నాడు—

"మనుచరిత్రం బందుకొనువేళ పురమేగఁ
బల్లకి తన కేలఁ బట్టి యెత్తె."

ఇట్లు జనప్రచారమున మనుచరిత్ర మను పేరు రూఢమైయున్నను గ్రంథకర్త పెట్టిన పేరు స్వారోచిష మనుసంభవ మనియే.

ప్రబంధ లక్షణములలో వస్త్వైక్యము ముఖ్యమైనది. వస్తువు ఏకమైయున్ననే, కావ్యము అఖండ సుందరమూర్తిగా భాసించి, పాఠకులకు ఆనందమును కూర్చును. కాళహస్తి మాహాత్మ్యము, పాండురంగ మాహాత్మ్యము మున్నగు కొన్ని ప్రబంధములలో నీ వస్త్వైక్యము కానరాదు. అయినను, తక్కిన ప్రబంధలక్షణము లన్నియు నుండుటవలన నవి ప్రబంధములుగనే పరిగణింపబడుచున్నవి.

మనుచరిత్రమున వస్త్వైక్యము లేనట్లు స్థూల దృష్టికి గోచరించును. వరూథినీ-ప్రవరుల వృత్తాంతము, స్వరోచివృత్తాంతము, స్వారోచిషుని

వృత్తాంతము అను నీ వృత్తాంతత్రయసమ్మేళనమే గద మనుచరిత్రమందలి కథావస్తువు?

నిశితముగా పరిశీలించినచో నిందు వస్త్వైక్య మున్నదని భాసించును. చూడుడు. స్వారోచిషమనుసంభవ మను గ్రంథనామమును బట్టి ఇందు స్వారోచిషుని జన్మవృత్తాంతము వరకే కథ యుండగల దని విదితమగును. పెద్దన, స్వారోచిషుని వృత్తాంతమును గ్రంథాంతమున ఇరువదియయిదు పద్యములలో సంగ్రహించెను. కాన నీ గ్రంథమున స్వారోచిషుని జన్మకు కారణభూతుడగు స్వరోచి వృత్తాంతమే ప్రధానమైన దని స్పష్టమగుచున్నది.

ధర్మప్రతిష్ఠాపకుడగు స్వారోచిష మనువునందు ధర్మవీరోత్సాహము సంపూర్ణముగా వెలసిననే, అతడు మనువుగా నుండుట కర్హుడగును. ఈ ఉత్సాహగుణ మాతనికి తండ్రియగు స్వరోచివలన సంక్రమించినది. స్వరోచికా ఉత్సాహము అతని తల్లియగు వరూధినివలన కలిగినది - అను విషయమును తెల్పుటకై వరూధినీప్రవరుల వృత్తాంత మావశ్యకమైనది.

గర్భధారణ వేళయందు స్త్రీ మనస్సు ఏ ప్రాణియందు లీనమై యుండునో, తత్సదృశమగు గర్భమునే ధరించును. ‘‘గర్భోత్పత్తౌ తు మనః స్త్రియః యం జంతుం వ్రజేత్, తత్సదృశం ప్రసూతే” అను చరకసిద్ధాంతానుసారముగా, సమిద్ధ శిఖిదీప్తియు, ధర్మైకపరాయణుడును నగు ప్రవరుని రూపమే వరూధిని హృదయము నాక్రమించుకొని యుండుటచేతనే తత్సంతానమగు స్వరోచియందు ధర్మవీరోత్సాహము పొడసూపినది.

ప్రథమమున స్వరోచి శృంగారప్రియుడే యైనను, తన తండ్రియగు కలిగంధర్వునివలె అధర్మశృంగారమున కాత డెన్నడు నిచ్చగింపలేదు. కామపురుషార్థము నాత డెక్కువగా సంభావించుట, పితృగుణ సంక్రాంతివలన

నేర్పడినది. అది ధర్మబద్ధమే యైనను, స్థిరముగా నిలువక పోవుటచేత, మోక్షపురుషార్థమునే ఉత్తమోత్తమముగా గుర్తించి, అతడు వానప్రస్థుడాయెను.

సర్వోచియందు తండ్రివలన సంక్రమించిన గుణములు దుర్బలములే యై, తల్లివలన సంక్రమించిన గుణములు బలిష్ఠము లాయెను. దానిని నిరూపించుటకు ప్రవరవృత్తాంత విస్తృతియు అవసరమైనది.

ఇట్లు ఆభిజాత్య నిరూపణమునకై ప్రవరవృత్తాంతము విపులముగా వర్ణింపబడినను, ప్రాధానకథ కది అంగమేయై, తద్రస పోషణమున కుపకరించునదై, అప్రధానమే యయ్యెను. ప్రధానేతివృత్తము స్వరోచివృత్తాంతమే; నాయకుడు స్వరోచియే. కావున వస్త్వైక్యము లేదనుట ఉచితము కాదు.

శృంగారమునకు లొంగుట ప్రాణిసామాన్య ధర్మము. గంధర్వాంగన శృంగారమునకు పరవశించిన పాఠకులు తేరుకొని, దాని కుండు ఆనుషంగికత్వమును గురుతించుటకు, కొంత మనస్సంయమము కావలయును. ఆ సంయమమును అలవరచుకొన్న చదువరులు, వరూధినికథ, వైపుల్యమును బట్టి స్వతంత్రమైనట్లే భాసించినను, అది ప్రాసంగికమైన దని విశ్వసింతురనుట నిశ్చయము.

పెద్దన మనుచరిత్రమును మార్కండేయ పురాణోక్త ప్రకారంబుననే నిర్మింపదలచెను. వ్యాసపురాణమును కాక, మారన ఆంధ్రీకరణమునే ఈతడనుసరించెను, స్వారోచిష మనుసంభవమువరకే చెప్పు మని కృష్ణదేవ రాయలు కోరుటవలన, అతని పట్టాభిషేకమువరకే ఇందు వర్ణింపబడినది. మన్వంతరమున చెప్పబడిన దేవతలు, సప్తర్షులు, రాజులు, తద్వృత్తాంతములును ఇందు స్వీకరింపబడలేదు.

సంస్కృతమున "కశ్చి ద్ద్విజాతిప్రవరః" (ఒకానొక బ్రాహ్మణ శ్రేష్ఠుడు) అనియే, అరుణాస్పదపురవాసి యగు వరూధినీపూర్వవృత్తాంత నాయకుడు పేర్కొనబడియుండగా, మారన, ఆతడు ప్రవరాఖ్యు డనెను; పెద్దన మారననే అనుసరించెను.

ప్రవరునింటికి వచ్చిన అతిథి మంత్రౌషధముల నెరిగిన ఒకానొక బ్రాహ్మణు డని మూలమున నుండ, మారన అతనిని ఔషధసిద్ధు డనెను. పెద్దన దీని ననుసరించి, వానిరూపమును యోగ్యతానుగుణముగా, రమ్యమగు రీతిని వర్ణించెను. ఈ అతిథి కుతప కాలమున ప్రవరునింటికి వచ్చె నని పెద్దన అనెను.

ఈ కుతప కాల ప్రసక్తి మూలానువాదములలో లేదు. సిద్ధుడు ఆతిధ్య స్వీకరణానంతరము ప్రవరునిపాదములకు ఓషధీలేపమును పూయగా నాతడు హిమగిరి కరిగి, కొంత తడవు ఆ యా సుందరదృశ్యములను తిలకించుచు విహరించి, సూర్యుడు నడిమింటికి వచ్చుచుండుటను గుర్తించె నని మను చరిత్రములో నున్నది. ఇది సంగతముగా లేదని కొందరు విమర్శకుల ఊహ. తీర్థయాత్రావిశేషములను ముచ్చటించుచు సిద్ధప్రవరు లా రేయెల్ల గడపిరి. మరునా డుదయము సిద్ధుడు ప్రవరునికి పాదలేపము పూసి నిజేచ్ఛ బోవగా,ప్రవ రుడును హిమగిరిసందర్శనాభిలాషియై అచటికి వెళ్ళె నను వృత్తాంతమును తెల్పు గ్రంథభాగ మేదో ఇచ్చట లుప్తమైయుండు నని కొందరి అభిప్రాయము. ఇదియే సమంజసముగా నున్నది.

వరూధిని మౌనేయ యని మూలమున నున్నది; మారన దీనిని విడ చెను; పెద్దనయు చెప్పలేదు. గంధర్వకులములు పదునాలుగు; వానిలో దక్ష ప్రజాపతికుమార్తెలగు ముని, అరిష్ట అను నిరువురకును కలిగిన సంతానము రెండు కులములుగా నేర్పడినవి. వరూధిని మునిసంతతికి చెందిన దని మూల

మున నున్నది. దీనివలన వరూధిని యాభిజాత్యము వ్యక్తమగుచున్నది. మారనయు, పెద్దనయు నీ విశేషము నేల గుర్తింపలేదో తెలియకున్నది.

వరూధిని ప్రవరునితో భాషించుచు—

"ఇహాసతో నైవ జరా కదాచి త్తే భవిష్యతి,
త్రిదశానా మియం భూమిః యౌవనోపచయప్రదా."

(ఇచట నీ వున్నచో నీకు వార్ధక్య మెన్నటికిని రాదు, ఈ హిమవత్పర్వత ప్రదేశము దేవభూమి; ఇది యౌవనమును వర్ధిల్లజేయును) అని చెప్పునట్లు మూలమున నున్నది. ఈ విషయమును మారన విడచెను. పెద్దన సాక్షాత్తుగా చెప్పలేదు కాని సూచించెను.

వరూధిని ప్రవరుని కౌగిలించుకొనినప్పుడు "మా మాం స్ప్రాక్షీః ప్రజాన్యత్ర దుష్టే! య స్సదృశ స్తవ" అని దుష్టురాలా! యని సంబోధించినట్లు మూలమున నున్నది. పరమశాంత స్వభావుడగు ప్రవరుని శీలమున కది మచ్చయగు నని భావించి మారన 'అంట కంటకు నన్ను మృగాక్షి' అని మృగాక్షి యనియే సంబోధించెను. పెద్దన ఔచిత్యానుగుణముగా చమత్కారమగు కల్పన చేసెను. వరూధిని కౌగిలించి, అధరం బాసింప, "హా శ్రీహరీ! యంచున్ బ్రాహ్మణు డోరమోమిడి, తదీయాంసద్వయంబంటి బొమ్మంచున్ ద్రోచె" నట. ఆమె నేమియు నిందింపలేదు. 'శ్రీహరీ! ఇట్టి క్లిష్ట సన్నివేశము నేల కల్పించితి' వని వాపోయెను. ఆమె భుజద్వయమును నిరాసక్తుడైయే తాకి బొమ్మని తొలగద్రోచెను. ఈ కల్పనము ఔచిత్యపోషణమున కెంతయు తగియున్నది. ఈ ఘట్టమున వరూధినీ-ప్రవరుల సంభాషణములు, హేతుహేత్వాభాస కల్పనములు, యుక్తి ప్రయుక్తులు నన్నియు పెద్దన

స్వకపోల కల్పితములే. పెద్దన ప్రతిభకు ఈ ఘట్టమే గీటురాయి. ఇందు శృంగార-ధర్మవీరములకు సంఘర్షణ మేర్పడినది, చివరకు ధర్మవీరమునకు విజయమును కల్పించి, పెద్దన కావ్యరసమును పోషించెను. ఈ ఘట్టము నింత రసవంతముగా పెద్దనగాక మరియొకి కవి నిర్వహింపనేరడు.

ప్రవరుడు వెడలిన పిదప, చింతాక్రాంతయగు వరూధినిని చూచి, కలి గంధర్వుడు—

"స చింతయామాస తదా కి న్వేషా గజగామినీ,
నిశ్వాసపవనమ్లానా గిరా వత్ర వరూథినీ,
మునిశాపక్షతా కిన్ను? కేనచి త్కిం విమానితా?
బాష్పవారిపరిక్లిన్న మియం ధత్తే యతో ముఖమ్."

(ఈ గజగామినియగు వరూధిని వేడి వేడి నిట్టూర్పులతో వాడిపోయి యున్నదే, ముఖమంతయు కన్నీటితో తడిసి, కాంతివిహీనమైయున్నదే? ఈ పర్వతమందలి ఏ మహర్షియైనను శపించెనా? లేక, ఎవ్వనినైనను వలచి, వానిచే తిరస్కృతయాయెనా?) అని చింతించినట్లు మూలమున గలదు. మారన దీని నాంధ్రీకరింపలేదు; పెద్దనయు విడచెను.

మనోరమ పరిహసింపగా వృద్ధముని శపించెనని మూలానువాదములలో నున్నది. మనుచరిత్రములోని మనోరమ, బాల్యచాపలమున 'ఈ మునిముఖ మెయ్యది? నేత్రద్వయ మెయ్యది? అని పరికించుచు నాతని ముఖమును తడ వెను. యోగభ్రష్టుడైన ముని ఆగ్రహించి,ఆమెను నాగబెత్తముతో,పసరమును బాదినట్లు బాది, శపించెను. ఈ క్రూరచేష్టితమునకు వగచిన సఖు లాతని దుర్భా

షలాడగా నాతడు వారినికూడ శపించె నని, పెద్దన ఔచిత్యపోషణమునకై మనోరమ విచేష్టితమునకును, మునియాగ్రహమునకును, సఖుల దుర్భాషలకును బలిష్ఠములగు హేతువులను కల్పించి, ఘట్టమును రసవంత మొనర్చెను.

తన సఖులకు రోగనివారణచేయు మని మనోరమ తన వివాహమునకు పూర్వమే ప్రార్థించినట్లు మూలానువాదములలో గలదు. పెద్దన ఈ విషయ మును పునస్సంధానవేళకు మార్చెను. ఇది ఔచిత్యపరిపోషణమునకై చేయ బడిన మార్పు. ఆపన్నయగు మనోరమ స్వరోచితో స్వేచ్ఛగా మాటలాడి నను, వివాహము నిశ్చయమైన పిదప వధూసహజమగు లజ్జ ఆమె నావ హించుట సహజము. పునస్సంధానవేళవరకు పతితో తా నేకాంతముగా మాట లాడు సందర్భ మామెకు చిక్కదు. అప్పటున ఆమె సఖీరోగనివారణమును కోరి, సాధించుకొనుట ఎంతయు ఉచితమే యగుచున్నది.

ఔచిత్యపోషణమునకును, ప్రబంధలక్షణసంపాదనమునకును పెద్దన, మారనకథలో అట నట చిన్న చిన్న మార్పులు, కూర్పులు చేసి, గ్రంథ రచన సాగించెను.

ప్రబంధములలో వర్ణనములు అతిప్రధానము లైనవి. కవి ప్రతిభా వైభవము, బుద్ధివైశారద్యము, పాండితీగరిమయు వర్ణనములలోనే ప్రస్ఫుట ముగ భాసింపగలవు. ఇతిహాసపురాణాదులలో న్యాయధర్మప్రతిపాదనము, ముక్తకాదులలో చమత్కారము, దృశ్యకావ్యములలో రసపరిపోషణము ప్రధానములైనట్లు, శ్రవ్యప్రబంధములలో వర్ణనములు ప్రధానము లైనవి. మహాకవులగు కాళిదాసాదులు తమ శ్రవ్యకావ్యములలో ఈ వర్ణనములను యథోచితముగ గావించుచు, కథాసూత్రమునకు విచ్ఛేద మేర్పడకుండునట్లు జాగరూకతతో నిర్వహించిరి.

ఆలంకారికులలో ఈ వర్ణనల విషయమున విభిన్నాభిప్రాయము లున్నవి. కావ్యాదర్శమున వర్ణనములు పదునెనిమిది యనియు, అప్పకవీయమున ఇరువదిరెం డనియు, సాహిత్యదర్పణమున ఇరువదినాలు గనియు, అలంకార శేఖరమున ముప్పదిరెం డనియు పేర్కొనబడినవి. వర్ణ్యవస్తువిషయముల కోను వారికి ఏకీభావము లేదు. పూర్వులు చెప్పినవానిలో కొన్నింటిని వదలి, క్రొత్తవానిని చేర్చుటయు జరిగెను. సారాంశ మేమన, వర్ణనములలో నివి యవి యని నిర్బంధము లేక, కథావస్తువు ననుసరించి, ఉచితములగు వర్ణనముల నెల్ల కథాగమనమునకు విరోధము లేకుండునట్లు కావించుటయే. ఈ విషయమును విద్యానాథుడు—

"నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్,
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః,
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్,
మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి,
ఏతాని యత్ర వర్ణ్యంతే త న్మహాకావ్య ముచ్యతే,
ఏషా మష్టాదశానాం ద్వైః కైశ్చి దూన మపీష్యతే."

(ప్రతాప. కావ్య. 68, 69, 70)

అని స్పష్టముగనే వాకొనియున్నాడు. కవులలో పెద్దనవంటివారు మాత్రమే ఉచితముగను, మితముగను వర్ణనలు చేసిరి.

పైని పేర్కొనిన అష్టాదశవర్ణనములలో మధుపానము తప్ప, తక్కిన వాని నన్నింటిని పెద్దన వర్ణించెను. సముద్ర, మంత్ర, ద్యూతములు సూచనా ప్రాయములుగా నున్నవి. ఇవి గాక, మృగయ, దౌహృదము, అంధకారము,

పుష్పాపచయము, అభిసారికలు, అరణ్యము మొదలగువానిని, మరి ఇరువదింటిని అధికముగ వర్ణించియున్నాడు. ఈ వర్ణనములలో నేదియు, అప్రసక్తమును, కృత్రిమమును కాదు. పెద్దన ప్రతిభ కిది యొక తార్కాణము.

నిర్జీవ మగు పదార్థమును సైతము సజీవముగా జేసి, వర్ణించుటలో ఈ కవి నేర్పు అసాధారణమైనది.

"కలశపాదోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి,
యనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నెవెట్టు ననార్తవంపుఁ బువ్వు,
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టుగానని మేనిమెట్టపంట,
కటికిచీఁకటితిండి కరముల గిలిగింత
నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁ జేయు,
నతఁడు పొగడొందు మధుకైటభారిమఱఁది,
కళలనెలవగువాఁడు, చుక్కలకు ఱేఁడు,
మిసిమిపరసీమ, వలరాజుమేనమామ,
వేవెలుంగులదొరజోడు, రేవెలుంగు."

(మను 1-18)

ఈ పద్యములో చంద్రుడు నిర్జీవమగు గోళముగా కాక, మహాకులీనత, ఔజ్జ్వల్యము, ఐశ్వర్యసంపన్నత, ఔదార్యము, రాసిక్యము, బాంధవప్రీతి,

అద్వితీయసౌందర్యము మొదలగు గుణములు గల మహానాయకుడుగా గోచ రించును.

"జరఠకచ్ఛపరాజు చరమాంగగృహమేధి,
భోగివేష్టనరేఖఁ బొలుచు జాలు,
కులములోఁ దరితీఁపు గలిగి మించిన మేటి,
మైనాకు నొరసిన మానటీఁడు,
తొలువేలుపులవేలుపుల పనుల్ గొను ఱేఁడు,
కడలిరాయల లోఁతు గన్న గబ్బి,
సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చు మరకాఁడు,
కల్పకంబుల పంట కమ్మతీఁడు,
గంటె మథితసుధాధౌతకటకజాత
చంపకవనప్రకంపనాకంపవిసర
దఖరముఖరవమధుకరముఖరశిఖర
నందరసమందిరం బగు మందరంబు."

(మను. 5-47)

ఇందలి మందరము కొండగా గాక గార్హస్థ్యము, ప్రాభవము, గాంభీర్యము, దాతృత్వము, ఆనందానుభూతియు గల ఒకానొక ఉదాత్తచరితుడుగా గోచ రించును.

మందరపర్వతమున నొకనాడు వర్షము కురిసెనట. ఆ వర్ష మిట్లు వర్ణింపబడినది —

"కరకాచిటపటరవటీ
కరమై, పెళపెళనినాదఘనమై, ఝంఝా
మరుదుజ్ఝితబిలమంద్ర
స్వరమై, యకొండ నొక్క వర్షము గురిసెన్."

(మను. 4-11)

ఆ వడగండ్ల వాన యెట్లుండునో పెద్దన ఈ పదముల వడగండ్ల వానతో నింపుగా సూచించెను,

వర్షము వెలిసినది; ప్రభాత మాయెను. అప్పుడు పర్వతోపరిభాగము ఇట్లుండునట —

"తెలతెల వేగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించు సెలలచప్పుళ్ళు శిఖా
వలకులకలకేకాకల
కలములు గల తలపొలంబుఁ గనుఁగొను వేడ్కన్."

(మను 4-12)

వర్ష మమితముగా కురిసి, సెలయేళ్ళు నిండుగా ప్రవహించుచున్నవి: వాని చప్పుళ్ళు మృదంగధ్వనులవలె తోపగలవు. ఇంకను మేఘాచ్ఛాదితముగనే ఆకస మున్నది, ఆ మేఘపరంపరను చూచి, నెమళ్ళు పరవసించి నాట్య మాడుచు, మధురముగా కూయుచున్నవి; అట్టిది ఆ కొండతలపొలంబు. దానిని చూడ స్వరోచికి వేడుక జనించినదట. ఈ పద్యముతో మనకును అట్టి వేడుకను పెద్దన కల్గించినాడు.

ప్రొద్దుగ్రుంకు సమయమున ప్రకృతి ఇట్లుండెనట —

"శ్రేణుల్ గట్టి నభో౽౦తరాళమునఁ బా
 ఠీనం బక్షు, లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె, మృగతృ
 ష్ణావార్ధు లింకెన్, జపా
శోణం బయ్యెఁ బతంగబింబము, దిశా
 స్తోమంబు శోభాదరి
ద్రాణం బయ్యె, సరోజషండములు ని
 ద్రాణంబు లయ్యెం గడున్."

(మను. 3-12)

మేతకై వెడలిన పక్షులు సాయంసమయమున గుంపులు గుంపులుగా నాకసమున నెగురుచు, తమ తమ గూండ్లు చేరబోవుట, సూర్యకాంతశిలలు గోరు వెచ్చ నగుట, ఎండమావులు అదృశ్యమగుట, సూర్యబింబ మెఱ్ఱవారుట, దిక్కులు కాంతిహీనము లగుట, తామరలు ముకుళించుటయు సాయంప్రకృతికి సహజములు.

సుధాకరు డుదయించినాడు. ప్రపంచ మంతట వెన్నెల వ్యాపించినది. దాని సౌందర్యము విలువకట్టరానిది. సృష్టిలోని సర్వపదార్థములను తెల్ల జేయు శక్తి దాని కెట్లు వచ్చెనో?

"కలయ వెల్లువగట్టి జలజలఁ బ్రవహించు
 శశికాంతవాంతనిర్ఝరముజలము,
మలయానిలముచే దుమారంబు రేఁగు సౌ
 గంధికంబురజంబు కలుకుదుమ్ము,

నిండారవిరిసిన బొండుమల్లెలనుండి
    వడియు మరందంబు గుడరసంబు,
తొలఁకి మింటికిఁ బొంగు దుగ్ధపాథోరాశి
    కరడులమీఁది మీఁగడల మెఱుఁగు,
తనకు రసవర్గములుగా, సుధాకరుండు
సారెసారెకుఁ గరములు సాఁచిచాఁచి,
యచ్చుదెలుపుగ నపుడు బ్రహ్మాండమండ
పంబు వెన్నెలసన్నసున్నంబు సేసె.''

(మను. 5-38)

పాలగచ్చు చేయువారు శుద్ధమైన సీటిని, గండ్రయిసుకను, బెల్లపు పానకమును, మీగడను తగు పాళ్ళలో కలిపి, మెదిపి, గోడలు, కంబములు మొదలగువానికి పూసి, అది గట్టిపడి, నునుపగు వరకును తాపీతో రుద్దుచుందురు. సుధాకరుడను గచ్చుపనివాడు బ్రహ్మాండభాండమునకు పాలగచ్చు చేయదలచి, చంద్రకాంత శిలాజలమును, సౌగంధికముల పుప్పొడిని, బొండుమల్లెల చిక్కని మకరందమును, పాలకడలి కరడులమీది మీగడలను కావలసినట్లు కలిపి, మెదిపి, దానితో అద్దానికి పాలగచ్చు చేసి, అచ్చ తెలుపుగ జేసినాడట. రూపకోత్థాపితమగు ఈ ఉత్ప్రేక్ష మనోహరముగా నున్నది. ఈ భావన, ఈ వర్ణనాచమత్కృతి వెన్నెలకంటె వేయిరెట్లు ఆహ్లాదము నిచ్చును.

పెద్దన కావించిన ఈ నక్షత్రవర్ణనము హృదయంగమముగా నున్నది—

"తలచూపె నప్పు డఖిలా
శల దట్టపుటిరులుచిలువజవరాలు నభ
స్థ్సలమండపకోపరిసీ
మల నిడిన సితాండపటలి మాడ్కిం జుక్కల్."

(మను. 5-34)

గాఢాంధకార మనెడు పాపజవరాలు నభస్థ్సల మను మండపపు పైభాగమున తన తెల్లని గ్రుడ్లను పెట్టిన ట్లున్నవట నక్షత్రములు. ఈ ఉత్ప్రేక్ష సుందర తరము.

చంద్రునిలోని నీలలాంఛనమును పలువురు కవులు పలురీతుల నుత్ప్రేక్షించియున్నారు. పెద్దన ఊహించిన తీరిది—

"రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద
నలిగి, దాడిగ వెంటాడ, నిలువ కతఁడు
బెగడువడి, పాఱుచోఁ జెఱఁ దగిలినట్టి
ఛాయ యిది యన నీలలాంఛనము మెఱసె."

(మను. 3-26)

చంద్రుడు మహాపరాక్రమవంతుడై, తన శత్రువగు సూర్యునిపై దాడివెడలి, ఆతనిని వెంటాడి తరిమెను, అతడును ఈతని ధాటి కోర్వలేక, భయపడి పారిపోయెను. అతని భార్య ఛాయాదేవి భర్తతోపాటు వేగముగా పరువెత్తి తప్పించుకొని పోవనేరక, చంద్రునికి బందీగా చిక్కగా, అత డామెను

చెరపెట్టెనట. చంద్రుని సామ్రాజ్యములోని చెరసాలలో నుండు ఛాయా దేవియే మనకు నల్లగా కన్పించుచున్నదట. ఈ భావము ఆశ్చర్యావహము

ఇందు పెద్దన భావ్యర్థమును ధ్వనింపజేయుచున్నట్లు తోచుచున్నది. సూర్యుడు సహజముగ తేజస్సంపన్నుడు. చంద్రు డా తేజస్సంక్రాంతిచే తేజోవంతుడుగా గోచరించును. కాలవశమున సూర్యుడు కనుమరుగై పోవగా, చంద్రుడు తాను స్వతంత్రముగానే తేజస్వియైనట్లు భాసించును. ఇది జగద్విదితము. ప్రకృత కథలో ప్రవరుడు స్వయముగనే తేజశ్శాలి. మాయా ప్రవరుడు అతని రూపమును తనయం దారోపించుకొనుటతో తేజోమూర్తి యైనాడు. వరూథిని ప్రవరుని త్రికరణశుద్ధిగా ప్రేమించినది. తా నాతనికి తప్ప అన్యులకు ప్రేయసి కా ననుకొన్నది. దైవవశమున ప్రవరు డామె నుండి దూరముగా తొలగిపోవగా, మాయాప్రవరుడు ఆమెను స్వాధీనము చేసికొన్నాడు. కృత్రిమ తేజస్వియగు చంద్రునివంటి మాయాప్రవరునికి, ప్రవరపత్నిగా తనను భావించుకొనిన వరూథిని, చిక్కనున్న దను విషయమును పెద్దన యిట ధ్వనింపజేసి యుండవచ్చును.

ప్రబంధమున ప్రధానరసము శృంగారము. తక్కినవి అంగములనుట సామాన్యనిర్దేశము. ప్రధానరసముగా శృంగారమే ఉండవలెనను నిర్బంధము అంగీకార్యము కాదు. ఏ రసమైనను చక్కగా నిర్వహింపబడునేని, ప్రధాన రసముగా నుండదగునని కొందరు విమర్శకుల అభిప్రాయము. ప్రబంధము లలో ఒక్కరసము ప్రధానము; తక్కినయవి తత్పరిపోషకములని స్వీకరించుట సముచితము. 'కావ్య-నాటకాది ప్రబంధములలో అనేక రసములు సంకీర్ణములుగా గాని, అంగాంగిభావమున గాని నిబంధింపబడుట ప్రసిద్ధమైనది. కాని కావ్యమునకు ఉత్కర్షమును కల్గింపగోరు కవి వానిలో నొక్క దానిని ప్రధానరసముగను, మిగిలిన వానిని అంగరసములుగను కూర్చుట యుక్తతర మగు మార్గ' మని ఆనందవర్ధనాచార్యుడు నిర్ణయించెను.

"ప్రసిద్ధే ఽపి ప్రబంధానాం నానారసనిబంధనే,
ఏకో రసోఽంగీకర్తవ్యః తేషా ముత్కర్ష మిచ్చతా."
(ధ్వన్యా. 3-21)

ఏకనాయకాశ్రయములగు శృంగారనైషధ, పారిజాతాపహరణాది - ఆంధ్రకావ్యములు శృంగారరస ప్రధానములు. కాని, అనేకనాయకరసాశ్రయములగు మను - ఆముక్తాది ప్రబంధములలో ప్రధానరస నిర్ణయవిషయమున విమర్శకులలో నభిప్రాయ భేదములు కలవు.

మనుచరిత్రమున — వరూధినీ-ప్రవరఘట్టమున ప్రవరాలంబనముగా ధర్మవీరమును, వరూధిన్యవలంబముగా శృంగార రసాభాసమును, గంధర్వ-వరూధినీసమావేశమున రతి, వంచనా సమాసాదితముగాన, శృంగారరసాభాసమును, మనోరమాదర్శన పర్యంత ముందు స్వరోచివృత్తాంతమున వీరరసమును, ఇందీవరాక్ష - రాక్షసయుద్ధఘట్టమున వీర-బీభత్స-భయానక-అద్భుత రసములును, మనోరమాదిపత్నీసమావేశమున శృంగారరసమును, చక్రవాకీ-హరిణనిందలవలన నీ శృంగారము విఘటిత మగునట్లు భాసించినను, అట్లుగాక స్థైర్యము నొందుటచే నచ్చటను శృంగారమును, వనదేవతాసమాగమ-తదనంతరకాలములందు స్వరోచిలో ధర్మవీరమును, స్వారోచిషుని తపశ్చర్యాకాలమున శాంతరసమును, మనుపట్టాభిషేకసమయానంతరము ధర్మవీరరసమును ప్రతీయమానము లగుచున్నవి.

ఈ ప్రబంధములో శృంగార, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతరసములు సంకీర్ణములుగా ప్రతీయమానము లగుచున్నను, ప్రధాననాయకుడగు స్వరోచిలో మొదట యుద్ధవీరమును, ఆ పిదప శృంగారమును

ఖాసించినను, చివరకు ధర్మవీరమే ప్రధానముగా నిలుచును. కాన నీ కావ్యమున ధర్మవీరము ప్రధాన రసము; తక్కిన రసములు తత్పరిపోషకములగు అంగరసములు.

ప్రవరునియందు ధర్మవీరము గాక శాంతరస మున్న దని కొందరి అభిప్రాయము. వారు దాని నిట్లు సమర్థించుచున్నారు. మొట్టమొదట ప్రవరుడు మనకు గోచరించునపుడు, "శీలంబున్ గులమున్ శమంబు దమమున్ జెల్వంబు లేఁబ్రాయము" గల్గి, శమమున కాలంబనమై గోచరించును. ఆ పిదప సిద్ధసమాగమ సమయమునను పరమశాంతుడుగనే అగపడును. తీర్థయాత్రార్థియై హిమగిరి కేగినప్పుడు అచట నరనారాయణ-పార్వతీ పరమేశ్వర-గంగావతరణాది దివ్యక్షేత్ర సందర్శనమున ఆ భావమే సుదృఢమై, వరూథినిప్రణయము బలిష్ఠముగా నాకర్షించుచుండినను, దానికి లొంగక, తత్ప్రత్యాఖ్యానానంతరము, అగ్నిదేవప్రభావమున నిలుచేరుటతో, అది శాంతరసాత్మకతను పొంది సాక్షాత్కరించును. ఈ విషయమును, పెద్దన స్వయముగ, వాచ్యముగనే 'శాంతరస మొల్కు బ్రహ్మతేజంబుతోడ' గంధర్వుడు ప్రవరరూపముతో ప్రత్యక్షమాయె నని చెప్పుటతో నిశ్చిత మగుచున్నది. కాన ప్రవరునియందు గోచరించునది శాంతరసమే కాని, ధర్మవీరము కాదు.—ఇది వాదసారాంశము.

ఈ వాదము సహేతుకమైనట్లు తోచును. కాని, నిశిత పరిశీలనమున కిది నిలుచునది కాదు. శాంతరసమునకు శమము స్థాయిభావము. శమ మనగా ఐహికవాంఛా నివృత్తియు, రాగ ద్వేషాది విరహితత్వమును. ప్రవరుడు 'వివిధాధ్వరనిర్మలధర్మ కర్మదీక్షాపరతంత్రుడు, అనారతాధ్యాపనతత్పరుండు, యౌవనమందు యజ్వయు, ధనాఢ్యుడునై, కూరిమిసోమిదమ్మ సౌఖ్యావహయై భజింప, తలిదండ్రులు గూడి యిలు దీర్ప గాపుర మొప్పువాడు.' పరకాంతాధనములయందు విముఖుడు. స్వకాంతాధనములయం దాతని కెట్టి విరక్తియు

లేదు. నిత్యకర్మానుష్ఠానమునందును, యజ్ఞయాగాదులందును అత్యంతభక్తి తాత్ప ర్యములు గలవాడు. 'రేపును మాపును హవ్యములచేత తృప్తుడౌ వహ్నిసత్కారుణ' నపేక్షించువాడు. 'స్వర్గకామో యజేత'అను వైదిక నియమానుసారము యజ్ఞములు చేసి, స్వర్గసౌఖ్యముల కోరువాడు. వరూధినివంటి పరమ సౌందర్యమూర్తి తన్నాశించినప్పుడు, తానామెను తిరస్కరించుటకు కారణము, తానేకపత్నీ వ్రతుడగుటయే. ఆనాడిలు చేరకుండిన 'హేలిమియున్, సురార్చనయు, విప్రసపర్యయు జిక్కె, భుక్తికిన్ వేళ యతిక్రమించె, జననీ జనకుల్ కడు వృద్ధు లాకటన్ సోలుచు' చింతతో ఎదురుచూచు చుందురని వాపోయినవాడు. కర్మదీక్షాపరతంత్రుడు గాన, సమస్త ధర్మములును కూలి పోవు నని పరితపించెను. శమప్రధాను లగువారిని మిక్కిలిగా నాకర్షింపగల పుణ్యతీర్థ క్షేత్రాదు లాతనిని గృహదారాదులనుండి విముఖుని చేయజాలక పోయినవి. 'అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మది నెంత కుందునో' యని వాపోయినవాడు రాగద్వేషాద్యతీతుడు కానేరడు. ఇతడు గృహస్థధర్మమును పాటించు ధర్మవీరుడు. శమదమాదులు శాంతమున కను భావములగునట్లు, ధర్మవీరమునకును అనుభావములు కాగలవు. కాన 'శాంతరస మొల్కు బ్రహ్మతేజంబుతోడ' గంధర్వుడు ప్రవరరూపమున ప్రత్యక్షమాయె నని చెప్పునప్పటి పెద్దన అభిప్రాయమును అదియే. శాంతరస మనుమాటకు శాంతగుణమనియే అర్థము. లోకమున నీ యర్థమున రసశబ్దము వ్యవహరింప బడుచునే యున్నది. అతడు కరుణరసపూర్ణు డనగా, దయాగుణము కలవా డనియే అర్థము. కాన ప్రవరుడు రామ యుధిష్ఠిరాదులవలె ధర్మవీరు డనుట సమంజసము.

వరూధిని ప్రవరునిరూప సౌందర్యమును చూచి, ప్రేమించెను. ప్రవ రుని కామెపై అనురాగ మేర్పడలేదు. ఆలంబనములలో ఒక్కదానియందే అనురాగ ముండుటచే ఈ శృంగారము రసాభాసము.

తిర్యగ్రతియు రసాభాసమే యగును. విభావాదిపరిజ్ఞానము లేకపోవుటచే నా రతి రసాభాసమే యైనను, కావ్యగత శృంగారమున కది పరిపోషక మగునేని, కావ్యములలో అద్దానిని వర్ణించుట కవిసంప్రదాయము. విభావాది పరిజ్ఞానము లేకపోయినంతమాత్రమున తిర్యగ్రతి ఏల రసాభాసము కావలెను? ఆనందానుభూతికి విభావాదిజ్ఞానము ఆవశ్యకమా? సర్వప్రాణులకును తత్తద్యోగ్యమగు రతి సమానాకారమగు నిర్వృతినే ఇవ్వజాలును. వాని రతి ఉత్తమానందప్రదము కాదనుట, మన దృష్టితోనే, వానిదృష్టితో కాదు. కాన, తిర్యగ్రతి రసాభాసము కాజాలదు, రసమే యగు నని విద్యాధరుడు సహేతుకముగా నిర్ణయించియున్నాడు.

ఇట్లు తిర్యగ్రతినికూడ రసముగా నంగీకరించిన లాక్షణికులు సైతము, నాయికా నాయకులలో నొకరియందే రతి యున్నచో, అది రసాభాసమే యగు నని అంగీకరించి యున్నారు. మాయాప్రవర - వరూధినీ సమావేశమునను వరూధిని ప్రవరబుద్ధితోనే గంధర్వుని గలసినది. గంధర్వునియం దామెకు అనురాగము లేదు. కాన, ఇదియు రసాభాసమే. ఇట్టి అసభ్య శృంగారమును వర్ణించి, పెద్దన, వంచనారతియు గ్రాహ్యమని లోకమునకు చాట దలచెనా? ఇది నీతిబాహ్యము కాదా? యని మరియొక ప్రశ్నయును కలదు.

ప్రవరుడు ఐహికభోగములం దాసక్తి కలిగిన గృహస్థుడు. వాని బాహ్యసౌందర్యమును చూచిన వరూధిని వలచి, వలపింప జేసికొన ప్రయత్నించినది. 'వనిత తనంత దా వలచి వచ్చిన చుల్కనగాదె యేరికిన్' అను న్యాయమున, ఆతడు తన ప్రేమను చులకన చేయుచున్నాడని భావించి, అతని మనస్సును మార్ప వేయివిధముల యత్నము చేసినది. అగ్నితేజోమధ్యంగతుడై ప్రవరు డంతర్హితుడైనపు డామె దిగ్భ్రాంతయై చూచుచుండినది. ప్రవరు డేమాయెనో యామెకు తెలియలేదు. కావుననే విరహవేదనతో క్రుంగి కుమారిలినది. సౌందర్యరాశియగు తన వలపును కాదని పోయెనే! తన యవివేక

మును గుర్తించి, అతడు మరల రాకపోవునా? యను ప్రత్యాశతోనే జీవహారణము చేయుచుండినది. అమెకోరిక ఫలించినది. మరునా డామె ప్రవరుని జూచినది. తన ప్రేమ నాత డంగీకరించెను. ఈతడు మాయావేషధారి యని పాప మామె కేమి తెలియును? ఈ మాయాప్రవరునియందు, భ్రాంతివశము వనే కావచ్చును, ఆమెకు నిర్దుష్టమగు అనురాగము గలదు. ఇట్లు వారి సమాగమమున ఉభయత్ర అనురాగ మున్నది. రసానుభూతిలేని కేవల విమర్శక దృష్టిలో లేకపోయినంత మాత్రమున వారి కేమి కొదవ?

మాయాకల్పితరతివలన నేర్పడు శృంగారము గాన నిది రసాభాసమే యని అంగీకరించినను, ఇది ఏకత్రానురాగరూపమగు రసాభాసము కాదు. కాలాంతరమున నైనను వరూధిని కీ వంచన తెలియలేదు. ప్రవరుడే తన ప్రియుడని, ఆమరణము, వరూధిని విశ్వసించియుండినది. కాన నీ శృంగార రసాభాసము అసాధారణమైనది. ధర్మప్రతిష్ఠాపకుడగు మనుసంభూతి కీ సంగమము కారణభూత మగుట విధినిర్ణయము. అందుననే గంధర్వుని మోసము సర్వదా ప్రచ్ఛన్నమైయే యుండినది. ఇట్టి అసాధారణ సన్నివేశమును లోక మెట్లు సాధారణముగా భావించును? లోకమున కది నీతిబోధక మెట్లగును? మహాపురుషసంభవము అసాధారణమై, దురవగాహముగా నుండు ననియే లోకమునకు దీనివలన నెరుకపడును. పెద్దనయు నద్దానినే బోధింప దలచి యుండును. మరియు, రసాభాస మెట్టిదైనను, ప్రధానరసపోషక మగు నేని, దానిని వర్ణించుట దోషము కాదనియే సర్వాలంకారిక సంప్రదాయము.

స్వరోచికి ఉత్సాహము జన్మతః కలిగినది. వివాహమునకు పూర్వ మితడు యుద్ధవీరుడుగ నుండెను. వివాహానంతరము శృంగార మితనిలో భాసించెను. చక్రవాకీ-హరిణముల నిందావచనములతో, అతనిలో సహజముగా నుండిన ఉత్సాహగుణము ధర్మోన్ముఖము కాజొచ్చెను. వనదేవతా సమాగమమున కాత డంగీకరించుట శృంగారదృష్టితోకాక, ధర్మదృష్టితో

జరిగినది. ఇట్లీతనిలోని ధర్మోత్సాహము స్థాయియై, ధర్మవీరముగా పరిణ మించుచున్నది.

స్వారోచిషునిలోను మొదట శాంతము భాసించి, క్రమముగా నది ధర్మవీరమున కంగమేయై, అద్దాని కుద్దీపకమై యున్నది. ఇట్లీ గ్రంథమున సర్వత్ర ధర్మవీరమే ప్రధాన రసముగా విలసిల్లినది.

మహాకవులు తాము సృష్టింపదలచుకొన్న పాత్రల స్వరూపస్వభావాదు లను భావించి, ఆయా పాత్రలలో లీనమై, వానిని తీర్చి దిద్దుదురు. పెద్దన కావించిన పాత్రసృష్టి అసాధారణమైనది. ఆ యా పాత్రల స్వరూప స్వభావాదులను స్థూలముగా ప్రథమమున నిర్వచించి, అనువగు సందర్భము లలో ఉచితరీతిని వానిని విస్తరించి, వాని పూర్ణస్వరూపములను పాఠకుల హృదయఫలకములపై ముద్రించుట యన్న దీతనిలో నున్న ప్రత్యేక కళ.

కవి కావ్యములోని అన్ని పాత్రములలోను లీనమైనను, తనకు నచ్చిన, తాను లోకమున కాదర్శప్రాయముగా చూపదలచిన, ఒకానొక పాత్రలో సంపూర్ణముగా లీనమై, అందు ఆత్మీయతాముద్ర ప్రదర్శింపకుండ నేరడు. ఇది కవిసామాన్య స్వభావము.

మనుచరిత్రములో ప్రవరపాత్రము పెద్దన - ఆత్మీయతా ముద్రను సంతరించుకొనినట్టి దని ఊహించుట కవకాశ మున్నది. ప్రవరుడు అరుణా స్పదపురనివాసి. 'జయంత-వసంత-కంతులను చక్కదనంబున గెలువజాలిన వాడు' అని గంధర్వాంగన పొగడ్తల నందుకొనిన సుందరుడు. వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీక్షాపరతంత్రుడు; అనారతాధ్యాపనతత్పరుడు; యౌవన మందే యజ్వ, ధనాఢ్యుడు. అనుకూలవతి సోమిదమ్మ అతని ప్రియపత్ని, సౌఖ్యావహమైనది. తల్లియు, తండ్రియు నిలు దీర్చుచుండ సుఖముగా కాపుర

ముండినవాడు. పాత్రుడని, ఏ భూపాలుడీ వచ్చినను, సాలగ్రామము మున్నుగా గొనడు. అతిథిపూజాతత్పరుడు; తీర్థసందర్శనాభిలాషి.

పాదలేపప్రభావమున హిమగిరి కేగిన ఈ ప్రవరుని బాహ్య సౌంద ర్యమునకు అబ్బురపడిన వరూధిని మోహించి, తన సర్వస్వమును అర్పణ చేసికొనదలచినది. ఆమె హేతువాదమున కాతడు లొంగలేదు. బలవంత ముగా మీదపడిన ఆమెను 'హా! శ్రీహరీ!' యంచు నోరమోమిడి, తదీయాం సద్వయం బంటి పొమ్మంచు తొలగం ద్రోసిపై చినాడు. దేహము వినశ్వర మను విషయ మాత డెరుగనిది కాదు. బ్రహ్మానందమును చవి చూచుటకు ఈ దేహము సాధనము కాగలిగినచో నంతకంటె కోరదగిన దేముండును? తుచ్ఛములు, సుఖాభాసములు నగు ఐహికసుఖానుభవములకై ఈ దేహము నుపయోగించువాడు, దానివిలువ తెలియని అవివేకియే కాగలడు. దారపరి గ్రహము పితౄణవిముక్తికిని, వైదిక కర్మానుష్ఠాన సంపాదనమునకును మాత్రమే. ఈ రహస్యమును బాగుగా నవగతము చేసికొనిన ప్రవరుడు వరూధినీప్రణయమును నిరాకరింపక ఎట్లు స్వీకరించును? బాహ్యసౌందర్య మునే కాక, అంతస్సౌందర్యమును కూడ గురుతింపగల ధీశాలి ప్రవరుడు. అట్టి సౌందర్యము గల సోమిదమ్మ తన హృదయసామ్రాజ్ఞియైనది. కళత్రపరి గ్రహ ఫలమును ఆమె సమకూర్పగలదు. ఇక కళత్రాంతర పరిగ్రహమున కవకాశ మేమున్నది? అందుననే వరూధినీ ప్రణయ మాతనికి నచ్చలేదు. గృహస్థుడగువాడు నిర్లిప్తుడై, ఇంద్రియవిజయమును సాధించి, భగవత్కైం కర్యరూపముగా, నిత్య నైమిత్తికాది కర్మలను యథావిధిగా కొనసాగిం చుచు, భగవద్భక్తి మార్గమున మోక్షసామ్రాజ్యము నధిరోహింపగల డను పరమసత్యమును బాగుగా గుర్తించిన ప్రవరుడు కామినీవిలాస విభ్రమము లకు ఎట్లు లోనగును? మోహాంధులైనవారు చేయు వెకిలిచేష్టలకును, మాటాడు పసలేని మాటలకును, విజ్ఞాని యగు ప్రవరుడు మోహము నేల

పొందును? కావుననే తృణప్రాయముగా వరూధినికోరికను తిరస్కరింప గలిగెను.

వరూధినిపై నాతనికి ఆగ్రహముకాని, జుగుప్స కాని ఏర్పడలేదు; అనుకంపయే కలిగినది. వివేకమును కల్గించుటకై, అడుగకున్నను, ఆమెకు ఉపనిషత్సారములను బోధించెను. మోహాంధులకు వివేకమును కలిగించి, వారిని సన్మార్గగాములను చేయుటయు విద్యావంతుల కర్తవ్యము. అందుననే ఆత డా పనికి పూనుకొనెను. కాని, అజ్ఞానాంధకార నిర్మగ్నయగు వరూధిని ఈ జ్ఞానతేజము నెట్లు చూడగల్గును? తన ప్రయత్నము ఫలింపక పోయెనను చింత ప్రవరున కేర్పడినట్లు లేదు. 'మా ఫలేషు కదాచన' అని కదా కృష్ణ భగవానుని శ్రీసూక్తి. ధర్మవీరమునకు ప్రతిబింబము ప్రవరుడు. అస్థానపతిత మగు శృంగారము నీ ధర్మవీర మణచివైచినది. కావుననే ఇందలి పురుష పాత్రములలో ప్రవరపాత్ర మగ్రగణ్యమైనది.

వరూధిని నలనాభ గంధర్వరాజుకుమార్తె, ఇందీవరాక్షుని తోబుట్టువు; అతిలోకసుందరి. నిత్యబ్రహ్మచారుల మనస్సులైనను, ఆమె సౌందర్యమును చూచిన చెదరిపోవునట్టివే. ఎందరో గంధర్వులు ఆమెను పరిణయమాడ గోరినను, తాను కాంక్షించిన ఒకానొక దివ్యసౌందర్యము, వారిలో నెవ్వరి లోను కానుపింపకపోవుటచే, వారినెల్ల తిరస్కరించినది. సంగీతాది విద్య లలో పారంగత. ఐశ్వర్యమునకు కొదవలేదు. ఆమెనివాస-పరిసర ప్రాంత ములు, ఇనుపకచ్చడాలు కట్టుకొనిన మునిముచ్చుల మనస్సులనైనను వికల ములు చేయగలయట్టివి. ప్రవరునిలో తా నూహించినదానికంటె, ఎన్నియో మడుంగు లధికముగా నున్న దివ్యసౌందర్యమును చూచి, ముగ్ధురాలైనది. ఆ దివ్యమూర్తి తనను పరిగ్రహించినచో, ఏలని బంటుగా మరుని డక్క గొనంగరాదె? యని భావించి, యువ్విళ్ళూరినది. అతని నామె వరించుటలో తప్పిద మణుమాత్రమును లేదు.

అతడు వివాహితుడే యైనను, తనను ద్వితీయ కళత్రముగా స్వీకరించుటకు ధర్మశాస్త్ర మడ్డురాదు. గృహస్థునకు శృంగారానుభవము పరిహార్యము కాదు. దానివలన నాతని కర్మాచరణమునకు హాని ఏర్పడవలసిన అవసరము లేదు. ఆముష్మిక చింతనమునకు కళత్రము విరోధి కాదు. మోక్షలక్ష్మిని చేపట్టుటకు దక్షిణనాయకుడై, గృహస్థధర్మమును నిర్వహించుట ప్రతిబంధకము కానేరదు. కావుననే, అనన్యమనస్కయై ప్రవరుని ప్రేమించిన దామె. పురుషాంతరస్పర్శము నెరింగిన జాణ కా దామె. కేవల ముగ్ధ. ఆమె ప్రేమ నిర్దుష్టము. అది అన్యసంక్రాంతము కాజాలదు. ప్రవరునికి చోటిచ్చిన ఆమె హృదయము అన్యపురుషుని దరిజేరనీయదు. ఇట్టి సౌశీల్యము గల వరూధిని ప్రవరుని కాంక్షించుటలో ఔచిత్యమున కేమియు భంగము కానరాదు. ఈ యిన్ని ఉపపత్తు లుండుటచే వరూధినీ ప్రణయము త్రోసివేయరానిదిగనే కన్పించును. కావుననే శృంగారరస స్వరూపిణి యైనది వరూధిని. ధర్మమూర్తి యగు ప్రవరుడు, ఆముష్మికేచ్ఛావిరహితమై, కేవలైహికభోగపరాయణమైన ఆమె ప్రణయమును త్రోసివేసిన మాట వేరు విషయము.

మనుచరిత్రమునందలి స్త్రీపాత్రలలో ఉత్తమురాలు మనోరమ. ఈమె వరూధినివలె ఇంద్రియపరవశగాదు. తన హద్దులను దాటి ఎన్నడును ప్రవర్తింపలేదు. తన తండ్రి నిర్ణయించిన వరుని తా నంగీకరించినది. అతడు మహాపరాక్రమవంతుడు, రూపవంతుడు, తొలిచూపులోనే తన హృదయమును చూరగొన్నవాడును అగుట తన భాగ్యముగా భావించుకొన్నది. అంతియే. వరనిశ్చయము జరిగిన వెంటనే కన్యాసహజ మగు లజ్జ ఆమె నావహించెను. కన్యల సౌందర్యము నదియే వృద్ధిజేయునట్టిది. ఈ లజ్జ వరూధినిలోను వ్యక్తమైనను, ఎక్కువకాల మది నిలువజాలక పోయెను. బలవంతముగా నాలింగనము చేసికొనుట పురుషులకు ఉచితమైన కావచ్చును; కాని, స్త్రీల కది

అస్వాభావికము. ఇట్టి సాహసము కన్యల కుండుట మరింత విడ్డూరము. వరూధినివలె గాక మనోరమ కులకన్యాధర్మములు సంపూర్ణముగా కలిగిన ముగ్ధ. ఆమె మౌగ్ధ్యమునకు అనుకూలముగా నుండు నను తలంపుతో పెద్దన మనోరమ వృత్తాంతమున, కథాసన్నివేశములో నించుక మార్పు చేసెను. ఆ మార్పు ఔచిత్య పోషణమున కెంతయో ఉపకరించినది.

ఇందీవరాక్షుడు స్వరోచికి తన కన్యక నీయ నుపక్రమించినప్పుడు మనోరమ తన తండ్రితో—'మన కుపకారియైన సుకుమారుని నీతని జూచినప్డ నా మనమున రాగమైనయది మానుగ, నైనను దండ్రి! నాకతంబున బటురోగ దుఃఖముల బొందుచు నెచ్చెలు లట్టులుండగా, మనసిజభోగలీలలకు మానస మెమ్మెయి నాకు నూల్కొనున్' అని చెప్పినట్లు మారన వ్రాసెను. కన్యక, తనకు వరుడు నిశ్చితుడై ఆత డెదుట నుండగా, తండ్రితో నిట్లు పలుకుట అసహజమును, ఔచిత్య భంజకమును అగుట నిశ్చయము. కావుననే పెద్దన, పునస్సంధాన వేళలో ప్రియుడు తనను లాలించుచు, దుఃఖహేతువు నడిగి నప్పుడు, తనకు చిక్కిన ప్రథమావకాశ మదియే కావున, తన ప్రాణసఖు లకు రోగశాంతి జేయు మని ప్రార్థించినట్లు మార్చెను. ఈ మార్పు మనోరమ పాత్ర కౌన్నత్యము నాపాదించినది. స్వనిమిత్తముగా సఖులు ఆపన్నలై యుండ, అట్టి ప్రాణసఖులను మరచి, స్వసుఖమునే కోరుకొను స్వార్థపరా యణురాలు కాదు మనోరమ. కళావతీ విభావరు లిద్దరును, తన భర్తనే వివాహమాడ దలచినప్పుడు, నిస్సంకోచముగా అందుల కియ్యకొనెను. అంతియే కాదు; సవతిమచ్చరము ఏ మాత్రమును లేక, ఆ ముగ్గురు సఖు లును సర్వభోగముల ననుభవించిరి. ప్రియుడు దక్షిణనాయకు డగునపుడు, సవతు లిట్టి సహన భావము కల్గియుందురేని, వారి ఆనందమున కంతరాయ ముండ దనుట కీ మనోరమ నిదర్శనము.

మనుచరిత్రములోని పురుషపాత్రము లన్నింటిలోను ప్రవర పాత్ర మత్యుత్తమ మైనది. భౌతికానందముకంటె పారలౌకికానందము సత్యము, శాశ్వతము నగు నిర్వృతిని ఈయజాలిన దని గుర్తించుటకు స్వరోచికి చాల కాలము పట్టెను. ప్రవరు డచిర కాలముననే అద్దానిని గుర్తించెను.

మహాపండితుడగు బ్రహ్మదత్తుడు, ఇందీవరాక్షునిలోని అత్యల్పదోష మునకే ఆగ్రహపరవశుడై శాప మిచ్చెను. 'న కశ్చి న్నాపరాధ్యతి' (తప్పు చేయనివా డెవ్వడు నుండడు.) అను తత్త్వమును ఈతడు తెలిసికొనజాలక పోయెను. ప్రవరుడు ఆ రహస్యము నెరిగినవాడు కావుననే, వరూధినిపై జాలితలచెను.

ఇంద్రియవిజయమును సాధించి, తద్వారా మోక్షమును చేబట్టబూనిన జీర్ణముని, బాల్యచాపలమున తన ముఖమును తడవిన మనోరమపై నాగ్ర హించి, శపించెను. ఆతని మౌర్ఖ్య మంతటితో నాగక, పాప మా బాలికను చావమోదు వరకును తృప్తి పడలేదు. ప్రవరు డట్టి మూర్ఖుడు కాడు.

వరమహర్షి యగు పార్షతుడు మూడుకాళ్ళ ముదుసలియు, జీర్ణదేహుడు నైనను, పుంజికస్థలను చూచి, వివశుడై, ఆమెవలలో చిక్కుకొనెను. యువకుడే యైయుండియు ప్రవరుడు ముగ్ధమోహనాంగి యగు వరూధినికి లోబడలేదు. ఇంద్రియ విజయము నిష్కామకర్మయోగమున సాధింపనగు ననుట కింతకంటె నిదర్శన మేమి కావలయును?

కలిగంధర్వుడు మాయావి; వంచనారతికి పాల్పడిన అపరిణతబుద్ధి. ప్రవర వ్యామోహమున, పాపము, వరూధిని అతని మోసమును తెలిసికొన జాలకపోయెను. ఆమెమౌగ్ధ్యము నవలంబముగా జేసికొని, ఈ వంచనాశీలుడు కృతకృత్యు డాయెను. ఇట్టి మాయావితనమును స్వప్నమందైనను ఊహింప జాలని నిర్మలాంతఃకరణుడు ప్రవరుడు.

# అల్లసాని పెద్దన

ఇందీవరాక్షుడు జ్ఞానసముపార్జనాదృష్టి గలవాడే యయ్యు యధాకథం చిత్ తత్సాధనమునకు పూనుకొని, తన జాతిసహజమగు మాయావిత్వమునే ఉపయోగించి, శాపగ్రస్తు డాయెను. ప్రవరు డిట్లు కుమార్గములలో స్వాభీష్ట మును సాధింపగోరువాడు కాడు.

కలిగంధర్వుడు తన మాయాశక్తితో ప్రవరుని రూపమునేగాక, అతని తేజస్సునుకూడ రూపొందించుకొనెను ఆ తేజస్సునకే వరూధిని వశంవద యైనది. ఆమె హృదయమం దంతటను ఆ తేజస్సే పరివ్యాప్తమైనది. విష యాంతరమున కచట తావు లేదు.ఈ భావనతోనే వరూధిని గర్భముదాల్చెను. ఇక తన గుట్టు బట్టబయలగు నను భీతితో ఆ మాయావి యుక్తిగా దాటు కొనెను. ప్రవర తేజో భావనాభావితాత్మయగు వరూధినియందు కలిగంధర్వ తేజస్సుతో నుద్భవించినవాడు స్వరోచి. ధర్మోత్సాహ ప్రణయముల మేలి కలయికయే అతడు. గంధర్వ బీజ సంజాతుడు గాన, అతనిలో మొదట శృంగారమే ప్రబలమై యుండినది; ధర్మోత్సాహము అప్రధానముగనే యుండి నది. కావుననే బహుకాల మాతడు భోగాసక్తుడై యుండెను. ఇట్టియు, చక్రవాకియు అట్టి వ్యామోహమును నిరసించునపుడు, అతనిలో ప్రసుప్తమై యుండిన ధర్మోత్సాహము మొదటిసారిగా ప్రబుద్ధమాయెను. కాని, దానికి చాలినంత బలము లేకుండుటచే నది శృంగారమునకు తలయొగ్గెను. తనివి తీరని భోగానుభవములతోనే వందలకొలది యేండ్లు గడపినవా డతడు. ఇట్లిం ద్రియవశంవదుడును, బహుకాలమునకుగాని ఆత్మతత్త్వము నెరుంగజాలని వాడును కాడు ప్రవరుడు. కావుననే ఆతడు ఆదర్శప్రాయు డాయెను.

ఈ ప్రవరమూర్తిలో పెద్దన మనకు స్పష్టముగా ప్రత్యక్షమగు చున్నాడు. ఆతని ఆత్మీయతాముద్ర యున్న పాత్ర మిది.

పెద్దన తరువాతి కవులు, ఈ మహాకవియందలి భక్త్యతిశయము చేతను, ఈతని పదలాలిత్యము, అల్లికజిగిబిగి, భావనాసౌందర్యము, వర్ణనా

చమత్కృతియు వారి నాకర్షించుటచేతను, ఈ ఆంధ్రకవితా పితామహుని రచనలను అనుకరించియున్నారు. ఎంతటి మహాకవియైనను సమకాలికుల మన్ననల పొందగలడే కాని, వారి యంతరంగముల చూరగొని, వారిని స్వవశుల గావించుకొనగల్గు ననుట దుర్లభము. పూర్వులగు మహాకవుల నను కరించుట తరచుగా చూడనగును కాని, సమకాలికులనే అనుకరించుట యన్నది అసాధారణము. అనన్యసాధారణమగు ఈ మహాగౌరవము పెద్దనవంటి మహా కవుల కేకొందరకో లభించినది. రామరాజభూషణుడును, తెనాలి రామలింగ కవియు, పెద్దన వార్ధక్యమున బాలకవులో, యువకవులో యైయుందు రని బహువిమర్శకాభిప్రాయము. ఈ ఇరువురును అద్వితీయ ప్రతిభా సంపన్నులు; సామాన్యకవులను లెక్కగొననివారు. వీరిరువురును పెద్దన పద్యముల నను కరించి రనగా, ఆ కాలపు జనులకును, ప్రత్యేకించి, కవులకును ఈ కవిపై నెంతటి భక్తిభావ ముండెడిదో విశదమగును.

కవిబ్రహ్మ, ప్రబంధపరమేశ్వరుడు, కవిసార్వభౌముడును సూర్య చంద్రాగ్ని సదృశులై, తేజోంతరముల తిరస్కరించుచుండ, సర్వతేజః పూర్ణుడైన పెద్దన, వారి కవితాతేజములచే తన కవనతేజము అంతర్హితమై పోవక, ప్రస్ఫుటముగా భాసించుచుండగలదని నిరూపించి, ఆంధ్రకవితాపితా మహు డనిపించుకొనగల్గెను. ఇట్టి మహాకవిని అనుకరించుట గౌరవమే కాని, న్యూనత కానేరదని తర్వాతి కవుల యభిప్రాయమై యుండును.

ప్రవరుని కంటబడిన వరూధిని రూపము నిట్లు వర్ణించినాడు పెద్దన-

"అతఁ డావాతపరంపరాపరిమళ
వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చో టని చేరఁ బోయి, కనియెన్
విద్యుల్లతావిగ్రహన్,

శతపత్త్రేక్షణఁ, జంచరీకచికురం,
జంద్రాస్యఁ, జక్ర స్తనిన్,
నతనాభిన్, నవలా, నొకానొక మరు
న్నారీశిరోరత్నమున్."

(మను. 2-25)

నర్మసచివుని కగుపించిన గిరికాదేవిని రామరాజభూషణు డిట్లు వర్ణించినాడు—

"తరువులపొంతఁ బొంచి, వసు
ధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ, దమోవినీలకచఁ,
దామరసోదరసోదరప్రభం,
దరళవిలోచనం, దతని
తంబఁ, దటిన్నిభగాత్రవల్లరిం,
దరుణశశాంకఫాల, నొక
తన్విఁ, దరంగవళిం, దలోదరిన్."

(వసు. 2-25)

ఇట్టి పద్యమును తనకు వ్రాయనేర్పినవాడు పెద్దనయే యని రామరాజ భూషణుడు ఆశ్వాసపద్య సంఖ్యలను సమానముగనే స్వీకరించి, మనకు వాచ్యముగనే చెప్పియున్నాడు.

ప్రవరుని యలౌకిక సౌందర్యమును చూచి, అబ్బురపడిన వరూధిని, సృష్టికర్త ఆతని రూపము నిట్లు సృష్టించియుండు నని ఊహించినది—

"నేరెటేటియసల్ తెచ్చి, నీరజాప్తు
సానఁబట్టిన రాపాడి చల్లి, మెదిపి,
పదను సుధ నిడి, చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి."

(మను. 2-36)

గిరికరూపమును పద్మభవు డెట్లు సృష్టించియుండునో ఊహించి, నర్మసచివుడు వసురాజున కిట్లు చెప్పుచున్నాడు—

"మేటిజమ్మేటియసటఁ గ్రొమ్మించుమించుఁ
బొదివి, మదనప్రతాపాగ్నిఁ బుటమువెట్టి,
తమ్మిగద్దియదాకట గ్రెమ్మి, యట్టి
కొమ్మఁ గావింపఁబోలు నెత్తమ్మిచూలి."

(వసు. 2-32)

పెద్దనసృష్టి కిది తుల్యసృష్టి యనుట సుస్పష్టము.

హిమగిరిని చూడనేగిన పెద్దనతోబాటు రామరాజభూషణుడును వెడలి, అత డొక్క కోనను వర్ణింపగా, ఆ ప్రక్కనే యున్న మరియొక కోన నీతడు వర్ణించె నేమో యనునట్లున్న వీ యిరువురి కొండకోనల వర్ణనములు.

"కులిశధారాహతిపాలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగుఱైన తటులఁ
గనుపట్టు లోయ గంగానిర్ఝరము వాఱఁ
జలువఁడౌ నయ్యేటికెలఁకులందు
నిసుకవెట్టిన నేల నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యురులు గవియు
క్రముక-పున్నాగ-నారంగ-రంభా-నాళి
కేరాది విటపి కాంతారవీథిఁ

గెరలు పిక-శారికా-కీర-కేకి-భృంగ-
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె.

(మను. 2-19)

పెద్దన కిట్టి కోన కనుపింపగా, భట్టుమూర్తికి దానితో బాటు మరియొక కోనయు నిట్లు కనుపించెను—

"రేలెల్ల నమృతమరీచినంటున నంటఁ
గరఁగి, నిర్మలపయోఝురులఁ దొరఁగి,
బలువిడి పెనులోయఁ బడిన క్రొన్నెలరాల
చఱులలో నిరుగడఁ దఱచు మెఱచు

పటికంపుపణకులపజ్జ గొజ్జఁగినీటి
యేటిక్రేవలఁ జలియిసుక వెట్టు
నేడాకుటనఁటుల, నెలమావిగుమురుల,
సురపొన్నకూటాలఁ జుట్టుకొనిన

బండిగురివెందతీఁగెచప్పరము లెనసి
ముడిగొనిన ద్రాక్షపందిళ్ళ నడుమఁ గిన్న
రీనినాదానుకారి శారీశుకాది
ఘోష ఘుమఘుమితంబైన కోనఁ గనియె."

(వసు. 2-21)

వరూధిని గర్భము దాల్పగా నామె నిరుపేద నడుము క్రమముగా బలుపెక్కుటను పెద్దన ఇట్లు చమత్కరించెను—

"నాకజలజాక్షినిఱుపేదనడుము బలిసి,
యల్లనల్లన వళిసీమ నాక్రమించెఁ;
బేర్చి దివసక్రమంబున బీద బలిసి,
బందికాఁ డైనఁ, బొరువులు బ్రదుకుఁ గనునె?"

(మను. 3-121)

స్వతంత్ర ప్రవృత్తి కలవాడును, తన కవనవైఖరి విభిన్నమైనదిగనే యుండవలయు నని కాంక్షించువాడును నగు రామకృష్ణుడు, పెద్దన పద్యము లోని 'బీద బలిసి బందికా డగు' నను పలుకుబడిని చదివి, మురిసి, తన పద్యములో దాని నిట్లిరికించుకొని, తృప్తి జెందెను—

"విబుధ! తపోధనేంద్ర! విను,
వేయివిధంబుల నాతఁ డేద నే
చి బలవిభేది నైచికి వి
శృంఖలమై ఖలమైత్రిఁ బోలె వే
గ బలవిహీనతార్తి యుడు
గం, గడుఁ గ్రొవ్వున నివ్వటిల్లి, బీ
ద బలిసి బందికాఁడగు వి
ధంబునఁ దిమ్మరు నమ్మహాటవిన్."

(పాండు. 5-239)

మాయాప్రవరుడు తన యూరికి వెడలెద నని చెప్పగా వినిన వరూధిని, గుండె జల్లనగా, దుఃఖము నాపుకొనలేక, ఇట్లు విలపించినది—

"అనినం, జిత్తము జల్లనన్ సొరుగు న
య్యంబోజపత్రాక్షిలో
చనగోళంబులఁ జిమ్మలై, చిలుపలై,
జాలై, తరంగంబులై,
చనుదోయిం గొనబౌ కురంగమదచ
ర్చల్ జాఱిపో నొక్కమెం
డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ బో
టుం బాటుగా నెంతయున్."

(మను. 3-136)

వరూధిని కన్నీరు క్రమక్రమముగా హెచ్చి, సముద్రమునందలి పోటు పాటుల ట్లుండె నని, ఆ దుఃఖాతిశయమును పెద్దన వర్ణింపగా, ఉత్తరోత్తరోత్కర్షరూప మగు ఈ సారాలంకారపు సౌందర్యమునకు విస్మితుడైన సారంగు తమ్మయ తన 'వైజయంతీవిలాసమున' విప్రనారాయణుడు కామినీ వాగురమున చిక్కి, హృదయదార్ఢ్యమును క్రమముగా కోల్పోయె నని వర్ణించుచు ఇట్లు వ్రాసెను—

"ఆ విప్రోత్తము వజ్రపంజరనిభం
బై, నిశ్చలంబైన స
ద్భావం, బంగనసాహచర్యగుణసం
పర్కంబునన్ లోహమై,
గ్రావంబై, దృఢదారువై, తరుణవృ
క్షంబై, ఫలప్రాయమై,
పూవై, తన్మకరందమై, కరఁగెఁ బోఁ
బో నీళ్ళకుం బల్చనై."

(వైజ. 2-189)

మనోరమాస్వరోచుల ప్రథమ సమాగమమును వర్ణించుచు పెద్దన చెప్పిన—

"దట్టంబు నీకట్టినట్టి చెంగావికి
బాగుగా దని కేలఁ బయఁట నిమిరె,
గోరంటా గోళ్ళనిక్కువపుఁ గెంపో యని
చెయి పట్టి నయమున సెజ్జ సేర్చె,

నగరుధూపముచేత నయ్యో తనూవల్లి
సెక సోఁకె నని యెవఁ జెయ్యి వెట్టె,
మృగనాభికామకరికలఁ గప్రము మించె
నని మూరుకొనుచుఁ జుంబన మొనర్చె,
హారమణు లిటు సూపు నాయణుత నున్న
హారమణులకుఁ గాంతి నీడౌనొ? కావొ?
యనుచు నక్కునఁ గదియించు నా నెపమునఁ
గంపమును బొందు సతిమేను గౌఁగిలించె."

(మను. 6-8)

అను పద్యమును చూచియే కూచిమంచి తిమ్మకవి తన 'నీలాసుందరీపరిణయము'న నీ పద్యమును వ్రాసియుండు నని ఊహింపవచ్చును—

"తెలిముత్తియపుసరుల్ దిద్దునెపంబున
గిబ్బచన్బొగడలఁ గేలఁ జెనకి,
చెవులకమ్మలు చక్కఁజేయుజాడల ముద్దు
చిప్పల నిద్దంపుఁజెక్కు లంటి,
మొలనూలు సవరించువలనుగఁ గన్పట్టి
వలుదపిరుందుఁ బొక్కిలియు నిమిరి,
కపురంపువిడె మొసంగఁగఁ బోవులాగున
మొనసి చక్కెరమోవి ముద్దులాడి,

పువ్వుటెత్తులు దుటిమెడిపాలు పెలర్పఁ
గప్పుమీఱిన బలితంపుఁ గొప్పు ముట్టి,
మెల్లమెల్లన యొక్కింత మెలఁగ, డెంద
మించువిలుకానిచెయ్యువ్వాల కియ్యకొల్పి."

(నీలా. 3-103)

ఈ రీతిగా పెద్దన తరువాతి ప్రబంధ కవులలో పెక్కురు, ఈతని శయ్యాసౌభాగ్య-వర్ణనానైపుణ్యాదులను తమ ప్రబంధములలో ననుకరించి, ఇతనిపై తమకు గల గౌరవాదరముల వెల్లడించి తృప్తులైరి.

శ్రీకృష్ణదేవరాయల యాస్థానములో బహుభాషా పండితు లున్నను, పెద్దన వారికెల్ల శిరోభూషణముగ వెలుగొందెను. ఇతని కవితామాధుర్యము నకు ముగ్ధుడైన రాయలు, అందరికంటె మిన్నగ నీ కవిని గౌరవించుచు, ప్రతివత్సరము జరుగు వసంతోత్సవములలో నా యా కవులు ప్రబంధముల రచించి, రాజున కంకిత మిచ్చుచుండగా, పెద్దన కాతడే కర్పూర తాంబూల మిచ్చి, స్వారోచిషమనుసంభవకృతి నంకిత మొసగు మని ప్రార్థించెను. పెద్దనయు తన యద్వితీయ ప్రతిభావ్యుత్పత్తులతో, శిరీషకుసుమపేశల సుధామయోక్తుల దానిని రచించి, ప్రబంధమునకు చక్కని రూపము కల్పించి, కృష్ణదేవరాయలు తన కిచ్చిన ఆంధ్రకవితా పితామహ బిరుదమును సార్థక పరచెను.

# నందితిమ్మన

సాహితీసమరాంగణముల రెండింటను అసహాయశూరుడై, సాటి లేని ఖ్యాతి నార్జించిన శ్రీకృష్ణదేవరాయల భువనవిజయ సభాభవనము నలంకరించిన అష్టదిగ్గజములలో, ఆంధ్రకవితాపితామహుని తర్వాత, అంతటి కీర్తిపరుడైన కవివతంసుడు నందితిమ్మన. ఆంధ్ర పంచ మహాకావ్యములలో నొక్కటి యగు రసవత్ప్రబంధము - 'పారిజాతాపహరణము' ఈతని కృతి. హృదయలాలిత్యము, మృదుసంస్కారము, సాధుస్వభావ మీతనికి సహజ గుణములై యుండును. కావుననే 'పారిజాతాపహరణ' కావ్య మొక లలిత మధుర రసఖండముగా, అనల్ప శిల్పకళామూర్తిగా, అనుపమ సాహితీ సుమముగా రూపొంది, తన దివ్యసౌరభములతో ఆంధ్రసారస్వతోద్యాన మును గుబాళింపజేసినది.

వినయసంపన్నత, ఆత్మశ్లాఘావిముఖత నిండారిన సాత్విక మూర్తి యగుటచే నీతడు కావ్యాంతముననే తన గోత్రనామాదుల నిట్లు మితముగా పేర్కొనెను —

"కౌశికగోత్రవిఖ్యాతుఁ, డాపస్తంబ
సూత్రుఁ, డార్వేలపవిత్రకులుఁడు,
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు, సకలవిద్యావివేక
చతురుఁడు, మలయమారుత కవీంద్రునకు మే
నల్లుండు, కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధ ఘనచతురంతయా
న మహాగ్రహార సన్మానయుతుఁడు,

తిమ్మయార్యుండు, శివపరాధీనమతి, య
ఘోరశివగురుశిష్యుండు, పారిజాత
హరణ మను కావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ.''

(పారి. 5-108)

కావ్యసంప్రదాయసిద్ధముగా పరిచితములైన కృతిప్రాశస్త్యాదిక వర్ణనము, కృతికర్తృకీర్తనము, సుకవిస్తుతి, కుకవినిందలు ఈ కావ్యమున కానరావు. కృతిపతివంశవర్ణనాదికమును మేర మీరని పరిధులలో నిర్వహింప బడినది.

'అనౌచిత్యాద్ ఋతే నాన్యత్ రసభంగస్య కారణమ్' (ధ్వన్యా. 3-330) అను ధ్వన్యాచార్యునిసూక్తి నీతడు తన గ్రంథమున నాద్యంతము పాటించెను. కేవలము పండితామోదము బడయుటకై చిత్ర-బంధ-కవిత్వముల నీతడు సృజించినను, రసనిర్వహణము, నాటకీయసంవిధానము, మధుర పదగుంఫనము, విస్మయావహములై మదిమెచ్చుల మైమరపించు వర్ణనములును అనన్యాదృశములై, పారిజాతాపహరణ మొక విశిష్టసుందరప్రబంధముగా ఘనతకెక్కినది.

తేనెలు వాకలుగట్టినట్లు, వెన్నెలసోనలు గురిసినట్లు, ముత్తెపుసరులు కదలినట్లు, తెలిమంచుబొట్లు విరిసినట్లు సాగిన తిమ్మనకవితాధార 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' అను ప్రశస్తికి హేతువైనది.

ముక్కుతిమ్మన యను పేరీ కవికి ఆతని జీవితకాలము నుండియే వ్యవహారప్రసిద్ధమైన ట్లున్నది. ఒకానొక రమణీమణి సుందర నాసికను చూచి ముగ్ధుడైన తిమ్మన——

"నానాసూనవితానవాసనల నా
　　నందించు సారంగ మే
లా న న్నొల్ల దటంచు గంధఫలి బ
　　ల్కాఁకం దపం బంది, యో
షానాసాకృతిఁ బూని, సర్వసుమన
　　స్స్వారజ్యసంవాసమై,
పూనెం బ్రేక్షణమాలికామధుకరీ
　　పుంజంబు లిర్వంకలన్."

(వసు. 2-47)

అను పద్యమును వ్రాసె నట. దాని రచనా సౌందర్యమునకు ముచ్చటపడిన రామరాజభూషణు డా పద్యమును విలిచికొని, తన 'వసుచరిత్ర' కావ్యమున కూర్చుకొనెననియు, ఆ పద్యకర్తగా తిమ్మనకు 'ముక్కు తిమ్మన' యను పే రేర్పడిన దనియు జనశ్రుతి గలదు. ప్రత్యవయవవర్ణనము తిమ్మన ప్రకృతికి సహజమైనది కాదు. రామరాజభూషణు డట్టి వర్ణనమున మక్కువ గలవాడు. కావున ఈ పద్యరచనవలనగాక, ఏదియో ప్రత్యేకత గల ముక్కుండుట చేతనే అట్టి వ్యవహార మేర్పడి యుండవచ్చును.

ఈ కావ్యమునందలి ఇతివృత్తము సర్వసాధారణ మగు కుటుంబ గాథయగుట, కథ నాటకీయశైలిలో నడచుట, ఇందలి నాయికానాయకులు హిమాలయరత్నకందరములలో ఆకస్మికముగా కలసిన వరూధినీ-ప్రవ రాఖ్యులవంటివారో, క్రీడాశైలపుకోనలలో విహారవశమున కలసిన గిరికా-వసురాజులవంటివారో కాక, లోకసాధారణులై యుండుట - అను నీ కారణ ములచేత ఈ కావ్యము సర్వజనసమాదరణము నొంది, బహుళప్రచారమునంది

యున్నది. సత్యాకృష్ణుల సాంసారిక ప్రణయము లోకప్రసిద్ధము, జనప్రియము నైనది.

దశావతారములలో - బాల్యక్రీడలతోను, శృంగారలీలావినోదములతోను, ఎల్లర మనముల చూరగొని, కంస-శిశుపాలాది దుష్టజన మర్దనముతో లోకహితము నాపాదించి, గీతాచార్యుడై కర్తవ్యము నుద్బోధించి, మానసిక వికాసమును సమకూర్చిన శ్రీకృష్ణుడే, నిత్యజీవితమున సర్వులకును సన్నిహితుడైనవాడు. ఇట్టి కృష్ణుని లీలావినోదములలో పారిజాతాపహరణ మొకటియై యుండుటయు, ఈ కావ్యప్రశస్తికిని, తత్ప్రచారమునకును ప్రముఖ కారణమై యున్నది.

తిమ్మన పారిజాతాపహరణ వృత్తాంతమును కావ్యేతివృత్తముగా నెన్నుకొనుటలో కృష్ణరాయల యంతఃపుర రహస్య వృత్తాంత మొకటి కారణ మని ఒక కథ ప్రచారమున నున్నది.

శ్రీకృష్ణరాయల దేవేరులలో తిరుమలదేవియు, చిన్నాదేవియు ఆతనికి ప్రియము గూర్చు సతులు. తొలివయసు వలపుపొంగులో రాయలకు లభించిన అనర్ఘ నారీరత్నము చిన్నాదేవి. కులమునకు వెలయాలైనను, గుణమున నిష్కళంకమగు మౌక్తికమగుటచే రాయ లీమెను దేవేరిగా పరిగ్రహించెను. సద్వంశ సంజాతయైన తిరుమలదేవి రాజకులోచితముగా పట్టపురాణియైనది. ఇరువురును సౌందర్యాధిదేవతలే; సౌశీల్యమూర్తులే; తమనాథుని ప్రాణాధికముగ ప్రేమించుచుండువారే. రసికశేఖరుడగు రాయలును తన ప్రణయ సామ్రాజ్య సింహాసనమున, ఇరువురకును సమానస్థానమునే యొసగెను. తిరుమలదేవి వినయవతియైనను, ఆభిజాత్యకృతమగు అహంకారముతో, చిన్నాదేవికి సముచితగౌరవము నీయకుండుటచేత నా యిరువుర నడుమ రవరవ లేర్పడినవి. రాయలు వీరివై మనస్యమును గుర్తించియు, అది స్త్రీసహజ

మగుటచేతను, మేర దప్పకుండుటచేతను గంభీరముగ మిన్నకుండెను. సమ విభక్తమగు అతని ప్రగాఢానురాగములో ఈ నెరసు అణగిపోయినది.

ఒకనాటి రాత్రి తిరుమలదేవి వల్లభునికొరకై ఎదురుచూచి, అలసి పోయి, తలవైపు కాళ్ళిడుకొని, నిదురించినది. రాజ్యవ్యవహారములలో నిమగ్నుడైన రాయలు సకాలమున నంతఃపురమునకు చేరలేకపోయెను. ఎట్టకేలకు ప్రియసతి నిరీక్షించుచుండు నను భావముతో రాయలు వేగిరపడి వచ్చి, నిద్రావస్థలోని ఆ రమణి ముగ్ధమనోహర సౌందర్యమును గాంచి పర వశించియు, నిద్రాభంగ మొనరింపక, తలగడపై శిర మిడి పరుండెను. నిదు రలో కదలిన రాణిపాదము రాయల శిరమునకు తగిలినది. తా నాలసించి నందున కుపితయై, అన్యథాభావముతో, ఉద్దేశ్యపూర్వకముగనే తన నట్లు పరాభవించెనను అపోహతో నాడు వెడలిన రాజు, మరల నామెయంతఃపురము నకు చేరనేలేదు. నిద్రావశమున గావింపబడిన యపరాధమునకు తిరస్కృత యైన తిరుమలదేవి సంతాపమునకు మేరయే లేదు.

తిరుమలదేవి యరణపుకవి యగు తిమ్మన కీ రహస్య మెట్లో తెలిసి నది. ఆమె స్వభావము అతని కెరుకయే. రాయలవంటి చతురుడు, సరసుడు, పరమవివేకియు నగు దక్షిణనాయకుడు కారణాభాసమును చూచి, ఇట్టి భ్రాంతి కిని, అపోహకును లోనయ్యెనే యనియు, స్వచ్ఛహృదయ యగు దేవిని నొప్పించెనే యనియు ఆ కవి తల్లడిల్లెను. అన్యాపదేశముగా సత్యమును రాయలకు స్ఫురింపజేయుచు, కర్తవ్యోపదేశము జేసి, తిరుమలదేవి మనస్సం తాపమును తొలగింపదలచెను. కవి గాన, కాంతాసమ్మిత మగు కావ్యమే దీనికి తగిన సాధనము కాగల దని భావించిన తిమ్మన, సంస్కృతహరి వంశమునందలి పారిజాతాపహరణ వృత్తాంతమును కథావస్తువుగా గ్రహించి, అనుకూలములగు మార్పులను చేసి, ప్రబంధమును నిర్మించి, రాయలకు

వినిపించెను. ఆ ముద్దుపలుకులకు మురిసి, తన్మయుడైన రాయలు సావధానుడై విని, తత్త్వము నెరిగి, ప్రసన్నుడై, తిరుమలదేవిని యథాపూర్వముగా సంభావించెను. ఇది లోక ప్రచారములో నున్న కథ.

తిమ్మన కావ్యనిర్వహణ పద్ధతిని పరిశీలించినచో, నీ యంశములను నిరూపించు ఉపపత్తులు కొన్ని కానవగును.

కావ్యారంభములోని ప్రార్ధనపద్యములలో అంతఃపురవృత్తాంతమును కవి విస్పష్టముగనే సూచించెను.

"పాలఁతుల్ గౌఁగిట గ్రుచ్చియెత్త తలఁబ్రా
లొయ్యించు నవ్వేళ నౌఁ
దల గంగం దననీడఁ దాన కని మా
ర్గ్యం బొప్ప వేఱొక్క తొ
య్యలి యంచు న్మది నెంచు పార్వతి యసూ
యావాప్తికి న్నవ్వు క్రొ
న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి సం
ధించు న్మహైశ్వర్యముల్."

(పారి. పీఠిక-2)

ఈ మహేశ్వర ప్రార్ధనములోని పార్వతియసూయ ప్రకృతకధలోని రుక్మిణీ సత్యభామల సపత్నీమాత్సర్యమునకు సూచకమైనట్లు, చిన్నాదేవీ - తిరుమలా దేవుల యసూయకును సూచకము.

"సరసపుటల్కఁ దీర్చుతఱి
శార్ఙ్గ-సుదర్శన-నంద-కాబ్జ-సం
భరణగుణాప్తి నెన్నడుము
పైఁ, గటిపై, జడపై, గళంబుపై
హరినలుగేలఁ బైకొన సు
ఖాంబుధి నిచ్చలు నోలలాడు నిం
దిర కృపఁజూచుఁగాత నర
దేవశిఖామణిఁ గృష్ణరాయనిన్."

(పారి. పీఠిక-4)

ఈ పద్యములోని లక్ష్మీదేవి ప్రణయకోపమును హరి తొలగించి, ఆమెను సంతసింపజేసె ననునది-ప్రకృతకథలో కృష్ణకర్తృక సత్యభామాసాంత్వనము జరుగనున్న దనుదానిని సూచించుచున్నట్లే, తిరుమలదేవీ ప్రణయదుఃఖమును కృష్ణదేవరాయలు తొలగించి, సంతసింపజేయగల డనుదానిని కూడా సూచించుచున్నది.

రాయల యంతఃపురవృత్తాంతమును సరిగా పోలియుండుటకై యే, తిమ్మన, పురచాతుర్వర్ణ్యాది వర్ణనములతో కావ్యమును ప్రారంభించు సంప్రదాయమును కాదని,

"కులమును, రూపము, న్మగని
కూరిమియుం గలదాన నంచు నీ
వల నల రుక్మిణీరమణి
వాసిఁ జెలంగఁగ, సత్యభామయుం

గులమును, రూపము న్మగని
కూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా, రవర
వ ల్వాడమె న్మది వారి కెంతయున్.''
(పారి. 1-42)

అని రుక్మిణీ - సత్యభామల రవరవలతోనే కథ నారంభించెను.

నారదుడు పారిజాతకుసుమ ప్రభావమును వర్ణించుతరి ''హరిబహిః ప్రాణంబ వగుట నే డెరుగంగవచ్చె నీ కిపు డిది యిచ్చెగాన'' అని రుక్మిణిని కృష్ణునకు బహిఃప్రాణ మని కొనియాడెను. రాయలకు చిన్నాదేవి బహిః ప్రాణమే. చతుర్థాశ్వాసాదిమ పద్యమున కవి, రాయలను 'చిన్నమదేవీ జీవిత నాయక' యని సంబోధించుటతో, రుక్మిణీ-కృష్ణులవలె, చిన్నాదేవీ-శ్రీకృష్ణ రాయలు పరస్పరము బహిఃప్రాణముగా భావించుకొనుచుండిరని విశద మగును. ఇట్లు చిన్నమదేవిని రుక్మిణీతుల్యనుగా సూచించినట్లే, తిమ్మన, పాదతాడన వ్యవహారముతో తిరుమలదేవిని సత్యాతుల్యనుగా సూచించెను.

ఈ కావ్యమున రుక్మిణి పారిజాత ప్రదాన ఘట్టమున మాత్రము మనకు కనుపించును. పుణ్యకవ్రత సందర్భమున నామె కృతక వికాసముతో విచ్చేసినట్లు సూచింపబడినది. అప్పటున నామెకు ప్రత్యేక స్థాన మేమియు లేదు. సత్యభామయే వ్రత మాచరించునది గాన, సర్వత్ర ఆమెయే గోచ రించును. చతుర్థాశ్వాసాదిమ పద్యములో 'చిన్నమదేవీ జీవితనాయక' అను నప్పుడు మాత్రమే చిన్నాదేవి గుర్తింపబడినది. ద్వితీయ - పంచమాశ్వాసము లలో 'తిరుమలదేవీ వల్లభ' 'తిరుమలదేవీ హృదయేశ' అని తిరుమలదేవి సూచింపబడినది. ఈమెయే సత్యభామయై కావ్యమం దంతట భాసించును. ఈ

విధముగా కవి చిన్నమదేవీ - తిరుమలదేవులను రుక్మిణీ - సత్యభామలుగనే చిత్రించెనని అవగతమగుచున్నది.

ఈ ప్రబంధములోని శ్రీకృష్ణుడు కృష్ణరాయలే. ఇరువురును యాదవ వంశ సంజాతులే; దక్షిణ నాయకులే, పీఠికలోని ఈ క్రింది పద్యములో రాయలకు శ్రీకృష్ణునితో నభేదము వర్ణింపబడినది—

"యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
    సింహాసనస్థుఁడై చెన్ను మెఱయ,
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁజేసి
    పరకామినీసహోదరతఁ జూప,
మఱి జరాసుతునకై మథుర డించుటఁజెసి
    పరవర్గదుర్గము ల్బలిమిఁ గొనఁగఁ,
బారిజాతము నాసపడి పట్టితెచ్చుట
    నౌదార్యమున దాని నడుగువఱుపఁ

గోరి, తొలుమేనఁ దనకైన కొదవలెల్ల
మాన్పుకొన వచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుఁడౌ ననఁగ మించె
నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు."

(పారి. పీఠిక-17)

తొలుమేన తనకైన కొదవల నెల్ల మాన్పుకొన వచ్చిన శ్రీకృష్ణుడే యట కృష్ణరాయలు. అసంఖ్యాకలగు వల్లవీరమణులకు తన ప్రేమామృత

మును సమముగా పంచియిచ్చి, వారలతో సవిలాసముగా క్రీడించిన ప్రేమైక మూర్తి శ్రీకృష్ణుడు. సత్యమును గ్రహింపనేరక, అనురాగ స్వరూపిణి యగు తిరుమలదేవిపై నాగ్రహించి, ఆమెను ప్రణయవంచితను జేసి, ఆ యవతారమున లేని కొదవను కూడ ఈ యవతారమున తెచ్చికొనుట యుక్తమా? యని ఇచట రాయల కెత్తిపొడుపు కలదు.

కృతిపతి వర్ణనముతో నాతని దేవేరులను కూడ పేర్కొనుచుండుట కవులకు పరిపాటి. మనుచరిత్రమున చిన్నాదేవియు, తిరుమలదేవియు రాయలకు కూర్చు దేవేరులుగా నుండిరని వర్ణింపబడినది. (మను. 1-33.) తిమ్మన కృతిపతి వర్ణన సందర్భమున రాయల దేవేరులను పేర్కొనలేదు. రాయల కత్యంత ప్రియతమలగు సతులలో తిరుమలదేవి ఇప్పు డాతనికి చేరరానిదయ్యెను. రాగమయియగు ఆ దేవి హృదయమునే గురుతింపలేని యరసికునికి దేవేరులతో పని యే మని, సాభిప్రాయముగనే కవి వారి ప్రశంసను ఈ కావ్యమున మానెనేమో? దీనిని రాయలు గ్రహింపగలడనియే కవి యుద్దేశ్యము కావచ్చును.

ఇట్లే ప్రధానకథా ప్రారంభోపసంహారములు రెండింటిలోను రాయలకు హెచ్చరిక యున్నది. శ్రీకృష్ణుడు రుక్మిణ్యాద్యష్ట మహిషులనే గాక, పదియారువేవుర యచ్చరకొలంబు లలనామణులను కూడ, వా రే యే లీలల గోరుదురో, ఆ యా లీలల దేల్చి, తాను సౌఖ్యాబ్ధి నోలలాడుచుండెనట. ఆ యవతారమున నట్లుండియు, ఈ యవతారమున కొలదిమంది ప్రియురాండ్రనే సంభావింపలేక యున్నావే? యని ఇచట గల వ్యంగ్య పరిహాసము 'రాయల హృదయమును తాకియే యుండును.

"చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
చెలఁగి ధర్మక్రమస్థితి పటించె,
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాఁడును నేఁడు
గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱచె,
సాధుబృందావనసరణి నాఁడును నేఁడు
వంశానురాగంబు వదలఁడయ్యె,
సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు
నాకల్ప మవని నింపార నిలిపె,

నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
జననమందెను వసుదేవమనుజవిభుని
కృష్ణుఁ డను పేర నరసేంద్రు కృష్ణదేవ
రాయఁ డను పేర నాదినారాయణుండు."

(పారి. పీఠిక-19)

ఈ పద్యమున 'సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు' కృష్ణదేవ రాయలకు కలదని వర్ణింపబడినది. ఈనాడు అనురాగ వశంవదుడై చిన్నమ దేవిని రాయలు దేవేరిగా స్వీకరించినను, ఆమె సద్వంశసంజాత కాదు. తిరుమలదేవియే ఆభిజాత్యాది కారణములగను, యజ్ఞ యాగాద్యన్వయ యోగ్యత మూలమునను ధర్మదార యగుచున్నది. ఉద్వాహ సమయమున 'ధర్మే చార్థే చ కామే చ భవా న్నాతిచరే దిమామ్'అని కన్యాదాత ప్రార్థింప, కన్యాస్వీకర్త యైన వరుడు 'నాతిచరామి' యని మూడుమారులు ప్రమాణము చేయును. 'ధర్మాయ త్వా గృహ్ణామి; కామాయ త్వా గృహ్ణామి, సంతత్యై త్వా గృహ్ణామి' అని ప్రతిజ్ఞాపూర్వకముగా కన్యను ప్రతిగ్రహించును. కాన నిట్లు సత్యప్రతిజ్ఞా

గృహీతయగు భామ తిరుమలదేవియే యగును. చిన్నమదేవి పాణిగృహీతయే. సత్యభామావరావతారయు, కులసతియు నగు సత్యభామా (తిరుమలదేవీ) భోగ స_క్తి నీ కిప్పుడును లభించియుండ, నిర్హేతుక కాఠిన్యమున నద్దానిని జారవిడ చుట భావ్యము కాదని రాయలకు మరియొక హెచ్చరిక ఇచట కలదు.

రవరవలతో ప్రారంభమైన సత్యభామకథలో, పారిజాత వృక్షమునే తెచ్చి యిత్తు నని శ్రీకృష్ణుడు అనునయించుటతో ప్రథమాశ్వాసకథ పూ_ర్తి యగుచున్నది. ఈ ఘట్టముతోనే తిమ్మన శ్రీకృష్ణదేవరాయలకు సముచిత సందేశము నిచ్చెను. దానిని సుస్పష్ట మొనరించుటకై యే ప్రథమాశ్వాసాంత మున 'అంతఃపుర వధూప్రసాదనరసికా' (1-139) అని రాయలను సంబో ధించెను. తరువాతి పద్యమున 'ప్రసృతివిలోచనాకుసుమబాణ' (1-140) యను సంబోధన మున్నది. ఇచటి విశాలాక్షులు చిన్నమ తిరుమల దేవులే. వారిరువురకును ఈతడే కుసుమబాణు డనుటతో ఇరువురును తుల్యాను రాగలే యని వ్య_క్తమగుచున్నది. సత్య నిజముగా సాపరాధయే యైనను శ్రీకృష్ణు డోదార్చెను. తిరుమలదేవి నిద్రావస్థలో తెలియక, అపరాధ మొనర్చి నది. సాపరాధయగు సత్యభామ దుస్సాధ మగు వస్తువునే కోరినను, వెను కాడక, కృష్ణుడు తత్సాధనకై పూనుకొనగా, అట్టి దుష్కరకార్యము నేమియు కోరక, కేవలప్రియానురాగమునే కాంక్షించిన తిరుమలదేవిని మన్నింపనేరవా? యని కవి, రాయలకు క_ర్తవ్యము నుపదేశించెను.

రుక్మిణీదేవిప్రేమవలె చిన్నమదేవిప్రేమ ప్రశాంతమైనది. సత్య ప్రేమవలె తిరుమలదేవిప్రేమ స్వచ్ఛమైనను, సాహంకారమైనదే. అయి నను ఇంతకాల మామె రాయలకు పరమప్రియమును కూర్చు హృదయేశ్వరి గనే యుండినది. అట్టి ఆమెప్రేమపూర్ణహృదయమును గుర్తించి, ఆద రింపగల దయాభావ మిపుడు కొరవడెనా? యని ప్రశ్నించునట్లే 'తిరుమల

దేవీవల్లభ, కరుణామయహృదయ' (2-105) అని కవి రాయలను సంబో ధించియున్నాడు.

తృతీయాశ్వాసాదిలో 'రామాపాంచాల' యను సంబోధన మున్నది. పాంచాలుడు, కూచిమారుడు, భద్రుడు, దత్తుడు అను చతుర్విధపురుషజాతు లలో పాంచాలుడు ఉత్తముడు, ఏకపత్నీవ్రతుడు. కృష్ణరాయలు బహు పత్నీకుడైనను, ఒక్కొక్క ప్రేయసియు, ఏకపత్నీవ్రతునివలె తన ప్రియుడు తనను ప్రేమించుచున్నాడని భావించుచుండె నని దీని భావము. ఇట్టి నీవు తిరుమలదేవిని అలక్ష్యముచేయదగునా' యని పై సంబోధన ముతో కవి రాయలను ప్రశ్నించెను.

పంచమాశ్వాస ప్రారంభపద్యమున కవి రాయలను 'తిరుమలదేవీ హృదయేశ' యని సంబోధించెను. ఇట్టి నిరాదరణమునకు గురియైనను, ఇప్పటికిని, ఎప్పటికిని తిరుమలదేవి రాయలనే హృదయేశునిగా నమ్మియున్న దని రాణిహృదయమును రాజున కెరుకపరచెను.

"కువలయనేత్ర, తొంటి తన
కోపము, గర్వము, మత్సరంబు మా
ని, వినయముం, బ్రమోదమును
నిండి తొలంకెడు నెమ్మనంబునన్
సవతులయిండ్ల కెల్లఁ దొలు
నాఁడు క్రమంబున నేగి, తద్ద్వతో
త్సవమున కామతించి, యతి
సంభ్రమలీలలఁ దోడితేఁ దగున్."

(పారి. 5-57)

ఈ పద్యములో, పూర్వ మున్న కోపము, గర్వము, మత్సరము తొలగి, వినయము, ప్రమోదము నిండి తొలకు నెమ్మన ముండిననే, పతిపూర్ణాను రాగము లభించి, సుఖమును పొందగల వని తిరుమలదేవికిని తిమ్మన చక్కని యుపదేశమును చేసెను. సత్యవలె తిరుమలదేవియు మత్సరము వీడి, సవతు లను సంభావించు హృదయవైశాల్యము నలవరచికొనియుండును.

"భోజకన్యాసరిద్రాజహంసము, సత్య
భామాశుకీకేళిపంజరంబు,
జాంబవతీనిశాచంద్రోదయంబు, కా
ళిందీసరోజినీందిందిరంబు,
భద్రాకలాపినీప్రావృడంబుదము, సు
దంతారసాలలతాపికంబు,
మిత్రవిందావనీచైత్రాగమము, లక్ష
ణాహారయష్టికానాయకంబు,

షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ, సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు."

(పారి. 5-107)

కథాచరమ భాగమునందలి, పై పద్యములో అఖిలావనైకవర్తిష్ణు డగుచు శ్రీకృష్ణుడు సౌఖ్యాంబునిధి నోలలాడుచుండె ననుటతో, కృష్ణదేవరాయల

యంతరంగము పశ్చాత్తాపముచే విశుద్ధమై, తిరుమలదేవిని పూర్వసమ్మాన ముతో సంభావించె నని కవి తెలియజేసెను. కావుననే కావ్యాంతమున మంగళమహాశ్రీవృత్తములో 'నిర్భరదయారసపయోధీ' యని సంబోధించి, రాయలదయార్ద్రభావ మిప్పటికి పరిపూర్ణమై, ఆనందదాయకమైన దని, తన మోదమును ప్రకటించెను. ప్రభుదంపతులు ప్రేమైకజీవులై సర్వమంగళముల బడసి రనియు ఇందు సూచితము.

పంచమాశ్వాస పద్యసంఖ్య ఏకాదశోత్తర శతము. ఏక సంఖ్యను ముమ్మారు లిఖించిన ఈ సంఖ్య యేర్పడును. తిరుమలదేవీ శ్రీకృష్ణదేవ రాయలు, ముమ్మాటికిని ఏకహృదయు లైరని సూచించుటకే, ఈ పరి మితితో, తిమ్మన చరమాశ్వాసమున పద్యముల లిఖించియుండును.

రాయలు కర్పూరతాంబూలముల నిచ్చి, తనకు కృతి సమర్పణము చేయు మని పెద్దనాదులను కోరినట్లు, తిమ్మకవిని కోరలేదు. ఈ కవియే కృతిని నిర్మించి, కృతిపతినిగా కృష్ణదేవరాయలను ఎన్నుకొని, ప్రబంధము నాతనికి వినిపించెను. ఇదియు పై యంశమునే ధ్రువపరచుచున్నది.

ఇట్లీ కవి రాజదంపతులమధ్య అల్పకారణముగా పొడసూపిన వైర స్యమును సున్నితముగ తొలగించి, వారిని అభిన్నహృదయుల నొనర్చు సదాశయముతోనే ఈ కావ్యరచనము చేసియుండు ననుటలో ఔచిత్య మెంతయేని కనబడును.

సంస్కృత హరివంశములో పంద్రెండధ్యాయములలో విపులముగా నున్న పారిజాతాపహరణ గాథను గ్రహించి, తిమ్మన అయిదాశ్వాసముల లలిత మధుర ప్రబంధముగా తీర్చి దిద్దెను. ఔచితీపరిపాలనమునకు, రస-

భావ-పాత్రాదుల పోషణమునకును, ఇతడు మూలకథలో ననేకములగు మార్పులను గావించెను.

సంస్కృత హరివంశమున—వ్రతోద్యాపనోత్సవము చేసికొను రుక్మిణికి శ్రీ కృష్ణుడే పారిజాతము నివ్వగా, ఉత్సవమున కేతెంచిన నారదుడు రుక్మిణిని స్తుతించి, సత్యను తూలనాడె నని కలదు. తిమ్మన కావ్యమున—దేవలోకమునుండి తెచ్చిన పారిజాతమును శ్రీకృష్ణునిచేతి కిచ్చి, నారదుడు కనుసన్నలతో రుక్మిణి కిప్పించిన ట్లున్నది. కలహాశను డీ సూచనముద్వారా కలహబీజమును నాటెను. ముందే రవరవలతో నుండు రుక్మిణీ—సత్యభామలమధ్య ఈ బీజమే చక్కగా విస్తరించిన దని వర్ణించుటతో కథాసంవిధానమునకును, పాత్రల పోషణమునకును చక్కని యవకాశ మేర్పడినది.

కోపసదనమున నున్న సత్యను కృష్ణు డనునయింప, భర్త యను మతి లేనిదే తపఃఫలము సిద్ధింపదు గాన, తప మొనర్చుకొన ననుజ్ఞ ఇమ్మని ఆమె శ్రీకృష్ణుని ప్రార్థించినట్లు, సంస్కృత హరివంశమున కలదు. తిమ్మన ఇచ్చట సాహసోపేత మగు మార్పును చేసి, సత్యాసాంత్వన ఘట్టమున కొక మనోజ్ఞ రూపకల్పన చేసెను. కృష్ణు డోదార్పగా తిమ్మనసత్య చేత నున్న లీలాకమలముతో కొట్ట నుంకించి, జంకించినది. ఆగ్రహమును, అవమానమును నిగ్రహించుకొనలేక, వామపాదముతో నాథుని శిరమును తొలగద్రోచినది. చివరకు శోకమును సైపజాలక, దీనయై విలపించినది. కాని శ్రీకృష్ణు డా తాపును మన్ననగనే భావించెను. ప్రేయసీపదహతితో, ఆతని దేహమున పులక లేర్పడగా, అవి గ్రుచ్చుకొని, ఆమె పదపల్లవము నొచ్చిన దేమో యని వగచుచు, 'ఒక్క పారిజాత ప్రసూనమునకై నీ వింత కుంద నేల? ఆ వృక్షమునే నీ పెరటి చెట్టుగ నాటింతు' నని వాగ్దానము చేసెను.

ఈ మార్పుతో ఈ సన్నివేశము మనోరంజక మగుటయేకాక, రసభావ పాత్రాదులకు పుష్టియు సమకూరినది. తిమ్మన యభీప్సితార్థసిద్ధికి ఈ మార్పే పరాకాష్ఠ.

శ్రీకృష్ణుడు నారదుని ద్వారా, పారిజాతవృక్షము నిమ్మనియు, లేకున్న శచీవ్యామృదితానులేపన మగు వక్షస్స్థలమున గదాప్రహార మొనర్తు ననియు ఇంద్రునికి సందేశ మంపును. యుద్ధముననే పారిజాత తరు వ్యవహారము నిర్ణయింపబడగలదని ఇంద్రు డాతని మూలముననే ప్రతిసందేశ మంపును. శ్రీకృష్ణుడు పారియాత్రాచలమున శివుని గూర్చి తప మొనరించి, వరముల బడసి, ఇంద్రునితో యుద్ధమునకు తలపడెను. బ్రహ్మ పనుపున అదితి - కశ్యపులు లోకభీకరమగు వారి యుద్ధము నాపి, పారిజాతవృక్షమును సత్య కిప్పించిరి - అని సంస్కృత హరివంశములో నున్నది. మహేశుని వరములతో ఇంద్రుని జయింపగల్గుట, అదితి యనుగ్రహమున పారిజాతమును పొందుట యనునవి కథానాయకుడగు శ్రీకృష్ణునికి న్యూనత నాపాదింపగలవని భావించి, తిమ్మన ఇచట కథను మార్చెను. ఈ కావ్యమున, నరకు డపహరించిన కుండలముల నిచ్చుటకై అదితిసన్నిధానమునకు శ్రీకృష్ణుడే సత్యాసమేతుడై వెడలును. స్వర్గమునుండి మరలి వచ్చునప్పుడు పారిజాతమును పెకలించుకొని వచ్చుచుండగా, శ్రీకృష్ణేంద్రులకు సమరము సంభవించెను. పరాజితుడైన ఇంద్రుడు శరణాగతుడై, దేవనగమును సమర్పించుకొనెను. ఈ ఘట్టమున తిమ్మన కథను మలచిన తీరు, సత్యాకృష్ణుల పాత్ర పోషణమునకు ఎంతయు తోడ్పడి, ఔచిత్యమును సంతరించుకొనినది.

నిరహంకారము, నిష్కళంకము నగు ప్రణయతత్త్వమును సత్యకు (తిరుమలదేవికిని) బోధించుట తిమ్మన పరమోద్దేశ్యము. అందువలన మూలమున సంగ్రహముగ నుండు పుణ్యకవ్రత విధానము నీతడు విపులముగ

వర్ణించెను. నారదుడే ఈ వ్రతాచరణమునకు సత్యను ప్రోత్సహించి, ఆచరింప జేసినట్లు కల్పించి, తిమ్మన ప్రధానరసమున కుపబలకముగ చతురము, పరిమితము నగు హాస్యమును కూడ, సమకూర్చి, ఘట్టమును రసవంత మొనర్చెను.

సుందర సుకుమారములు, లలిత మధురములు నగు పదజాలముతో పద్యమాలికల కూర్చు కళానైపుణ్యము, ప్రసాదగుణ ప్రధానముగా నా యా వస్తు - భావాదులను వర్ణించు నేర్పు, ఉదాత్త శృంగారమును పోషించు దక్షత ఈ కవికి సహజసిద్ధము లగుటచే నీతని వర్ణనములు సౌమ్యములు, సరసములు నై, మనోహరములగు ఉపమా - ఉత్ప్రేక్షాద్యలంకారములతో నొప్పి, కావ్యామృతరసాస్వాదకులకు మోదము కలిగించును. ఈ కావ్యమున ప్రకృతి వర్ణనములను, వస్తువర్ణనములను, సన్నివేశ వర్ణనములను, పాత్రల మనోభావ వర్ణనములను ఈ కవి కడు చాతుర్యముతో నిర్వహించెను. ప్రబంధ లక్షణములలో ముఖ్యములగు అష్టాదశవర్ణనముల గావించుటలో కథాగమన నిరోధకములు, ఔచితీభంజకములును నగువాని నీతడు జాగరూకుడై పరిహరించెను. నాయికా నాయకుల అంగాంగ వర్ణనములు, పూర్వానురాగ-విరహవర్ణనములు, చంద్ర-మన్మథ-మలయమారుత దూషణములు, శైత్యోపచారములును ఈ కావ్యమున లేవు. ఇందలి నాయికానాయకులు కథా ప్రారంభము నాటికే వివాహితులగుటచేత పై వర్ణనముల కవకాశము లేకపోయినది. కృతకముగా కల్పించుట ఈ కవి స్వభావమునకు విరుద్ధము. ఆ యా సన్నివేశముల కుచితములు, సౌందర్యాపాదకములు నగు జలక్రీడ, సాయంకాలము, అంధకారము, నక్షత్రములు, చంద్ర-సూర్యోదయములు, మేరువు, నందనము, వైజయంతము మున్నగు వాని నీతడు అతిహృద్యముగా నభివర్ణించెను.

సాయంకాలమున దినకరుడు నిస్తేజస్కు డగుటయు, కాంతి దరిగి క్రమముగా చీకట్లు వ్యాపించుచుండుటయు, నీడలు దీర్ఘదీర్ఘములై పర్వ

చుండుటయు, పక్షుల కలకలారావములు ఎల్లెడల చెలరేగుటయు ప్రకృతి సహజములు. అట్టిసాయంసమయము నీ కవి హృదయంగమముగా నిట్లు వర్ణించెను-

"ఆయతతేజము ద్దఱఁగి,
యంబుజబాంధవుఁ డస్తసీమకుం
బోయినఁ జూచి, వేచిన త
మోవిభుఁ డంప, దినాంతయోధుఁ డీ
చాయఁ దదీయపత్నిఁ బెలు
చం బఁట నీడిచికొంచుఁ బోయెడుం,
గో యను మాడ్కి, నంతట శ
కుంతరవంబు సెలంగె నెల్లెడన్."

(పారి. 2-30)

అంబుజబాంధవుడు తేజోహీనుడగుటను పరికించి, అదనుకై వేచియున్న ఆతని శత్రువు—తమోవిభుడు, తన నమ్మిన బంటగు దినాంతయోధుని పంపగా, నాతడు శత్రుపత్నియగు ఛాయాదేవిని క్రింద పడవైచి, ఈడ్చుకొని పోవుచుండగా, నామె శకుంత రవముల రూపమున ఆక్రందన మొనరించినదట. తేజస్తిమిరములు పరస్పరవిరోధులగుట నాధారముగా జేసికొనిన ఈ శ్లేషమూలక రూపకోత్థాపితోత్ప్రేక్ష ఆహ్లాదజనక మనుట నిశ్చయము.

బహువిధోత్ప్రేక్షలతో ననేకవిధములుగా నుల్లేఖింపబడిన ఈ నక్షత్ర వర్ణనము, తిమ్మనభావనాపటిమకు నిదర్శనము—

"కార్కొన్న కటికిచీఁకటి మొగుల్మొత్తంబు
గురిసిన వడగండ్లగుంపు లనఁగఁ
గవజక్కవలు వాయఁ గరనాళములఁ జందు
రుం డూఁదు పటికంపుటుండ లనఁగ,
నెల్లెడ మిన్నేటియిసుమున నచ్చర
కొమ లిడ్డ వెన్నెలకుప్ప లనఁగఁ,
దెలివివెన్నెల వెండితీవెలు నిగిడించు
చవలుకమ్మచ్చుబెజ్జము లనంగ,
జగము గెల్వంగ దండెత్తు మగనిమీఁద
లీల రతి చల్లు దీవనంబ్రా లనంగ,
వేఁడివెలుఁగెండఁ గ్రాగిన విన్నుమేన
నెక్కొను చెమటబొట్లునాఁ జుక్క లమరె."

(పారి. 2-37)

వడగండ్ల గుంపులవలెను, పటికపుటుండలవలెను, వెన్నెల కుప్పలవలెను, కమ్మచ్చుబెజ్జములవలెను, దీవనబ్రాలవలెను, చెమటబొట్లవలెను నక్షత్రము లున్నవట!

చంద్రోదయమునకు పూర్వము, చంద్రకిరణములు నభోభాగమున వ్యాపించుచుండుటను మన మనుదినమును చూచుచునే యున్నాము. ఆ కిరణ ప్రసారము నీ కవి బహువిధముల సంభావనచేసి, రమ్యముగా వర్ణించెను—

"కెరలి చీఁకటిమ్రాను గెడపంగ నిక్కిన
సమయగజంబుదంతము లనంగఁ,
జదలుగేదఁగి తూర్పుతుదకొమ్మ నరవిరి
యై కానిపించు పూరేకు లనఁగఁ,
బొడుపుగుబ్బలి నెలపురిటింటి యిడుపునఁ
జరచిన గంధంపుఁజట్టు లనఁగ,
మరునిముందర బరాబరిసేయు కంచుకి
కులముచేతుల వెండిగుదె లనంగఁ,
గైరవములకు వెన్నెలనీరు పఱపఁ
బూని చేర్చిన పటికంపుదోను లనఁగఁ,
గ్రమముతో శీతకరమయూఖములు గగన
భాగమునఁ గొన్ని యల్లనఁ బ్రాఁకుదెంచె."

(పారి. 2-39)

గజదంతములుగను, కేతకీదళములుగను, సూతికాగృహభిత్తికలపై నద్దిన గందపుచారలుగను, కంచుకులచేతులలోని వెండిబెత్తములుగను, స్ఫటిక మయములగు నీటిగొట్టములుగను చంద్రకిరణముల నుత్ప్రేక్షించి, ఈతడు లేతవెన్నెలనిగ్గు నినుమడింప జేసి, చదువరులకు మానసోల్లాసమును కల్పించు చున్నాడు.

చంద్రబింబ మాకాశమున క్రమముగా పైపైకి వచ్చుటను తిమ్మన, అమృతవారాశినుండి పై కేతెంచు స్ఫాటికభాండముగా వర్ణించెను. చూడుడు—

"అమరు లమృతాంబునిధిలోని యమృతరసము,
వెండిచేరులఁ బటికంపుఁగుండ కట్టి,
చేఁదుకొనియెదరో నాఁగ, శీతరోచి
మెఱుఁగుమెయితోన యల్లన మిన్ను ప్రాఁకె."

(పారి. 2-40)

దేవతలు వెండిపగ్గములకు స్ఫటికపు కడవను కట్టి, అమృతసాగరములోని అమృతరసమును చేదుకొనుచున్నారో యనునట్లు చంద్రుడు పైపై కెగయుచుండె నట. చంద్రకిరణములు వెండి పగ్గములు, చంద్రుడు స్ఫాటికభాండము.

చకోరముల లీలలను వర్ణించుచు నీ కవి, వాని కాహారమగు పలురకముల వెన్నెలలను జానుతెనుగున సరసముగ నిట్లు వర్ణించెను—

"విరహులమై సోఁకి వేఁడియౌ వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి,
కలువపుప్పొళ్ళచేఁ గసమైన వెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి
చంద్రకాంతపునీట జాలైన వెన్నెల
ముదురువెన్నెల జుఱ్ఱఁబదను చేసి,
సతులమైపూఁతం బిసాళించు వెన్నెలఁ
దనుపువెన్నెల రసాయనము గూర్చి,

చిగురువిలుకానిజాతర సేయఁ బూని,
కొలముసాముల నందఱిఁ గూడఁబెట్టి,
వంతు గలయంగ బువ్వంపుబంతి విందు
పెట్టి రెలమిఁ జకోరపుఁబేరటాంద్రు."

(పారి. 2-49)

పండువెన్నెలలో సన్నని మంచు కురియును. ఆ తుషారపు తుంపురుల నీ కవి మనోమోహనముగా నిట్లుత్ప్రేక్షించెను—

"తారకాధీశుకిరణకదంబకంబు
చిలికెఁ బలుచని వలిపంపు జిలుఁగు మంచుఁ
గైరవశ్రీవధూకరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మిన సాత్త్వికస్వేద మనఁగ."

(పారి. 2-48)

శశాంకుడు, కుముదలక్ష్మి యను వధూపాణిగ్రహణము చేయుచున్నాడు. నవవధువగు ఆమెకు అననుభూతపూర్వమగు ప్రియకరస్పర్శముతో సాత్త్వికభావమగు చిరుచెమట ఏర్పడిన దట. అదియే చిరుమంచు!

ఉషోదయముననే పద్మములు వికసించుటయు, ఆకంఠము మధువును గ్రోలి, మత్తెక్కి, క్రిందటిరాత్రి పద్మకోశములలో బంధింపబడిన తుమ్మెదలు, వికచకమలములనుండి వెలికి వచ్చుచుండుటయు, ప్రకృతిలో అనుదినము కాననగు మనోహర దృశ్యమే. దీని నీతడు చిత్రముగా నుత్ప్రేక్షించుట నిట చూడవచ్చును—

"కమ్మకస్తురిగుళికలు తమ్మిలేమ
నిదురమంపునఁ బుక్కిట నించి, మేలు
కాంచి, వేకువ నుమిసెనాఁ గమలముకుళ
కోటరంబుల నెలదేఁటికొదమ లెగసె."

(పారి. 2-64)

పద్మలతాతరుణి,రాత్రి కమ్మని కస్తూరిమాత్రలను బుగ్గలో నుంచుకొని, నిదుర మైకమున నములకయే పరుండి, వేకువనే వాని నుమ్మివేసెనో యనునట్లు కమలముకుళములనుండి తుమ్మెదలు వెలువడి వచ్చినవట.

వైజయంతము చేరిన శ్రీకృష్ణుడు మాతృమూర్తియగు అదితిని సందర్శించెను. లోకమాతయు, పరమసాధ్వియు నగు ఆ పవిత్రమూర్తిని, ఆమె వైభవమును, తిమ్మన కన్నులకు కట్టినట్లు వర్ణించియుండుట నీ క్రింది పద్యములో చూడగలము—

"తొడలపైఁ జాఁచిన యడుగుఁ గెందమ్ముల
నొయ్యనఁ బౌలోమి యొత్తుచుండఁ,
బార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలు సెప్పఁ,
బనిఁబూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షికాంతలు సంచరింప,
వీజన-చామర-వీటీకరండాది
కములు దిక్పతిసతీగణము దాల్ప,

విమలచింతామణీమయవేదిమీఁదఁ,
గల్పకలతాంతకల్పితతల్పసీమ,
నధివసించిన నిఖిలలోకైకవంద్య,
నమరమౌక్తికశుక్తి, నయ్యదితిఁ గనియె."

(పారి. 3-24)

తిమ్మన చేసిన యుద్ధవర్ణన మంత రసవంతముగా నుండదు. ఇతని సాత్వికచిత్తవృత్తియే దీనికి కారణము కావచ్చును. ఇందు ఓజస్సుకంటె, ప్రసాదగుణమే ప్రముఖముగా కనుపించును. త్రిలోకాధిపతియగు దేవేంద్రునికిని, నరకాద్యనేకాసురసంహర్తయగు శ్రీకృష్ణునికిని జరిగిన యుద్ధము సర్వలోకభీకరమై యుండవలెను గదా! అట్టి భయంకర సన్నివేశమును తిమ్మన ఎంత ప్రశాంతముగా వర్ణించెనో చూడుడు-

"కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప,
నది శార్ఙ్గితేజంబునందు డిందెఁ,
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన,
నది యదూద్వహునూర్పునందు డిందె,
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప,
నది శౌరివలచూడ్కియందు డిందె,
నడరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయికొల్ప,
నది మురాంతకునాభియందు డిందెఁ,

బాకవమనముక్త పాశుపతాస్త్రంబు
హరినిబార్ధతనువునందు డించె,
నేమి సేయవచ్చు? నీశ్వరుం డఖిలాత్ముఁ,
డతని గెల్వఁ దనకు నలవి యగునె?"

(పారి. 5-30)

శ్రీకృష్ణుని జయింపగోరి, ఇంద్రుడు తనకడ నున్న మహాస్త్రముల నన్నింటిని ప్రయోగించెను. కాని, అన్నియు నిష్ఫలములే యైనవి. ఆత డఖిలాత్మకు డగుటచే నవి యన్నియు నాతనిలో శాంతముగా లయమైపోయినవి. అట్టి లోకనాయకునితో జరుగు సంగ్రామము ప్రశాంతముగాకాక, భీకరముగా నెట్లుండు నని తిమ్మనభావమై యుండును.

స్వభావ సిద్ధములగు ప్రకృతి సౌందర్యముల నాస్వాదించుటకు బాహిర దృష్టి చాలదు. ఆంతరదృష్టియైనను, దాని నావరించి యుండు అజ్ఞానపు తెరను తొలగించిననే, ఆ సౌందర్యములను చూడగల్గుట. అట్టి తెరను తొలగించి, మనకు మధుర రసానుభూతిని కలిగించు మహాకవులలో తిమ్మనయు నొకడు.

పారిజాతాపహరణ ప్రబంధమునకు నాయికానాయకులు సత్యా శ్రీకృష్ణులు. వీరి ప్రణయము ఉత్తమానురాగమున కాదర్శప్రాయము, సాంసారిక జీవనమునకు సుందరమగు వ్యాఖ్య. దక్షిణ నాయకుడగు శ్రీకృష్ణుడు సత్యభామాశుకీకేళిపంజరముగానే ఇందు చిత్రింపబడెను. కలహభోజనుని తోడుపాటుతో విచిత్ర నాటకమును నడపించిన తిమ్మన, పరమాత్మ స్వరూపుడైన హరివంశపు కృష్ణుని, మానవత్వము ప్రకటముగా భాసించు ప్రణయ మూర్తినిగా మలచెను. బహుపత్నీత్వమున కలుగు సమస్యలతో నుక్కిరి

బిక్కిరియగు గృహస్థుడుగ, కలహప్రియునితంత్రములతో ప్రణయ కలహములకు లోనైన రసికశేఖరుడుగ, అనురాగవతియగు సత్యావధూప్రీణనమే ధ్యేయముగా గల ప్రణయతత్త్వవేదిగ, పరిపూర్ణహృదయముతో తన నారాధించువారికి నధీనుడై, ముదమును కూర్చు పరహితాచరణశీలిగా శ్రీకృష్ణుడనుభవించిన క్లేశములు నిత్యజీవితానుభవ ప్రతిబింబములై, రసికజనుల సహానుభూతికి పాత్రము లగుచున్నవి.

సత్యభామ శ్రీకృష్ణునకు నిత్యప్రియ. ప్రాణముకంటె పతిని మిన్నగా ప్రేమించు అనురాగమూర్తి. చక్కనిదాన నని, ఎలజవ్వని నని, పతి తనయెడ ననురక్తు డని నిక్కుచు, విఱ్ఱవీగుచు, సవతుల నెవ్వరిని గణియింపని అహంకారమూర్తి. మానమే సతులకు తొడవనియు, ప్రాణ మనియు, మానరహితమైన బ్రతుకు మానిని కేల? యనియు తలపోయునట్టి అభిమానధన. మగడు ధన మిచ్చి పుచ్చుకొన్న మనవచ్చును గాని, చన విచ్చి పుచ్చుకొన్నచో మను టెట్లని ఆమెయావేదన.

దివ్యసౌరభములను వెదజల్లు పారిజాతకుసుమమును సత్యభామా విధేయుడు రుక్మిణికి ఇచ్చెనన్న పరితాపముతో నామె ఈర్ష్యాకషాయితయై, కోపసదనము చేరినది. అపరాధమును మన్నింపుమని పదములపై వ్రాలిన అఖిల లోకవంద్యుడగు శ్రీకృష్ణుని శిరమును వామపాదముతో తొలగద్రోసినది. నిలువరింపరాని దుఃఖోద్వేగముతో విలపించినది. పారిజాత వృక్షమునే తెచ్చియిత్తు నని అతడు వాగ్దానము చేయగా, మురిసి, గతమును మరచి, నీపలతికవోలె వికసించినది.

పుణ్యకవ్రత నిర్వహణముతో, ఆమె యహంకారము, స్వాతిశయము, అసూయాదివికారములును సమసిపోవగా, విశుద్ధప్రేమతత్త్వమును గ్రహించి, బహుక్లేశ సంపాదితమగు పారిజాతముతోబాటు ప్రాణాధికుడగు తననాథుని

కూడ త్యాగము చేయగలిగినది. కావుననే శ్రీకృష్ణు డా శృంగారరసాధిదేవతకు శాశ్వతముగ వశు డయ్యెను.

ఈ కావ్యమున నెచ్చటను శ్రీకృష్ణుడు మానవత్వమును మీరి వర్తించినట్లును, దివ్యమహిమలను ప్రదర్శించినట్లును వర్ణింపబడలేదు. దేవేంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధమును చేతితో పట్టుకొను సందర్భమున మాత్రము ఆతనిలో దివ్యత్వము గోచరించును. కాని తారకాద్యనేకాసురులను ఏమియు చేయజాలని ఆ వజ్రాయుధము, మహాశక్తి సంపన్ను డగు శ్రీకృష్ణునిచేత చిక్కినంత మాత్రమున నాతనిలో దేవత్వము నేల యూహించుకొనవలె నన్నచో, ఆతడు మానవాగ్రణిగనే భాసించును.

శ్రీకృష్ణునిసాంసారికకథను సహజముగా వర్ణించుటకైయే ఆతనిని మానవమాత్రునిగా చిత్రించినను, తిమ్మన, నారదాదుల మూలమున నాతనిలో భగవత్స్వరూపమును భంగ్యంతరముగా నిరూపించెను. సర్వప్రాణులయందును, ప్రత్యేకించి, సాపరాధులయందును నిక్కపు ప్రేమను ప్రదర్శింపజాలు మానవుడు సైతము పరమాత్మతుల్యుడే యగు నను సత్యమును నిరూపించుటకైయే తిమ్మన, శ్రీకృష్ణునిలో భగవత్తత్త్వమును కూడ ప్రతిపాదించి యుండును.

ఈ కావ్యకథలో శ్రీకృష్ణుడు ఉత్తమమానవ ధర్మమును స్వాచరణ రూపమున ప్రదర్శించును గాన, ఆతనిలో పరత్వము లేదన్నను కలుగు హాని కానరాదు. దేవర్షియగు నారదుడు తన యింటి కేతెంచినపుడు రుక్మిణీ సహితుడై నమస్కరించి, సత్కారము లొనర్చుట, మాతృమూర్తియగు అదితికి సత్యాసమేతుడై వినతు లొనరించుట, కోపనయగు ప్రేయసికి సేవలుచేయుట, అపరాధమును క్షమింపు మని పాదములపై వ్రాలుట, ఆ ప్రణయ స్వరూపిణీ మనోవాంఛా పరిపూర్తికై అనితరసాధ్య మగు కార్యకరణమునకు పూను

కొనుటయు ఉత్తమమానవాదర్శనిరూపణమునకై చేసినట్టి కార్యములుగనే తోచును. తనను ప్రాణాధికముగా ప్రేమించు ప్రియురాండ్రయంతరంగముల కనువుగా నడచుకొనుటలోను, కూర్మిపెంపున వారికోర్కెల మన్నించి, ఏలు కొనుటలోను శ్రీకృష్ణుడు ప్రదర్శించిన విధానములు ఉదాత్త శృంగార రసాభి వ్యంజకములై శ్లాఘాపాత్రములైనవి.

నారదుడు పారిజాత సుమముల మరికొన్నింటిని సమర్పించి యుండి నను, లేక ఇచ్చిన ఆ ఒక పూవును శ్రీకృష్ణుడే ధరించి యుండినను, సత్యకు మనస్సంతాప మేర్పడుట కాని, కథ ఇంత పెరుగుట కాని జరిగియుండెడిది కాదు. సత్యభామలో నుండు దురహంకారమును, ఈర్ష్యాద్వేషాది మాలిన్య ములను పోగొట్టి, ఆమె ప్రేమను నిష్కళంక మొనరించు తలంపుతోనే దేవర్షి ఒకే పుష్పము నిచ్చెను. ఆ రహస్యము నెరిగి, సత్యాగర్వభంగము కావించుటకై, శ్రీకృష్ణుడు సమీపవర్తిని యను నెపముతో రుక్మిణీదేవికి దాని నిచ్చెను. ఇక సత్యభామకోప మవధులు దాటినది. ధూర్త గోపాలు డప రాధి యైనాడు, కపటనటనాపరుడైన కృష్ణుడు నిరపరాధివలెను, అమాయ కుని వలెను నయగారములు పలికి, బుజ్జగించుచు ఆడిన మాటలు, ఉరిసిన పుండుపై నుప్పుపెట్టినట్లున్నవే కాని, శాంతపరచునవిగా లేవు. సత్యా హృదయగత ప్రేమ స్వరూపము సుస్పష్టముగా తెలియుటకొరకే ఆత డిట్లామెను రెచ్చగొట్టెను. ప్రాణనాథునకు తనపై నుండు ప్రేమ తరిగిపోవు చున్నదను భయముచేతనే సత్యభామ ఇంతటి సంక్షోభమునకు గురియైనది. ఆమె ప్రగాఢానురాగమునకు మెచ్చి, ముచ్చటపడిన ఆ సరసుడు "రతిచక్రే ప్రవృత్తే తు నాస్తి శాస్త్రం న చ క్రమః" అను శృంగార సూత్రము నెరి గిన ప్రేమ స్వరూపుడు గాన, ప్రియురాలి తాపును మన్ననగనే భావించి, లోకోత్తర ప్రణయదాసుడై వెలసెను.

శరణాగతుడైన దేవేంద్రుని క్షమించుటలో అతడు చూపిన ఔదార్యము, తనను దానముగా పరిగ్రహించిన నారదుడు నవ్వుటాలకు ఆడించినట్లెల్ల ఆడుటలో అతడు ప్రకటించిన భక్తపరాధీనత, పరత్వమును పరిత్యజించి, తనను నమ్మినవారిని సర్వథా సంతృప్తిపరచుటలో అతడు ప్రదర్శించిన ఆశ్రితవాత్సల్యమును ఆ లీలామానుష విగ్రహుని ఉజ్జ్వలచారిత్రమునకు వన్నె దెచ్చు గుణములు.

ఈ పారిజాతాపహరణ కావ్యమును నాటకావసరములగు కొన్ని చిన్న చిన్న మార్పులను చేసి చక్కని రూపకముగ రూపొందింపవచ్చును. ఆనాటి సంప్రదాయము - కావ్యమును పుర - చాతుర్వర్ణ్య - వారవిలాసినీ - పుష్ప లావికాది వర్ణనములతో ప్రారంభించుట. కాని, తిమ్మన తన కావ్యమును పై వర్ణనములతో గాక, రూపకములలో వలె కథాంశముతోనే ప్రారంభించెను. వర్ణనాద్యంశములందు తప్ప, మిగిలిన భాగములలో మృదు మధురము, మనోహరము నగు సంభాషణాత్మకశైలినే ఈతడు స్వీకరించెను. ఈ భాగ ములు చదువునప్పుడు పాత్రము లన్నియు మన కన్నుల యెదుట నిలచి, మాటలాడుచున్న వని భావింపగలమే కాని, అవి కావ్యగతము లని గుర్తింప లేము. ఇందు పాత్రల స్వరూప స్వభావాదుల వర్ణనములు లేవు. వారి మాటల వలనను, చేతలవలనను, అవి గోచరించును. ఈ సంభాషణములు ఛందో బద్ధములైనను, వృత్తగంధి గద్యములుగనే భాసించును.

ఇందు ప్రధానరసము శృంగారము. దానికి ఆలంబన విభావములు సత్యాకృష్ణులు. అనురాగము అహంకార - మమకారాదివిదూరమై, విశుద్ధ మైననే ఉత్తమశృంగారము కాగలదు. అప్పుడే ప్రణయతత్త్వము గోచర మగును. ఈ తత్త్వమును రుక్మిణీదేవి కొంతవరకు అవగతము చేసికొన్నది, సత్యభామ ఈర్ష్యాసూయాదులగు భావములకు లోనై, ప్రేమపరాకాష్ఠను అందుకొనజాలినది కాదు. నారదుని వాత్సల్యముతో సత్య, ప్రేమ తత్త్వము

నెరింగి, ప్రణయసామ్రాజ్యాధిపత్యము వహించుటయే - ఈ కావ్యనాటకము నకు ప్రధాన లక్ష్యము. ఈ లక్ష్యసాధనమునకు అదితి వృత్తాంతము ప్రకరీ ప్రాసంగికముగను, ఇంద్రవృత్తాంతము పతాకాప్రాసంగికముగను తోడ్పడి నవి. యుద్ధఘట్టమందలి వీర - రౌద్ర - భయానక - బీభత్స రసములు అంగ రసములై ప్రధాన రసమునకు సౌష్ఠవమును సమకూర్చినవి. శ్రీకృష్ణ సంద ర్శనోత్సుకలగు అప్సరఃకాంతల సంభ్రమ విచేష్టితములును, ధర్మజ-నారదా దుల చతురోక్తులును, హాస్యరసోత్పాదకములై ప్రధానరసమునకు వన్నె తెచ్చినవి. అదితి - నారదకృత కృష్ణస్తవములు శాంతరస ప్రధానములు. ఇవియు అంగిరసమునకు పరిపుష్టిని సమకూర్చునవే.

కావ్యారంభమున నుండు వేంకటేశ - మహేశ - ఇందిరారమణులకు సంబంధించిన ప్రార్థన పద్యములను నాందీపద్యములనుగ స్వీకరింపవచ్చును. సవతులమధ్య రవరవలు, ప్రణయకలహము, తన్నివారణము, విశుద్ధ ప్రణయ తత్త్వము - అను నీ కావ్యార్థ సూచనములు ఇందు గలవు. కావ్యా రంభములో నుండు కృతిపతివంశావళి, కృష్ణరాయల వర్ణనము, షష్ఠ్యంత ములు, ప్రబంధావసర వస్తువులు గాన, వీనిని పరిహరించి, వానిస్థానమున ప్రస్తావనను కల్పింపనగును కృష్ణదేవరాయలవిజయోత్సవసందర్భమున ఈ నాటకమును ప్రదర్శించుచున్నట్లు సూచింపవచ్చును. గ్రంథాంతమున నున్న కృతికర్తృ ప్రశంసను ప్రస్తావనలోనే సూత్రధారుని నోట పలికింపవచ్చును. అష్టమహిషులతోడను, పదియారువేల అచ్చరకులంబు లలనామణులతోడను శ్రీకృష్ణుడు సౌఖ్యాంబునిధి నోలలాడుచుండియు, భోజజనపాలసుతను, సాత్రాజితిని మన్నించి, వారికి మిగుల చన విచ్చుచుండుటయు, ఈ కారణము ననే ఆ ఇరువురిలో రవరవలు పొడముటయు, సత్యభామాదేవేంద్రుల గర్వ భంగము గావింప దలచి, నారదుడు పారిజాత ప్రసూనమును శ్రీకృష్ణునకు సమర్పించి, స్వకార్యసాధనమునకు ఉన్ముఖుడగుటయు, తదనుగుణముగ

రుక్మిణీమందిరమున నున్న శ్రీకృష్ణునియొద్దకు నారదుడు ప్రవేశించుచుండుట- అను నీ అంశములు ప్రస్తావనలో సూచింపదగినవి. రంగస్థలమున నుండు రుక్మిణీ శ్రీకృష్ణుల యొద్దకు నారదుడు ప్రవేశించుటతో నాటకము ప్రారంభ మగును.

మొదటి అంకము:- నారదుడు, శ్రీకృష్ణునకు పారిజాత పుష్పము నిచ్చుటతో ప్రారంభమై ఆతని సందేశమును స్వీకరించి, దేవలోకమునకు బయలుదేరుటలో ఈ అంకము సమాప్త మగును. ఇచ్చట నుండు మాధ్యా హ్నిక-స్నాన-భోజన-సాయంకాలాది వర్ణనములు నాటకమున కేవలసూచనా మాత్రములుగనే ఉండదగును.

రెండవ అంకము:— ప్రథమాంకము చివర శ్రీకృష్ణుని అమరావతీ ప్రయాణోద్యమము సూచింపబడును గాన, ఈ అంకము తదుపరికథతోనే ప్రారంభమగును. అంకాస్య మను అర్థోపక్షేపకముతో ఈ సంవిధానము సంఘటిత మగును. తన ప్రయాణవృత్తాంతము నెరింగించుటకై కొలువు కూటము చేరియున్న శ్రీకృష్ణుడు తన వాహనమగు గరుడుని స్మరింపగా, అతడు రంగస్థలమున ప్రవేశించుటతో ప్రారంభమై, నందనోద్యానమున విహరించుపట్టున ఆనాడే పారిజాతమును పెకలించి గొంపోవ ప్రేరేపించిన సత్యభామను అనునయించి, మరునా డా కార్యమునకు పూనుకొనుట యుక్త మనియు, తా మానాడు దేవలోక విహారములు సలిపి, అందే విశ్రమించుట ఉచితమనియు శ్రీకృష్ణుడు పలుకు మాటలతో ఈ అంకము ముగియును.

మూడవ అంకము:- రెండవ అంకము చివర ఉత్తరాంకార్థము సూచింపబడును. కావున, ఈ అంకమును అంకాస్యముతోనే ప్రారంభ మగును. విష్కంభప్రవేశకాద్యవసరము లేకుండ పూర్వాంకకథను, ఉత్త రాంకకథతో సంఘటితపరచుట రసాస్వాదమునకు మిగుల తోడ్పడును. నిర్ణ

యానుసారముగ, సత్యాకృష్ణులు నందనోద్యానమునకు వెడలి, పారిజాత వృక్షమును పెకలించి, గరుడునిపై నిడి, ప్రయాణోన్ముఖులైరను వార్తాశ్రవణముతో ప్రారంభమై, దేవేంద్రుడు తన దేవేరిముందు ప్రగల్భములాడి, కొలువు జేరి, యుద్ధోన్ముఖు డగుటతో ఈ అంకము ముగియును.

నాల్గవ అంకము.— ఈ అంక ప్రారంభమున విష్కంభ ప్రవేశకములలో అన్యతరమును కల్పించి, యుద్ధారంభము సూచింపనగును. యుద్ధము రంగస్థలమున ప్రదర్శింపబడరానిది కావున, పర్యవేక్షకులుగా నుండు మహర్షుల, లేక, దేవతల సంభాషణల మూలమున యుద్ధవర్ణనమంతయు విశదీకరింపనగును. ఇంద్రపరాజయము, శరణాగతుడగు ఇంద్రుని అనుగ్రహించుట, పారిజాతముతో శ్రీకృష్ణుడు ద్వారకకు బయలుదేరుట-అను నీ అంశములను నిరూపించుటతో ఈ అంకము ముగియును.

ఐదవ అంకము - ఈ అంకము మొదట ప్రవేశకమును కల్పించి, పారిజాతప్రతిష్ఠాపనము, పుణ్యకవ్రతాచరణమునకై నారదుడు సత్యభామను ప్రోత్సహించుట, ఆమె తదనుకూలప్రయత్నములు చేయుట, బంధుజన సమాగమము-అను నీ అంశములు ఇందు సూచింపనగును. పుణ్యకవ్రత ప్రారంభముతో ఈ అంకము మొదలై, ఆత్మభూషణవితానమును నిష్క్రియముగ నారదున కొసగి, సత్యభామ శ్రీకృష్ణుని మరల బడయుటతో నాటక కథ పరిపూర్ణ మగును. నారదకృత శ్రీకృష్ణస్తుతిరూప మగు భరతవాక్యముతో నాటకము పరిసమాప్త మగును.

ఈ కావ్యమును, ఐదంకముల నాటకముగా భాసింపజేయు తలంపుతోనే తిమ్మన నిర్మించి యుండవచ్చును. శృంగారరస ప్రధానమగు ఈ పారిజాతాపహరణ నాటకమున, యుద్ధవర్ణనకై ఒక అంకమును పూర్ణముగ వినియోగించుట రసభంగమునకు కారణమగు నని భావించినచో, దాని నంతటిని

విష్కంభముననే కల్పించి, ఆ అంకమును పరిహరింపవచ్చును. మొదటి అంకమున రుక్మిణీగృహమున జరుగు వృత్తాంతము, ఒక రంగమునను సత్యభామాగృహమున జరుగు వృత్తాంతము మరియొక రంగమునను ఉన్నవి. ఆ రెండింటిని రెండంకములుగ విభజించినచో, యుద్ధాంకమును పరిహరించినను, ఐదంకముల నాటక మగును. అట్లొనరించినచో రూపకసంప్రదాయము మరింత చక్కగా నిర్వహింపబడగలదు. పంచసంధుల కనుగుణముగనే కథాసంవిధాన మమరియున్నది. కాన, రసపరిపోషణము నిర్దుష్టముగా సమకూరగలదు.

ఇట్లు ఈ కావ్యము అత్యల్పపరివర్తనములతో ఉత్తమరూపకము కాగలదు. ఈ వైశిష్ట్య ముండుటచేతనే, పరిమాణమున చిన్నదైనను, అనన్యసామాన్యగౌరవమును సంపాదించుకొని, ఈ ప్రబంధము కావ్యోత్తమముగ విరాజిల్లుచున్నది.

తన కబ్బిన పాండిత్యము నంతటిని తన కావ్యమున నింపవలె నను కాంక్షలేక, స్వచ్ఛగంభీరముగ కదలు గంగాప్రవాహమువలె కవిత్వమును నడపిన ప్రతిభాశాలి తిమ్మన. ఆంధ్ర పంచ మహాకావ్యములలో నొకటిగా ఖ్యాతినందిన ప్రబంధరాజము పారిజాతాపహరణము. కవిత్వప్రశస్తిలో, భావనాపటిమలో, వర్ణనా నైపుణ్యములో, ఆంధ్రకవితాపితామహునివలె, వన్నెకెక్కిన కవి - ముద్దుపలుకుల నంది తిమ్మన.

# రామరాజ భూషణుడు

శ్రీకృష్ణదేవరాయల భువనవిజయ సభాస్థలి నలంకరించిన అష్టదిగ్గజములలో రామరాజ భూషణుడును ఒకడని లోకవ్యవహారము కలదు. కాని, అళియ రామరాజు - ఆస్థానమునకు భూషణప్రాయుడై వెలుగొందెను కావున ఇతనికి రామరాజ భూషణుడను ప్రసిద్ధి ఏర్పడినదని చారిత్రక పరిశోధనల వలన నిర్ధారితమైనది. ఇతనికి పితృదత్తనామము భట్టుమూర్తి. వీరియింటి పేరు ప్రబంధాంకమువారు. సందర్భానుగుణముగ పద్యముల నల్లి, శ్రావ్యముగా గానముచేసి, రాజులను మెప్పించుట వీరికి వెన్నతో బెట్టిన విద్య. ఇట్లాశువుగా రసవత్పద్యము లల్లుటకు కవితాశక్తితోబాటు, ప్రతిభా-వ్యుత్పత్తులును ఆవశ్యకము లగును.

భట్టుమూర్తి నానాకళాపారీణుడు; సంగీతకళారహస్యనిధి. బాల్యము నుండియు సాహిత్యప్రియుడగు ఈ కవి, సంస్కృతాంధ్ర సాహిత్యములను అశేషముగ అధ్యయనముచేసి, అపార వైదుష్యమును గడించుటయే కాక, మహాకవులలోని విశిష్టకవితాగుణములను కూడ స్వాయత్తము చేసికొనెను.

"బాణువేగంబును, భవభూతిసుకుమార
తయు, మాఘుశైత్యంబు, దండిసమత,
యల మయూరుసువర్ణకలన, చోరునియర్థ
సంగ్రహమ్ము, మురారిశయ్యనేర్పు,
సోముప్రసాదంబు, సోమయాజులనియ
మంబు, భాస్కరునిసన్మార్గఘటన,
శ్రీనాథునిపదప్రసిద్ధధారాశుద్ధి, యమరే
శ్వరునిసహస్రముఖదృష్టి,

నీక కల, దటుగాన, ననేకవదన
సదనసంచారఖేదంబు సడలుపఱిచి,
భారతీదేవి నీ జిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర! విఖ్యాతకీర్తిసాంద్ర!"

(కావ్య. 1-15)

బాణాదికవులలో నుండు పై విశిష్టగుణములు వారికి మాత్రమే సహజము లనియు, అట్టి ఉత్తమగుణములకై అభిలషించుచుండిన సరస్వతీదేవి ఒక్కొక్కదానికై, ఒక్కొక్క కవి నాశ్రయించుచుండిన దనియు, పై గుణము లన్నియు ఒక మూర్తికవిలోనే పొదుకొనుటవలన, ఆమె ఆ కవి చంద్రునిజిహ్వయందే స్థిరనివాస మేర్పరచుకొని, అనవరతసంచారఖేద మును తొలగించుకొనె ననియు నరసభూపాలీయమున చెప్పబడినది. సహజ ముగనే ప్రతిభావంతుడైన ఈ కవి తన పాండిత్యమునకును, కవితాశక్తికిని మెరుగులు దిద్దుకొన దలచి, ఆంధ్రకవితాపితామహుండగు అల్లసాని పెద్దన నాశ్రయించి యుండును. 'ము ప్రత్యయాభావస్య అల్లసాని-పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తి కవినా విరచితే వసుచరిత్రే' అని లక్ష్మీనరసింహాచార్యులు తమ 'ఆంధ్ర కౌముది'లో పేర్కొని యుండుటనుబట్టి, ఈ కవి పెద్దనకడ శిష్యరి కముచేసెననుట కాధారము కన్పించుచున్నది. సంస్కృతాంధ్ర సాహిత్యార్ణ వములను అవలోడనముచేసి, వానిలోని అనంతరత్నరాసులను కొల్లగొట్టి, అశేషశేముషీకవితా వైభవముతో ఒప్పారుచుండు ఈ బాలకవిచంద్రుని, ఆంధ్రకవితా పితామహుండు వన్నెలు చిన్నెలు దిద్ది, మచ్చలేని మనోజ్ఞమూర్తి నొనరించి యుండును.

ప్రబంధయుగమువరకును, ఆంధ్రసాహిత్యమున పురాణేతిహాసముల నుండియు, స్థలమాహాత్మ్యగ్రంధములనుండియు, కధావస్తువులను గ్రహించి,

ఔచిత్యానుగుణముగ మలచికొని, ఆంధ్రీకరించుట జరుగుచుండెను. ప్రబంధ యుగమున స్వీకృతేతివృత్తములలో వస్త్వైక్యమును సంఘటితపరచి, అష్టాదశవర్ణనలతో నొప్పు శృంగారరసప్రధానములగు ప్రబంధముల నిర్మాణము ముమ్మరముగా కొనసాగినది. పింగళిసూరనవంటివారు ఈ సంప్రదాయమును కాదని, స్వకపోలకల్పితకథలతో ప్రబంధముల నిర్మించిరి. రామరాజభూషణుడు కథావస్తువు ఎట్టిది ఉత్తమమైన దగునో ఇట్లు నిర్దేశించినాడు—

"కేవలకల్పనాకథలు
　　కృత్రిమరత్నము, లాద్యసత్కథల్
పావిరిపుట్టురత్నము, ల
　　వారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు
　　సానలఁ దీరిన జాతిరత్నముల్,
గావున, నిట్టి మిశ్రకథ
　　గా నొనరింపుము నేర్పు పెంపునన్."

(వసు. 1-19)

కల్పితకథలు కృత్రిమరత్నములవంటివి; పౌరాణికాది కథలు ముడిరత్నములవలె కాంతిహీనము లైనవి; కల్పనావిభూషితములగు ప్రాచీన గాథలు సానలుదీరి, తేజఃపుంజములను వెదజల్లు జాతిరత్నములవలె అనర్ఘము లైనవి. కాన, అమూల్యములగు ప్రాచీనకథలే తన కుపాదేయము లని, తన కావ్యముల కట్టి యితివృత్తములనే స్వీకరించి మెరుగులు దిద్దెను.

ఆంధ్రప్రబంధోద్యానములో తొలిగా పుష్పించి, తన దివ్యగంధమును దశదిశలకు వెదజల్లిన ప్రబంధపుష్పరాజము మనుచరిత్రము. నిసర్గసుందరముగా వికసించిన అవ్విరితావులకు చొక్కి, అంతకంటె మిన్నగా గుబాళింపగల కావ్యకుసుమావతంసమును సృష్టింప దలచి, రామరాజభూషణుడు వసుచరిత్ర మహాకావ్యమును నిర్మించెను. మహాకవులకావ్యములకైనను వంకలు పెట్టి, సునిశితముగా విమర్శింపజాలిన ఆ కాలపు దోషజ్ఞులముందు తనకావ్యము నెగ్గవలె నన్న, అది సాధారణమైనదే యైనచో నిలువలేదని, ఈ కవి, తన ప్రతిభనంతటిని కుమ్మరించి, ఎట్టి విమర్శకుని చోటీయక, విమర్శకాగ్రేసరులను సైతము మెప్పింపగల అసంఖ్యాకములగు ఇంద్రజాలముల ప్రదర్శించి, ప్రబంధరాజమునే సృష్టించి, అనన్వయాలంకారమున కుదాహరణ మయ్యెను.

మనుచరిత్రముకంటె తన వసుచరిత్రము సర్వధా ఉత్కృష్టమైనదనిపించుకొనుటయే ఈతని లక్ష్యము. మనుచరిత్రమును ఉత్తమప్రబంధముగా నంగీకరించిన కవిపండితలోకము, అంతకంటె చక్కగా తీర్చిదిద్దబడిన తన వసుచరిత్రమును ఉత్తమోత్తమముగా నంగీకరింపక తప్పదని ఈతని ప్రగాఢవిశ్వాసము. ఈ లక్ష్యసాధనకై ఇతడు కడుంగడు జాగరూకతతో వసుచరిత్రమును నిర్మించెననుట గ్రంథమున సర్వత్ర నిరూపిత మగుచున్నది. ప్రబంధనామధేయము, ఇష్టదేవతాస్తుతి, కథానిర్వహణక్రమము, సన్నివేశకల్పనము, పద్యరచనావిధానము, అష్టాదశ వర్ణనములు, కడకు ఆశ్వాససంఖ్య మొదలగు విషయము లన్నింటిలోను, వసుచరిత్రము మనుచరిత్రము ననుకరించుచునే మెరుగులు దిద్దుకొనెను.

మహాభారతములోని ఆదిపర్వమునందలి ఉపరిచర వసురాజు వృత్తాంతమే ఈ కావ్యేతివృత్తము. ఆ రాజువృత్తాంతము అందు ఇట్లున్నది - చేదిభూనాథుడగు వసురాజు మృగయావినోదార్థము అడవికి పోయెను. అట నొక మునిజనాశ్రమమున నిర్వేదము కలుగ, నిష్ఠతో తప మొనరించెను. అతని

తపస్సునకు మెచ్చి, ఇంద్రు డతనితో చెలిమిచేసి, దేవత్వమును, కనకరత్న మయమైన దివ్యవిమానమును, వాడని వనజంబులు గల ఇంద్రమాల యను కమలమాలికను, దుష్టనిగ్రహ - శిష్టపరిపాలనక్షమంబైన వేణుయష్టిని అనుగ్రహించెను. వసువును తద్విమానారూఢుడై ఉపరిలోకములలో చరించు చుండుటవలన, ఆతనికి ఉపరిచరవసువు అను ప్రఖ్యాతి కలిగినది. ఆతడును ఏటేట ఇంద్రోత్సవము చేయుచు, లబ్ధసంతానుడయి, రాజర్షియయి, రాజ్యము చేయుచుండెను. ఇట్లుండ, నిజపురసమీపమున ప్రవహించు శుక్తిమతి యను మహానదిని కోలాహలమను పర్వతము కామించి, అడ్డగింపగా, దానిని తన పాదముతో తొలగద్రోసెను. ఆ నదికి పర్వతసమాగమమున వసుపదు డను కొడుకును, గిరిక యను కూతురును పుట్టిరి. గిరినిరోధము బాపి, ఉపకారము చేసిన ఉపరిచరునకు ఆ నది భక్తితో వారిని కానుకగా నొసంగెను. ఆతడును వసుపదుని సేనాపతిగా జేసికొని, గిరికను ధర్మపత్నిగా స్వీకరించెను.

నన్నయ ఈ కథను నాలుగు గద్య-పద్యములలో సమకూర్చెను. ఈ చిన్న కథనే స్వీకరించి, రామరాజభూషణుడు ఆరాశ్వాసముల ప్రబంధముగా మలచెను.

కోలాహలమును తొలగద్రోసి, భువనక్షేమమును కల్పించిన వసురాజు కృత్యమునకు సంతసించిన దేవేంద్రుడు, ఆతనికి విమానమును బహూకరించి నట్లుగా కథను మార్చి, మూర్తికవి ఔచిత్యమును పాటించెను. ఇట్లే, భారత కథలో గిరికను వివాహమాడునాటికి వసురాజునకు పెక్కుదేశముల నేలు చుండు ఏవురు పుత్రు లున్నట్లు వర్ణింపబడియుండ, ఈ కవి తన కావ్యములో గిరికావివాహమునాటికి వసురాజు అవివాహితుడే అని తోచునట్లు చమత్కార ముగా కల్పించి, రసపోషణమునకు వన్నెదెచ్చెను. ఇట్లు భట్టుమూర్తి రస భావాద్యనుగుణముగా, అనేక సన్నివేశాదులను కల్పించి, తనకావ్యము సానల దీరిన జాతిరత్నమని నిరూపించెను.

ఈ కావ్యములోని ఇతివృత్తము మనుచరిత్రములోని వరూధినీ-ప్రవర వృత్తాంతమును చాలవరకు పోలియున్నది. అచటి కోనలు, రత్నకందరములు, అలౌకికసౌందర్యరాశి యగు సుందరాంగి, ఈ కావ్యమునను ప్రత్యక్షమగును. ప్రవరుడు అతర్కితముగ కాంచిన వరూధిని ఇట్లున్నది—

"అతఁ డావాతపరంపరాపరిమళ
వ్యాపారలీలన్, జనా
న్వితమిచ్చో టని, చేరఁ బోయి, కనియెన్
విద్యుల్లతావిగ్రహన్,
శతపత్రేక్షణఁ, జంచరీకచికురం,
జంద్రాస్యఁ, జక్రస్తనిన్,
నతనాభిన్, నవలా, నొకానొక మరు
న్నారీశిరోరత్నమున్."

(మను, 2-25)

వసురాజుమిత్రుడు సప్రయత్నముగ దర్శించిన గిరిక ఇట్లున్నది—
"తరువులపొంతఁ బొంచి, వసు
ధావరమిత్రుఁడు గాంచె నచ్చటం
దరుణిఁ, దమోవినీలకచఁ,
దామరసోదరసోదరప్రభం,

దరళవిలోచనం, దతని
తంబఁ, దటిన్నిభగాత్రవల్లరిం,
దరుణశశాంకఫాల, నొక
తన్విఁ, దరంగవళిం, చలోదరిన్."

(వసు. 2-25)

పెద్దన పద్యమునకు భూషణకవి సున్నితమగు మెరుగులు దిద్దుటకు ప్రయ త్నించె ననుట ఈ పద్యమున స్పష్టమగుచున్నది.

ప్రత్యక్షరశ్లేషమయ ప్రపంచవిన్యాసవిదగ్ధుడగు సుబంధుని రామరాజ భూషణుడు 'వరవృత్తములు మాని, వాణి యెవ్వానికై వలచి, నానాశ్లేషము లకు జిక్కె' నని ప్రస్తుతించియున్నాడు. చిత్రవిచిత్రములగు భావములను ప్రకటించుటకీ కవి ఉపయోగించిన శ్లేషలు చమత్కారావహములై, ఈతనిని శ్లేషకవిచక్రవర్తిగ నిరూపించుచున్నవి. ఒక్కొక్కచోట ప్రకృతార్థముతో బాటు అనేకార్థములు అనురణనముగా ధ్వనించుచుండును.

దివ్యరూపోజ్జ్వలుడు, అచలాధీశ్వరుడు నగు కోలాహలు డొకనాడు అచలామణిహార మగు శుక్తిమతిని చేరెను. అర్ఘ్యపూజావిధులను గావించి, ఆ పుణ్యతరంగిణి అన్నగాగ్రణితో—

"అతులశైవలవతీశతము లీనెడు మీకు
నాయిచ్చు విమలార్ఘ్యతోయ మెంత?
ప్రాలేయనిలయసంభవముఁ గాంచిన మీకుఁ
బన్నీట నొనరించు పాద్య మెంత?

సరసమందారమంజరుల రంజిలు మీకుఁ
బెనఁచి పూదండ లర్పించు టెంత?
గోరత్నదోహనగురులక్ష్మి గల మీకు
నుపదగా మణివర్గ మొసఁగు టెంత?
యనఘ! యెవ్వారలైనఁ గొండంతవారి
కవనిఁ గొండంత పూజ సేయంగఁ గలరె?
భక్తి నే నిచ్చు నీ పుష్ప - పత్ర - తోయ
మాత్రములు గైకొనుటె కాక గోత్రతిలక!"

(వసు. 2-122)

అని పలికినది. ఇందు శైలపరముగను, నాయకపరముగను రెండర్థము లున్నవి. కోలాహలుదు పరమోద్ధతుడు; సార్థక నామధేయుడు. సుకుమార ప్రవర్తనముగాని, సుస్నితమగు రీతిని భావము ప్రకటించుట గాని, ఆత డెరుగడు. అత్యంతసుకుమారి యగు శుక్తిమతి, ఇతని ఔద్ధత్యమును సహింపనేరక వ్యంగ్యముగా పరిహసించినది. ఆమె పరిహసించిన తీరు చూడుడు:—అసంఖ్యాకములగు నదులకు ప్రభవస్థానమగు మీకు నే నిచ్చు ఈ అర్ఘ్యజల 'మెంత' అనునవి బాహ్యార్థము. కోలాహలునికడ నుండు నీరు పాచితీగలతో మలినమై ఉండునట్టిది. తానిచ్చునదియో విమలార్ఘ్యతోయము. ఇట్టిది నీకెట్లు లభించు' నని అంతరార్థము. ఇట్లు అన్ని పాదములలోను బాహ్యాభ్యంతరార్థములు భాసించుచున్నవి. అతడు ప్రాలేయనిలయసంభవుడు-కరుడుగట్టిన మంచుకొండకు పుత్రుడు. తా నిచ్చునట్టిది పన్నీటిపాద్యము. అతడు సరస మందారమంజరులతో రంజిలువాడు. తానిచ్చునట్టివి పూదండలు. పూవులను అందమైన మాలలుగా కట్టి, ధరించుట నాగరకుల లక్షణము;

గుత్తులుగనే ధరించుట అనాగరకుల యలవాటు. అతడు గోరత్నదోహన గురులక్ష్మి కలవాడు. (భూమి గోరూపిణి కాగా, హిమవంతుడు వత్సమై, రత్నములు పిదుకబడినవి.) ఇట్లు తండ్రియిచ్చిన అనంత సంపదగలవాడతడు. అట్టివానికి తాను ఉపాయనముగా నిచ్చు మణివర్గ మెంత? రత్నరాసు లెన్ని యున్న నేమి? వాని విలువ నెరుగ డని భావము. కొండంత దేవునకు కొండంత పూజ చేయజాలరు కదా? కాన తానిచ్చు పుష్ప—పత్ర—తోయములనే పెద్దమనసుతో స్వీకరింపవలె నని శుక్తిమతి ప్రార్థించినది. ఇచ్చువారిమనసు ప్రధానము కాని, వస్తుపరిమాణము కాదనియు, ఈ విషయమును కోలాహలునివంటి మొరటువారు గుర్తించుట అవసరమనియు శుక్తిమతి హెచ్చరించినది. ఇందు శుక్తిమతిచేయు సపర్యలును, ఆమె వినమ్రభావమును ప్రధానార్థములు, పరిహాసము ధ్వన్యర్థము. ఇక, గోత్రతిలక అనుమాటకు పర్వతశ్రేష్ఠుడను నర్థమే కాక, ఉన్నతవంశసంజాతు డనియు అర్థము కలదు. కాన ఒకానొక నాయిక, నాయకున కొనర్చు సపర్యలును ఇందు ధ్వనించుచున్నవి. ఇట్లు అనేకార్థములను శ్లేషవశమునను, వ్యంజనారూపమునను, ప్రతిఫలింపజేయు సామర్థ్యము గ్రంథమం దంతటను గోచరించుమనే యుండును. సంస్కృతాంగ్లనాటకములలోని కొన్ని వాక్యములు పాత్రల కొక విధముగా అర్థమై, ప్రేక్షకులకు మరియొక విధముగా గోచరించుచుండును. దీనిని Dramatic Irony అందురు. ఈ శిల్పమును భట్టుమూర్తి పై సన్నివేశమున కల్పించెను.

కోలాహలమను పర్వతవిశేషము నొకదానిని శృంగార నాయకుని జేసి, ఈ కవి వర్ణించిన విధానము అత్యంతాశ్చర్యావహమైనది. ఈ శృంగార పురుషున కీ కవి అమర్చిన అలంకారము లత్యంతసహజము లైనవి పర్వతమున కుండు విశేషణములనే శ్లేషవశమున అలంకారములుగా మార్చెను. ప్రకృతమగు కథలో జడపదార్థమగు కొండ నాయకుడగుచో, రస మాభాసమై,

మధురానుభూతి యేర్పడజాలదు. కాన, ఈ కోలాహలము పర్వతము గాక, విలాసపురుషుడే అను భావమును మనకు స్ఫురింపజేసినాడు. ఇట ఉపయోగింపబడిన విశేషణము లన్నియు, శ్లిష్టములైనను, నాయకపరముగా అతి ప్రసిద్ధము లైనవి; అచలపరముగా నంత ప్రసిద్ధములు కావు.

"సుమనోధివాసభాసురశిఖోన్నతివాఁడు,
ఘనసారతిలకవాసనలవాఁడు,
ఘనసంకుమదసాంద్రగండభాగమువాఁడు,
నవపద్మరాగదంతములవాఁడు,
కలితోపకంఠనక్షత్రమాలికవాఁడు,
హరిచందనచ్ఛాయ నమరువాఁడు,
తపనీయమేఖలాధాళధళ్యమువాఁడు,
మణిపాదవలయధామంబువాఁ, డ
నర్ఘ్యరత్నావళీవిచిత్రాంబరాభి
రామశృంగారములవాఁడు, హైమగర్భ
గేహమున కేఁగువాఁడు, కోలాహలాఖ్యుఁ,
డొక ధరాధీశుఁ డెదు రయ్యె నువిద కపుడు."

(వసు. 2-108)

ఈ పద్యమున, బాహిరముగా, పుష్పాధివాసముచేత చెలువొందు సిగ కలవాడు, కర్పూరతిలక వాసనలతో గుబాళించువాడు, చెక్కిళ్ళకు సంకుమదము నలదుకొనినవాడు, అధరరాగముచేత నరుణమైన దంతములతో నొప్పువాడు,

నక్షత్రమాలికను కంఠహారముగా ధరించినవాడు, చందనానులేపనయుక్తుడు, సువర్ణమేఖలాయుతుడు, మణిమయపాద నూపురములు గలవాడు, రత్నమయ విచిత్రాంబరములను గట్టి, శుక్తిమతీసంగమ కుతూహలాయత్త చిత్తుడై, నడచివచ్చు ఒకానొక విలాసియు, శృంగారమూర్తియు నగు నాయకుని రూపము వర్ణింపబడినది. ఇట్లలంకరించుకొనిన కోలాహలు డను ఒక ధరాధీశుడు, శుక్తిమతికి ఎదురయ్యెను. ధరాధీశు డను మాటతో ఝటితి స్ఫూర్తికి వచ్చు అర్థము రాజు అనునదియే ఇట్లే అన్ని విశేషణములును ఉన్నవి. ఈ యిన్ని విశేషణములును, పర్వతపరముగ ఎంత చక్కగా నమరియున్నవో చూడుడు:- మిక్కిలి ఎత్తైన ఆ పర్వతశిఖరములపై దేవతలు నివసింతురు. అందలి కర్పూరపుటరటులు, తిలకవృక్షములు దివ్యగంధములను వెదజల్లుచుండును. అందలి గండశిలలు జవ్వాదితో నిండినవి. సానువులు పద్మరాగ మణిమయము లైనవి. దాని శిఖరములు నక్షత్రమండలమువరకు వ్యాపించి యున్నవి. అందలి హరిచందనవృక్షములు చల్లని నీడ నిచ్చుచున్నవి. దాని నితంబప్రదేశము సువర్ణమయమైనది. ప్రత్యంతప్రాంతము రత్నమయమైనది. ఆకాశములోనికి చొచ్చుకొనియున్న దాని శిఖరములు, తమయందలి రత్నకాంతులతోను, విచిత్రములగు ఆకాశపు వన్నెలతోను ఎంతో మనోహరముగా నున్నవి. ఇట్లు ఉభయార్థములలోను ఇంత చక్కగా విశేషణములను సమకూర్చుట సాధారణ కవుల కసాధ్యము.

ఈ చమత్కారమునే, శుక్తిమతీనదిని నాయికను చేసి, వర్ణించినపుడును చూడగలము —

"జీవన మెల్ల సత్కవిని
షేవిత, మాశయ మెల్ల నచ్ఛతా-
పావనతా - గభీరతల
పట్టు, ప్రచారము లెల్ల విశ్వధా

త్రివలయత్రికాలఫల
దేశికముల్, నవకంబులెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము,
లా నదిపెంపు నుతింప శక్యమే?"

(వసు. 2-105)

ఆమె జీవిత మంతయు సత్కావుల పొగడ్తలతో నిండి నట్టిది. ఆశయము లన్నియు, స్వచ్ఛతకును,పావనత్వమునకును, గాంభీర్యమునకును ఆటపట్టులు. ఆమె నడవడిక భూమండల మంతటికిని త్రైకాలిక శుభఫల సూచకము. వేయేల, ఆమె చక్కదనము ముక్తుల నైనను మోహవిభ్రాంతుల చేయజాలి నట్టిది - అని నాయికాపరమగు భావము.అసంఖ్యాకములగు జలపక్షు లా నదిని ఆశ్రయించి యుండును. అందలి మడుగులు నిర్మలత్వ-పావనత్వ-అగాధత్వ ములకు ఉనికిపట్టులు. నదీప్రవాహము అనేకముఖమై, సమస్తభూమండల మున ముక్కారు పంటలను పండించుచున్నది. అందలి శంఖము లన్నియును ముత్తెములకును, ఆవర్తములకును ఆధారభూతములైనవి-అని నదీపరమగు భావము.

సంగీత-సాహిత్యములు పరస్పరము శోభాదాయకములు. సాహిత్యము తోడి సంగీతము, సంగీతముతోడి సాహిత్యము అత్యంత హృదయావర్జకము లగు ననుట అనుభవైకవేద్యము. ఈ రహస్యము నెరిగిన మన ప్రాచీనకవు లెల్లరును సాహిత్యముతోబాటు సంగీతమునుకూడ ఉపాసించినవారే. మృదు మధురాక్షరసంయోజనానిర్మితములగు పద్యములు పాడుకొనుట కనువైనవై, మనోహరముగా నుండు ననుటకు, రామరాజభూషణుని ఈ పద్యమే నిదర్శనము—

"లలనాజనాపాంగవలనావసదనంగ
తులనాభికాభంగదోః ప్రసంగ,
మలసానిలవిలోలదళసాసవరసాల
పలసాదరశుకాలపనవిశాల,
మలినీగరుదనీకమలినీకృతధునీక
మలినీసుఖితకోకకులవధూక,
మతికాంతసలతాంతలతికాంతరనితాంత
రతికాంతరణతాంతసుతనుకాంత,
మకృతకామోదకురవకావికలవకుళ
ముకుళసకలవనాంతప్రమోదచలిత
కలితకలకంఠకులకంఠకాకలీవి
భాసురము వొల్చు మధుమాసవాసరంబు."

(వసు. 1-126)

మదోద్ధతమగు కోలాహలము గర్వ మడంచియు, సానుకంపుడై వసురాజు, అద్దానిని క్రీడాశైలము గావించుకొని, సుఖముగా రాజ్యపాలనము చేయు చుండెను. అంతలో చైత్రలక్ష్మి భూదేవికి ఉల్లసితపత్రలతాసౌగంధ్యమును, నవకళికా సౌగంధ్యమును ఒసగినది. అనగా మధూదయ మైనది. మధు మాసావిర్భావముతో ప్రపంచ మందలి సర్వప్రాణులును మోహపర వశము లైనవి. ఆ పారవశ్యపు చర్యలే ఈ పద్యమున వర్ణితములు. ప్రియాపాంగ వీక్షణములతో మదనావిష్టులైన కాముకులు గాఢాలిం గన సుఖముల ననుభవించుచున్నారు. మందమారుతములకు కదలియాడు

చిగురుటాకులతోను, మకరంద పూర్ణము లగు పూగుత్తులతోను ఒప్పారు చుండు తియ్య మామిడిచెట్లను ఆశ్రయించి, అందలి మధువుల తనివి దీర గ్రోలియు, వాని ఫలములను అభిలషించుచున్న చిలుక లంతట కూయు చున్నవి. శుక్తిమతీనదిలోని మడువులలో నుండు పంకజములయందలి మధురాసవముల కాసపడి, అసంఖ్యాకములగు తుమ్మెదలు వాని నాశ్రయించి నవి. వాని రెక్కల నల్లదనముతో నల్లగా భాసించు తామరతీగల నధివసించి, చక్రవాక వధువులు సంజాతసుఖము లైనవి. మనోహరముగా పుష్పించి యున్న పూబొదరిండ్లలో ప్రేయసీప్రియులు నితాంతరతిసుఖము ననుభ వించి, పరిశ్రాంతు లగుచున్నారు. ఉద్యానములలోని గోరంటలు, పొగడలు చక్కగా పుష్పించి, సహజ మధురములగు దివ్యగంధముల వెదజల్లుచుండగా, తదామోదమోహితములగు కోయిలలు అంతట కలయదిరుగుచు, అవ్యక్త మధురముగా కూయుచున్నవి - అని ఈ పద్యమునకు భావము. ఈ మధుర భావమున కనువగు విధమున ఈ కవి మంజులస్వనముల నీను మృదువర్ణము లతో నెంత చక్కగా నీ పద్యము నల్లినాడో చదువరు లూహింపగలరు. అట్లే ఈ క్రింది పద్యములోని అక్షరవిన్యాస మెంత సుందరముగా, వీనుల విందుగా నున్నదో చూడుడు—

"వీనుల విందై, యమృతపు
సోనల పొందై, యమందసుమచలదళినీ
గానము క్రందై, యా స్వన
మానందబ్రహ్మ మైన, నధిపతి వల్కెన్."

(వసు. 2-14)

ఇట్టి పద్యముల నెన్నింటినేని ఈ కావ్యమున చూడగలము.

రామరాజభూషణుడు సంగీతశాస్త్రమును నిరవశేషముగను, నిర్దుష్టముగను అభ్యసించి, అందలి రహస్యముల నన్నింటిని గ్రహించినవాడు. అందు వనే, ఇతడు సంగీతకళారహస్యనిధి యని కీర్తింపబడుచున్నాడు. ప్రకృతార్థమునకు చక్కగా సరిపోవునట్లు ఆ రహస్యముల నెన్నింటినో తన కావ్యమున పొందుపరచి, తన బిరుదమును సార్థకము చేసికొనినాడు. శిశిరవసంత ర్తువుల సంధి కాలమున గానము చేయబడునట్టిది హిందోళరాగము. ఇందు ఋషభ-పంచమ స్వరములు (రి—ప) ఉండవు. వసంతాగమన సమనంతరము వసంత రాగము పాడబడును. దానిలో ఋషభ—పంచమ—స్వరములును ఉండగలవు. సప్తస్వరసహితమై, సంపూర్ణ సంజ్ఞ గల దీ రాగము. ఈ సూక్ష్మాంశమును ప్రకృతార్థమున కనువుగా జోడించి, కవి ఇట్లు వ్రాసినాడు—

"అరిగాఁ బంచమ మేవగించి, నవలా
లవ్వేళ హిందోళ వై
ఖరి సూపం, బికజాత మాత్మరవ భం
గ వ్యాకులంబై, వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్
దాల్పం, దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహా
సంపూర్ణభావోన్నతిన్."

(వసు. 1-130)

వసంతాగమనమునకు పూర్వము స్త్రీలు ఋషభ-పంచమముల విడచి, హిందోళ రాగము నాలపింపగా, తమదగు పంచమ స్వరము లేకుండుటకు వ్యాకులత జెందిన కోకిలలు, పల్లవ మాత్రఖాదులై, తప మాచరించినవి. వానితపమునకు మెచ్చిన వసంతము (వసంతరాగము), సరిగా (ఋషభ సహితముగా)

పంచమమును స్వీకరించినది. అనగా వసంత ర్తుప్రవేశానంతరకాలమున స్త్రీలు హిందోళమును గాక, వసంత రాగమును కాలానుగుణముగా పాడి రని తాత్పర్యము. శాస్త్రీయమగు ఈ విషయము నింత బాగుగ ప్రకృతార్థమున సమన్వయించుట సుకరము కాదు.

ఈ కవి సంగీత కళారహస్య వేదిత్వమున కింకొక నిదర్శనము— కోనలో కేళీనివాసమున వీణ వాయించుచున్న ఒక అలివేణిని రాజసఖుడు విదూషకుడు చూచెను. ఆమె నాతడు తన మిత్రున కిట్లు వర్ణించి చెప్పుచున్నాడు—

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తి దగు గుబ్బ
కాయల కపరంజిచాయ లొసఁగ,
లలితాంగుళీదళంబులు సమేళములైన
సారెలపై రాగసంపద లిడఁ,
బాహుకంకణరుతుల్ ప్రాణానుబంధంబు
గల తాళగతి కనుగ్రహము లీన,
నాలాపభంగి యత్యక్తసంవాది స
మ స్వరంబులకు గ్రామంబు లునుపఁ,
బ్రచురతానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతనరీతిఁ దనరఁ,
జేతనంబు లచేతనభాతి నొనర,
వీణ వాయించు నొక యలివేణిఁ గంటి."

(వసు. 2-30)

వీణగుబ్బకాయలను వక్షస్థలమున కానించుకొని, ఆ యలివేణి వీణ మీటు చుండ, ఆమె వక్షోజముల బంగారు కాంతులు వానికి అపరంజిచాయ లొసగు చున్నవి. సమేళములైన వీణ మెట్లపై ఆమె కోమలాంగుళులు ఇటు నటు పర్వులెత్తుచుండ, అంగుళుల యరుణ వర్ణములు ఆ సారెలకును రక్తిమము నొసగుచున్నవి. కరకంకణ క్వాణములు (కాలాది ప్రస్తారాంతములగు తాళ ప్రాణానుబంధమగు)తాళప్రచారమునకు సమగ్రహములను కలుగజేయుచున్నవి. రాగ సంచారమార్గము (అత్యక్తసంవాది నామక) సమస్వరములకు అర్థా స్వర సమూహములను ఒసగుచున్నవి. రాగాలాపన క్రమమున ప్రచురములగు తానములచేతను, మూర్ఛనములచేతను, పారవశ్యము పొందిన చేతనములు అచేతనములభాతియు, ద్రవీభవించిన దారుశిలాద్యచేతనములు చేతనములవలెను భాసించుచున్నవి—అని భావము ఇందలి ప్రసేవకాది శబ్దములు శ్లేషవశమున సాంకేతికార్థములనే గాక, సామాన్యార్థములనుకూడ ఇవ్వజాలి యున్నవి. ఇట రామరాజభూషణుడు వీణ వాయించు పైఖరిని, వీణాంగములను,గానఫలమును హృదయంగమముగా వర్ణించియున్నాడు. ప్రసేవకము, సారె, ప్రాణాను బంధము, అత్యక్త సంవాది సమస్వరములు, గ్రామములు, తానములు, మూర్ఛనలు మొదలగున వన్నియు సంగీత శాస్త్ర సంబంధులగు పారిభాషిక పదములు. వీని నన్నింటిని శ్లేషాశ్లేషమున చక్కగా బిగించి, స్త్రీపరము గను మనోజ్ఞభావ మేర్పడునట్లు కల్పించుటలో విశిష్టశిల్పరహస్యమును ప్రదర్శించి తన సంగీత శాస్త్ర పాండిత్యమును అకృత్రిమ రీతిని చాటుకొనినాడు.

రామరాజభూషణుని భావనాశక్తి, వర్ణనానైపుణ్యము అసదృశము లైనవి. హర్షుని 'రత్నావళి' నాటకమున వత్సరాజును మన్మథునిగా భావించు కొని, అంతఃపురకాంతలు అనంగపూజ లొనరించునట్లు వర్ణింపబడి యున్నది. దానిని ఆధారము జేసికొని,ఈ కవి, గిరిక సఖులతో గూడి, మన్మథపూజ చేసి నట్లు వర్ణించియున్నాడు. హర్షుని పూజల కీతడు మెరుగులు పెట్టి, మంత్ర శాస్త్రానుగుణముగా ఆ విషయము నిట్లభివర్ణించినాడు—

పంచమమును స్వీకరించినది. అనగా వసంతర్తుప్రవేశానంతరకాలమున స్త్రీలు హిందోళమును గాక, వసంత రాగమును కాలానుగుణముగా పాడి రని తాత్పర్యము. శాస్త్రీయమగు ఈ విషయము నింత బాగుగ ప్రకృతార్థమున సమన్వయించుట సుకరము కాదు.

ఈ కవి సంగీత కళారహస్య వేదిత్వమున కింకొక నిదర్శనము— కోనలో కేళీనివాసమున వీణ వాయించుచున్న ఒక అలివేణిని రాజసఖుడు విదూషకుడు చూచెను. ఆమె నాతడు తన మిత్రున కిట్లు వర్ణించి చెప్పు చున్నాడు—

"వలుదగుబ్బలు ప్రసేవకవృత్తి దగు గుబ్బ
          కాయల కపరంజిచాయ లొసఁగ,
లలితాంగుళీదళంబులు సమేళములైన
          సారెలపై రాగసంపద లిడఁ,
బాళికంకణరుతుల్ ప్రాణానుబంధంబు
          గల తాళగతి కనుగ్రహము లీన,
నాలాపభంగి యత్యుక్తసంవాది స
          మ స్వరంబులకు గ్రామంబు లునుపఁ,
బ్రచురతానామృతముల మూర్ఛనలచే న
చేతనంబులు చేతనరీతిఁ దనరఁ,
జేతనంబు లచేతనభాతి నొనర,
వీణ వాయించు నొక యలివేణిఁ గంటి."

(వసు. 2-30)

వీణగుబ్బకాయలను వక్షస్థలమున కానించుకొని, ఆ యలివేణి వీణ మీట చుండ, ఆమె వక్షోజముల బంగారు కాంతులు వానికి అపరంజిచాయ లొసగ చున్నవి. సమేళములైన వీణ మెట్లపై ఆమె కోమలాంగుళులు ఇటు నట పర్వులెత్తుచుండ, అంగుళుల యరుణ వర్ణములు ఆ సారెలకును రక్తిమము నొసగుచున్నవి. కరకంకణ క్వాణములు (కాలాది ప్రస్తారాంతములగు తాః ప్రాణానుబంధమగు)తాళప్రచారమునకు సమగ్రహములను కలుగజేయుచున్నవి రాగ సంచారమార్గము (అత్యక్తసంవాది నామక) సమస్వరములకు అర్థ స్వర సమూహములను ఒసగుచున్నవి. రాగాలాపన క్రమమున ప్రచురములగ తానములచేతను, మూర్ఛనములచేతను, పారవశ్యము పొందిన చేతనములు అచేతనములభాతియు, ద్రవీభవించిన దారుశిలాద్యచేతనములు చేతనములవలెన భాసించుచున్నవి—అని భావము. ఇందలి ప్రసేవకాది శబ్దములు శ్లేషవశమున సాంకేతికార్థములనే గాక, సామాన్యార్థములనుకూడ ఇవ్వజాలి యున్నవి. ఇట రామరాజభూషణుడు వీణ వాయించు వైఖరిని, వీణాంగములను,గానఫలమును హృదయంగమముగా వర్ణించియున్నాడు. ప్రసేవకము, సారె, ప్రాణాను బంధము, అత్యక్త సంవాది సమస్వరములు, గ్రామములు, తానములు, మూర్ఛనలు మొదలగున వన్నియు సంగీత శాస్త్ర సంబంధులగు పారిభాషిక పదములు. వీని నన్నింటిని శ్లేషాశ్లేషమున చక్కగా బిగించి, స్త్రీపరముగను మనోజ్ఞభావ మేర్పడునట్లు కల్పించుటలో విశిష్టశిల్పరహస్యమును ప్రదర్శించి తన సంగీత శాస్త్ర పాండిత్యమును అకృత్రిమ రీతిని చాటుకొనినాడు.

రామరాజభూషణుని భావనాశక్తి, వర్ణనానైపుణ్యము అసదృశము లైనవి. హర్షుని 'రత్నావళి' నాటకమున వత్సరాజును మన్మథునిగా భావించు కొని, అంతఃపురకాంతలు అనంగపూజ లొనరించునట్లు వర్ణింపబడి యున్నది. దానిని ఆధారము జేసికొని,ఈ కవి, గిరిక సఖులతో గూడి, మన్మథపూజ చేసి నట్లు వర్ణించియున్నాడు. హర్షుని పూజల కీతడు మెరుగులు పెట్టి, మంత్ర శాస్త్రానుగుణముగా ఆ విషయము నిట్లభివర్ణించినాడు—

"గొజ్జఁగి మంచునం గలపి
    కూర్చిన పుప్పొడితిన్నెమీఁద, లా
మజ్జకకాయమానలస
    మానవిమానము క్రింద, నొక్క పూ
సెజ్జ ఘటించి, యం దొక కు
    శేశయకర్ణిక నిల్పి, యందు సం
పజ్జలజేక్షణాసుతుని
    భావము వ్రాసి కురంగనాభికన్."

(వసు. 3-168)

"అతని వామాంకమున రతి నావహించి,
మ్రోల నుడురాజు, ఋతురాజుఁ గీలుకొల్పి,
క్రేవల సగంధపవన - కోకిల - మరాళ -
కీర - సారంగముల వ్రాసి, చేరి చెలులు."

(వసు. 3-169)

"ధ్యానంబు హృదయవాస్తవ్యకుటుంబికి,
    నావాహనము జగద్వ్యాపకునకు,
నర్ఘ్య - పాద్యములు నారాయణప్రియసూతి,
    కభిషేక మబ్ధికన్యాంకశాయి,

కలరుదోయిళ్ళు పువ్వులవింటిదొరకు, గం
ధము గంధగిరిమరుద్బాంధవునకు,
ధూప మప్రతిమప్రతాపోష్మసురభికి,
దీపంబు తిమిరభయాపహునకు,
మధురసఫలోపహారంబు మధుప - కీర
పరిజనపరాయణున కంచు, భక్తి నొసఁగి,
'మానమదనాయ, మదనాయ, మధుసఖాయ,
మనసిజాయ నమో నమో' యనుచు మ్రొక్కి."

(వసు. 3-170)

"కామ! కమలాస్త్ర! కమలా
కాముకసుత! కామనీయకనిధి! యనుచుం
గామినులు విన్నవించిరి
కోమలకోకూయమానకోకిలఫణితిన్."

(వసు. 3-171)

పుప్పొడిని పన్నీటితో మర్దించి, దానితో ఒక తిన్నెను చేసి, దానిపై వట్టివేళ్ళ పందిరి వేసి, దానిలో ఒక పువ్వుల చప్పరము నిర్మించి, అందొక పుష్పశయ్య నమర్చి, దానిపై ఒక తామర దిమ్మె నిలిపి, దాని ఉపరితలమున కస్తూరితో మన్మథుని రూపు చిత్రించి, అతని యెడమ తొడపై రతీదేవిని, సన్నిధాన మున చంద్ర - వసంతులను, పార్శ్వములలో మలయ మారుతమును, కోకి

లను, రాజహంసమును, చిలుకను, తుమ్మెదలను చిత్రించిరట. ఇట్లు సపరివారుడగు రతీయుత మన్మథుని నిరూపించి, ఆవాహనాది - షోడశోపచారములతో ఆతని పూజించిరి. సమస్తపరివారు లగు శ్రీమన్నారాయణాది మహాదేవతల పూజావిధాన మెట్లుండునో, అట్లే ఈ పూజాక్రమ మంతయు నిచట నిర్వహింపబడి యున్నది. మహామంత్రములతో ధ్యానావాహనాదుల సంకల్పించునటులే, ఇక్కడను, ధ్యానాదులకు ఒక్కొక్కదానికి ఒక్కొక్క మదన మహామంత్రము కల్పింపబడియున్నది. షోడశోపచారములలో ఆచమనీయ - వస్త్ర-యజ్ఞోపవీతధారణ-తాంబూల సమర్పణ-ప్రదక్షిణములు తప్ప, మిగిలిన వన్నియు ఇట నిర్దిష్టములై యున్నవి.ఇవియును ఊహ్యములను తలంపుతో కవి వానిని వాచ్యముల జేసియుండడు.'మానమథనాయ మదనాయ నమః', 'మధుసఖాయ మనసిజాయ నమః' అను ద్వాదశాక్షరీ మంత్రద్వయమునకును ఈ మహాకవి ద్రష్టయై, వానిని లోకమున కనుగ్రహించి యున్నాడు. ఈ మహామంత్రములతో గిరికయు, సఖులును మదను నర్చించి, సాగిలబడి మ్రొక్కి, తమ అకించనత్వమును నివేదించి, శీతాంశో రమృతార్పణ మ్మనురీతిని కేవల కృపాభావముననే తమ పూజల పరిగ్రహింప ప్రార్థించిరి. మన కావ్యములలో తరచుగా మన్మథదూషణమే కానుపించును. ఇట్టి పూజా విధానమును రామరాజభూషణుడే ప్రథమముగా సృష్టించి, తన అద్వితీయత్వమును ప్రదర్శించెను. ఈ వర్ణన మెంతయు సహజము, నిర్దుష్టము నై, పాఠకుల హృదయముల చూరగొను ననుటలో సందేహము లేదు.

రామరాజభూషణుని భావనలే విచిత్రములుగా నుండును. భావిత విషయములను సాలంకారముగా అతడు వర్ణించు రీతి మరింత విచిత్రముగా నుండును. ఆకాశగంగలో మాత్రము సువర్ణ కమలములు పుట్టుటకు కారణమి ట్లూహింపబడినది——

"అలఘుస్యందనకోటి వీటిమఱర
ధ్యావాటికాహాటకా
కలితక్షోణుల నేగుచోఁ జటులచ
క్రక్షుణ్ణతత్తోదముల్
గలయం బర్వి, సుపర్వలోకనదిలో
గాంగేయపంకంబు జొ
బ్బిలఁ జేయం, దఱుచై జనించి యచటం
బెంపొందుఁ బొందామరల్."

(వసు. 1-103)

ఆకాశగంగలో మాత్రమే బంగారు తామర లేల జన్మించుచున్నవిం అనగా - అధిష్ఠాన పురమందలి రత్నపుటుటు తాపిన బంగారపు వీధులలో అసంఖ్యాకము లగు మహారథములు అనవరతము సంచరింపగా, రేగిన బంగారపు దుమ్ము అత్యధికమై, పైపైకి వ్యాపించి, ఆకాశగంగలో బంగారపు బురదను ఏర్పరుపగా, ఆ సువర్ణ పంకమునుండి జన్మించుటచేతనే అవి పొందామరలైన వని కవి భావించుటయు, దాని నిట్లు అతిశయోక్త్యలంకారముతో వర్ణించుటయు అద్భుతావహము గద!

ఇట్లే ఈ కవి కల్పవృక్షము లను పేరెట్లు ఆ చెట్లకు కలిగెనో భావించినాడు——

"పురిపూఁదోఁటలతావి మిన్నలమ, వే
ల్పుల్ మెచ్చి, తద్భూజభా
స్వరసంతానములన్ దివిం బెనుప, నా
సంతానముల్ దివ్యవి

ర్ఝరిణీనిర్మలవారిపూరపరిపో
షం బందియుం, దన్మహా
తరులక్ష్మీపరిపూర్తి గాన కెనఁగెం
దత్కల్పశాఖిప్రథన్."

(వసు. 1-108)

అధిష్ఠానపురోద్యానములనుండి పుష్పసౌరభము వెలువడి, ఆకాశమున వ్యాపింపగా, దేవలోకవాసులు ఆ వాసన వినూత్నమైన దని మెచ్చి, ఆ పూల మొక్కలను వారి నందనోద్యానములో నాటికొని, వియద్గంగా జలముతో పెంచినను, వీని సౌరభాతిశయము వానికి దక్కక, అవి ఈషన్న్యూనములుగనే యుండినవి. అందుననే వానికి తత్కల్పశాఖులు, లేక కల్పశాఖు లను పేరేర్పడెనట. కల్పవృక్ష శబ్దమునకు యోగముచే అన్వర్థమును కల్పించి, నిరుక్త్యలంకార యుక్తముగా, ఈ భావితార్థము నిట్లు వర్ణించిన కవి ప్రతిభ అద్వితీయము.

చక్కని ఉత్ప్రేక్షా లంకారములు కల్పించుటచే నన్నెచోడ మహాకవికి ఉత్ప్రేక్షా వల్లభు డను ప్రతీతి యేర్పడియున్నది. రామరాజభూషణుని ఉత్ప్రేక్షలను చూచినచో, ఈతనికిని ఆ బిరుద మెంతయు తగియున్నదని తోపగలదు.

"పరభూభృత్ప్రాప్తి నష్టం బడు రవిహయులం
బ్రౌఢిఁ బాటింప వెందున్
సరిగాఁ దద్దిక్క్రుతుల్ సైచక, రవి హరియై,
చాయకున్ రా, నడంచుం

జరణోద్యద్ధూళిఁ దద్వ్యాసతఁ దగు హరియున్
సప్తిగాఁ బాదధారా
స్ఫురణం బే వింత యంచుం బురిహరులు నగుం
బూర్ణధారాసమృద్ధిన్."

(వసు. 1-102)

ఇందు అధిష్ఠానపురాశ్వములు వర్ణింపబడినవి. ఆ గుఱ్ఱములు, శత్రురాజు వచ్చె నని వినగనే సముద్రమున దుముకు సూర్యాశ్వములను సరిగా లెక్కజేయవు. ఆ యవమానమును భరింపనేరక, రవియే హరియై, (హరి=సూర్యుడు, గుఱ్ఱము) వానితో పోలికకు రాజూడగా, కాలిదుమ్ముతో నాతని నావరించి అణచివేయును. ఈ తిరస్కారమును ఓర్వలేక, సూర్యమండలాంతర్వర్తి యగు శ్రీమన్నా రాయణుడే హయగ్రీవుడై రాగా, 'పూర్ణధారాసమృద్ధిగల మాతో పాదధారా స్ఫురణముగల నీ కేమి దీ' టని, అతనిని చూచి, సోపహాసముగ నవ్వునట. ఈ ఉత్ప్రేక్షలు హృద్యములని వేరుగ చెప్పబనిలేదు.

"వదనవనజహృతాంశుసర్వస్వుఁ డగుచుఁ
గుందు నిందుని, దరహాసకందళమున
మనుపు మని, పాదముల వ్రాలి, చనని విధుని
కొమ్మ లన, నింతిమృదునఖాంకురము లమరు."

(వసు. 2-34)

గిరికాముఖకమలము, కిరణరుచిసర్వస్వమును హరించివేయగా, శోభా హీనుడై చంద్రుడు కుందుచుండెను. తమ ప్రాణేశు డిట్లు క్రుంగి కృశించుటను సహింపనేరక, అతని భార్యలగు నక్షత్రములు 'నీ చిరునగవు మొలకతో

మా ప్రాణేశుని మనుపకున్న, నీ పాద పంకేరుహములనుండి మేము లేచు నది లేదు' అని గిరిక పాదములపై వ్రాలి, లేవకున్నవో అనునట్లున్నవట ఆమె పాదనఖములు. ఆమె ముఖము చంద్రుని జయించి, పద్మమును బోలి యున్నదనియు, చిర్నగవు వెన్నెలవలె నున్నదనియు, పాదనఖములు నక్షత్ర ముల బోలియున్న వనియు తాత్పర్యము.

ఇట్లీ కవి అసమాన సామర్ధ్యముతో అనేకాలంకారముల నుపయో గించియు, ఆయా విషయములను వినూత్న పద్ధతిలో నూహించి, వర్ణించియు, పాఠకులను ఆశ్చర్యచకితులను చేయుచుండును.

రామరాజభూషణుడు తన వసుచరిత్ర మహాప్రబంధమున ప్రవేశపెట్టిన మరియొక విశిష్ట లక్షణము నాటకీయత. ఇది నూతన విషయము కాక, ప్రాచీనమే అయినను, దీనిలో ప్రత్యేకత కలదు. నాటకములలో నాందివలె కృత్యాది పద్యము కావ్యార్ధ సూచకమై యున్నది. కథాంత పద్యము మంగళా శంసనరూప మగు భరతవాక్యమును బోలియున్నది. శృంగార నాటకములలో అతిప్రధానమగు విదూషక పాత్రము ఈ కావ్యమున ప్రవేశపెట్టబడి యున్నది. ఇది ఈతడు కల్పించిన ప్రథమ సృష్టియే. ఈ విదూషకుడు, నాటకములలో వలెనే, రాజునకు ప్రియవయస్యుడై, నాయికా సంధానమున తోడ్పడును. భ్రూభంగ - దృగ్వివర్తనాది - నాట్యప్రక్రియలును, వ్యంజనాప్రధానము లగు ఉక్తిప్రత్యుక్తులును, ప్రాతప్రవేశ-నిష్క్రమణాది సూచనములును రూపకము లలోవలె, ఈ ప్రబంధమునను సూచింపబడి యున్నవి. ప్రబంధము వర్ణనా ప్రధానము, విచిత్రపద్ధతులలో భావప్రకటనపరము నగుటచేత, ఈ కావ్యమున కథాగమనమునకు అట నట అంతరాయము లేర్పడునట్లు తోచును. కావ్యధర్మ ములగు ఇట్టివానిని దూరముచేసి పరికించితి మేని, ఈ కావ్య మొక శృంగార నాటకముగనే తోపగలదు.

స్థాలీపులాకన్యాయముగా ఒక ఘట్టమును పరిశీలింతము. విదూషకుడు కపటయతిగా, సఖీజన పరివృతయగు గిరికాదేవిని సమీపించి, వసుక్ష్మానాథుడే ఆ లలనను వివాహమాడు ననియు, తన మంత్రప్రభావముతో ఆ రాజు నటకు రప్పింతు ననియు పలుకును. తత్క్షణమే వయస్యుని సంకేతమును గ్రహించి, నాయకుడు రంగస్థలమున ప్రవేశించును—

"లలనా! యీ యెలనాఁగఁ బెండ్లియగు వా
లాయంబు చేదిక్షమా
తలనాథుం, డిది నమ్మవేని, నిజమం
త్రప్రౌఢి రప్పింతు నా
నల - నాసత్య సమానుఁ, జూడు మని, పం
తం బొప్ప, మాయాజపా
కలనాదంభము పూని, మౌని దిశ లా
కర్షించి, మజ్జా యనన్."

(వసు. 3-44)

"ఇది సంధింపఁగ వేళ యంచు వసురా
జేంద్రుండు, నీరంధ్ర నీ
రదవారప్రతిసీర వెల్వడిన తా
రాభర్తలీలన్, లతా
చ్ఛదసంఛాదికఁ బాసి, నిల్చె నెదుటన్,
సారంగరాగభ్రమ
న్మదభృంగీరుతి వందిమాగధకథా
మాధుర్యముం దెల్పఁగన్."

(వసు. 3-45)

మహారాజోచితమగు రీతిని, వందిమాగధులు కైవారములు చేయుచుండ, తెర యించుక తొలగగా, వసురాజేంద్రుడు రంగస్థలమున ప్రవేశించి, వారియెదుట నిల్చె నని కల్పించుట నాటక సంప్రదాయోచిత పద్ధతి.

అభిజ్ఞానశాకుంతల నాటకమున నాయిక, ప్రియు నెడబాసి చనలేక చనలేక చనునప్పుడు, అడుగడుగున సాకు కల్పించుకొని, వెనుదిరిగి ప్రియుని చూచుచుండును. "అనసూయే! అభినవ కుశసూచ్యా పరిక్షతం మే చరణమ్; కురవకశాఖాపరిలగ్నం చ వల్కలమ్, తావ త్పరిపాలయ మాం, యావ దేనం మోచయామి. (ఇతి సవ్యాజం విలంబ్య, సహ సఖీభ్యాం నిష్క్రాంతా.)" ఈ సన్నివేశమునే గిరికాదేవి నిష్క్రమించు సమయమున నీ కవి ఇట్లు పొందుపరచి యున్నాడు—

"కలికియు నా నృపాలకునిఁ
గ్రమ్మఱఁ జూచుచు నేగె నేర్పుతో,
నలఘుపదాంగదధ్వనికి
నంచలు మూఁగిన, నిల్చి, నెయ్యపుం
జెలువలఁ గూడఁ బిల్చు గతిఁ,
జిల్కకుఁ బార్శ్వలతాంచలంబులన్
ఫలము వెమల్చు రీతి, నళి
పంక్తికి మోము మలంచు కైవడిన్."

(వసు. 3-78)

నాటకరంగస్థలమున ప్రధానపాత్ర ప్రవేశము జరుగునపుడు, తెర కొంత కొంతగా క్రిందికి జారుట, అప్పట్టున పాత్రయొక్క మౌక్తికపట్టము, ఫాలభాగము, మోము, తదుపరి అవశిష్టశరీరభాగము క్రమక్రమముగా

కన్పించుట ప్రాచీనరంగస్థల సంప్రదాయము. దీని ననుసరించి చంద్రోదయము నీ కవి అత్యంత మనోజ్ఞముగా నిట్లు వర్ణించినాడు—

"హరిదంభోరుహలోచనల్ గగనరం
గాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలిం
పన్, రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్, నిటలమున్,
వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతి వొల్చె, రేకయి, సగం
బై, బింబమై తూర్పునన్."

(వసు. 4-17)

రామరాజభూషణునకు అన్ని విషయములలోను మనుచరిత్రమే ఆదర్శమైనను, గిరికాపాత్రచిత్రణమున నాతని దృక్పథము విభిన్నమైనది. గిరిక విదగ్ధ, చతురవచోవిలాసిని. ఆమె పలుకులలో గాంభీర్యము, కృత్యములలో చతురతయు ప్రస్ఫుటములై యుండును. వరూధినివలె ఈమె కామమోహితయై, స్వాభిమానమును పోనాడుకొను బేలయు, అవిమృశ్యకారిణియును కాదు. తా వలచిన సుందరుని పొందుటకై వరూధినివలె పలుపాట్లు పడలేదు. 'న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్' అనునది ఈమె విశ్వాసము. ప్రబంధమున కావశ్యకమైన వర్ణనాబాహుళ్యముతో సుదీర్ఘమగు విరహవేదనను మాత్రము అనుభవింపక ఈమెకు తప్పలేదు. వరూధిని, ప్రవరుని బాహ్యాకృతికే లోగిపోయి, మాయాప్రవరుని మోసమును గుర్తెరుంగజాలక,

ఆతని యిచ్చవచ్చినరీతిని నడచుకొనుచు, కాలము గడిపిన అనభిజ్ఞ. గిరికయో, బాహ్యసౌందర్యముతోబాటు, అంతస్సౌందర్యమును గూడ గుర్తింపగల నేర్పరి; వ్యక్తిత్వము గల వివేకవతి. స్వాభిమానమును పూర్తిగా విడనాడి, ప్రియుడు చెప్పినట్లెల్ల కనులు మూసికొని నడచుకొను దుర్బలహృదయ కాదు. తన వలపులసామిచెంత నేర్చిన సాహిత్య రహస్యములనే ఆతనికి ధ్వనివ్యక్తితో ప్రత్యుపదేశ మీయజాలిన ప్రజ్ఞావతి, స్వాభిమానపూర్ణ.

"సతి సాహిత్యరహస్య మీశువలనన్
సాధించి, తోడ్తోనఁ ద
త్పతికిం బ్రత్యుపదేశ మిచ్చె, నతుల
ప్రౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
చ్ఛ్రుతికిం జొన్పుచు, లోచనాంజనరస
ప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయుచుఁ బ్రత్యలంకరణ మౌ
ఖర్యంబు దీపింపఁగన్."

(వసు. 6-94)

ప్రియుడు తనకు రతిరహస్యముల నేర్పగా, తాను ఏకసంథాగ్రాహిణియై, తత్క్షణమే ప్రత్యుపదేశము చేసినదట. (పార్వతీదేవి మహేశునివలన సాహిత్య విద్యామర్మముల నెరింగి, వెనువెంటనే వానినెల్ల తిరుగ, పతికి నుపదేశము చేసె నని—ఇట అర్థాంతరమును భాసించుచున్నది.)

ఆంధ్రప్రబంధ శిల్పాగారమందలి దివ్యమూర్తులకెల్ల శిరోమణియైనది రామరాజభూషణుని గిరిక. ఆమె యొక దివ్యజ్యోతి; రసగుళిక, అమృతమయ మూర్తి

సాధారణవర్షాగమ వృత్తాంతమే ఋగ్వేదమున వృత్రాసురకథయై యుండును. మేఘరూపమును ధరించి, ఆ రాక్షసుడు ఆకాశము నాచ్ఛాదించి, అధోలోకములకు జలమును లేకుండ జేసెను. త్రిలోకాధిపతియగు దేవేంద్రుడు విద్యుద్రూపమగు తన వజ్రాయుధముతో ఆతని సంహరించెను. ఈ కథయే వ్యాసభారతమున వసురాజు వృత్తాంత మైనది. రాజే ఇంద్ర స్థానీయుడు, కోలాహలుడే వృత్రాసురుడు; శుక్తిమతియే నిరుద్ధజలము, గిరికయే ఇంద్రుడు లోకముల కనుగ్రహించిన నీరు. ఈ భారతకథనే రామరాజభూషణుడు తన కావ్యమున కితివృత్తముగా స్వీకరించి, తగురీతిని రూపొందించుకొనినాడు. వసుశబ్దమునకు జల మనియు అర్థము కలదు గాన, వసుచరిత్ర మని నామకరణము చేయుటతో రామరాజభూషణుడు, ప్రాచీనజల వృత్తాంతమును, దాని రూపాంతరమగు వృత్రాసుర వృత్తాంతమును, దానికే మారురూపమగు వసురాజవృత్తాంతమునుకూడ సూచించియున్నా డని శ్రీ 'ప్రసన్న'గా రూహించుచున్నారు. ఇది యుక్తియుక్తముగా తోచును. కథ ఎట్టి దైన నేమి? దానిని నిర్వహించుటలో ఈ కవి ప్రదర్శించిన ప్రతిభా వైభవమును, పాండితీగరిమయు, కల్పనాపాటవమును, ఆలంకారిక రచనా విధానమును పరమోత్కృష్టములైన వనుటలో మాత్రము వివాదమునకు అవకాశము లేదు

వ్యాఖ్యాన నిరపేక్షముగా వసుచరిత్రములోని చాల పద్యములను అర్థముచేసికొనుట, పండితులగు కొందరకే సాధ్యమగును కాని, సాధారణులగువారి కవి దురవగాహములే. అంతమాత్రముచేతనే ఈ మహాప్రబంధ

మును అనాదరించుట ఉచితము కాదు. సంస్కృత పంచ మహాకావ్యములలో శ్రీహర్షుని నైషధమువలెనే, ఆంధ్ర పంచ మహాకావ్యములలో వసుచరిత్ర మును అతిప్రౌఢమైనది. అందు దాని కెంతటి గౌరవస్థానము కలదో, ఇందు దీనికిని అంతటి గౌరవస్థానమే కలదు. అల్పదోషమునైనను సైరింపని సంస్కృత కవిపండితులే, దీని మహత్త్వమునకు తల లూచి, సంస్కృతీ కరించుకొని, తమ గౌరవభావమును వెలిబుచ్చిరి. అప్పయదీక్షితులవారి శిష్యు డగు కాళహస్తికవి యథాతథముగా దీనిని సంస్కృతీకరించెను. 'జీవనమెల్ల సత్కవివినిషేవిత' మను పద్యమునకు ఆతని సంస్కృతానువాద మిది—

"యజ్జీవనం కవివినోది, యదంతరంగమ్
అచ్ఛం, గభీర, మతిపావన, మర్థదాయి,
ధాత్రీత్రికాలఫలదా గతయో యదీయాః,
ముక్తాళివిభ్రమభరా హి యదబ్జలీలాః."

ఈ సంస్కృతకావ్యమందును ఆరాశ్వాసములే కలవు. మూలమందలి ఆంధ్ర కవిస్తుతియు, అట్లే సంస్కృతీకరింపబడియుండుట విశేషము.

వసుచరిత్రము ప్రబంధముగనే కాక, నాటకరూపమున కూడ సంస్కృతమునకు పరివర్తింపబడియున్నది. శ్రీధరవంశ్యుడగు పేరుసూరి దీనిని 'వసుమంగళ నాటకము' గా విరచించెను. పిడుపర్తి బసవన మనుమ డగు పిడుపర్తి పాలయకు శిష్యుడైన అంబలత్తాడుమయ్యన్ అను తమిళ కవి ఈ కావ్యమును తమిళములోనికి అనువదించెను. కావలి వేంకటస్వామి యనునతడు కృత్యాది పద్యములను, గిరికావసురాజుల సమాగమ వృత్తాంత మును ఆంగ్లములోనికి పరివర్తనము చేసెను. వేములవాడ రాజేశ్వర స్వామి భక్తుడగు సోమకవి ఈ ప్రబంధమునకు 'విద్వజ్జన రంజని' అను వ్యాఖ్యను సులభశైలిలో రచించెను.

తర్వాతి ప్రబంధముల కెన్నింటికో వసుచరిత్రము ఆదర్శప్రాయ మైనది. ఇది మాతృకగా వెలువడిన కనుపర్తి అబ్బయామాత్యుని 'పురూరవ శ్చరితము', అడిదము సూరకవి 'కవిజన మనోరంజనము', కృష్ణకవి 'శకుంతలాపరిణయము', తిమ్మకవి 'రసికజనమనోభిరామము'ను పిల్లవసుచరిత్రము లని ప్రఖ్యాతి బడసియున్నవి. శ్రీమద్రామాయణమునకు సంగ్రహ రూపమగు బాలరామాయణమువలె, వసుచరిత్రమునకును సంక్షిప్తరూప మగు ఏకాశ్వాసగ్రంథ మొకటి వెలసినది. ఇదియును పిల్లవసుచరిత్ర మను పేరనే వ్యవహరింపబడుచున్నది.

ఎల్లరను పరిహసించు స్వభావము గల తెనాలి రామకృష్ణ కవి తన పాండురంగమాహాత్మ్యములో నిగూఢముగా, వసుచరిత్రమును సంస్మరించి, దానిపై తన కుండు గౌరవభావమును ఇట్లు ప్రకటించుకొనెను—

"గిరికానుషక్తబుద్ధి ను
పరిచరునిం బోలు నొక్క పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటనుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్."

(పాండు. 4-242)

ఇట్లు సమకాలమునను, ఉత్తరకాలమునను, ఉత్తమ గౌరవాదరములకు పాత్రమైనది వసుచరిత్రమహాకావ్యము.

రామరాజభూషణుని మరియొక రచనము 'హరిశ్చంద్రనలోపాఖ్యానము'. నిర్భరవయఃపరిపాకమున రచింపబడిన దీ కావ్యము. సూరనకవి విరచిత మగు 'రాఘవపాండవీయము'నకు ప్రతిద్వంద్విగా ఈ ద్వ్యర్థికావ్యము నీతడు

రచించెను. రామాయణ భారత కథలలో పరస్పరము సంవదించు కథా భాగములును, సన్నివేశములును నుండిన నుండవచ్చును గాని, హరిశ్చంద్ర కథకును, నలచరిత్రకును సమానములగు పట్టులు అరుదుగనే యుండగలవు. అయినను ఈ ద్వ్యర్థి కావ్యమును భట్టుమూర్తి కడు సామర్థ్యముతో నిర్వహించెను. సూరన, కథాంశమునకే ప్రాధాన్యము నిచ్చి, వర్ణన భాగమును తగ్గింపగా, నీ కవి కథాంశములతో బాటు, అష్టాదశవర్ణనములను, కల్పనా విశేషములను కూడ సమకూర్చి, ద్వ్యర్థికావ్య నిర్మాణమునందును తన వైశిష్ట్యమును ప్రదర్శించెను. మహారాజును—చండాలుని, రాజధానిని—శ్మశానమును ఒకే పద్యములో వర్ణించుట దుర్ఘటమగు కార్యము. అది ఈ కవికే సాధ్యమైనది.

రామరాజభూషణుని మరియొక గ్రంధము 'నరసభూపాలీయ' మను వ్యవహారము గల 'కావ్యాలంకారసంగ్రహము.' ఇది అయి దాశ్వాసముల అలంకార గ్రంధము. 'ప్రతాపరుద్రయశోభూషణము'న కిది అనువాదమని కొందరి యభిప్రాయము. కవులకును, కావ్యధర్మ జిజ్ఞాసువులకును ఉపకారావహమై యుండుటయే దీనిపరమోద్దేశ్యము. ఈ లక్షణ గ్రంధమునకు లక్ష్యముగనే వసుచరిత్రము రచింపబడినట్లును లోకప్రతీతి గలదు.

ఇట్లు బహుగ్రంధకర్తయు, మహాకవిశిరోభూషణుడు నైన రామరాజ భూషణుని పాండితీ వైభవాదులను మన మూహించుట కంటె, కావ్యాలంకార సంగ్రహమున నీ కవి చెప్పిన మాటలనుబట్టియే యరయుదము—

"శతలేఖినీపద్యసంధానధౌరేయు,
ఘటికాశతగ్రంథకరణధుర్యు,
నాశుప్రబంధబంధాభిజ్ఞు, నోష్ఠ్యని
రోష్ఠ్యజ్ఞు, నచలజిహ్వోక్తినిపుణుఁ,

దత్సమభాషావితానజ్ఞు, బహుపద్య
సాధితవ్యస్తాక్షరీధురీణు,
నేకసంధోదితశ్లోకభాషాకృత్య
చతురు, నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు,
నమితయమకాశుధీప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్రప్రసిద్ధ
నరసవేంకటరాయభూషణుసుపుత్రు
నను బుధవిధేయు శుభమూర్తినామధేయు.''

(కావ్యా. సం. 1-13)

ఈ పద్యమున, స్వశక్తులుగా కవి చెప్పికొనిన గుణవిశేషము లన్నియు స్వభావోక్తులో, లేక న్యూనోక్తులో అయియుండవలెనేగాని, అతిశయోక్తులో, లేక అత్యుక్తులో అయియుండవు.

రామరాజభూషణుని వంటి మహాకవిని, వసుచరిత్రము వంటి మహా ప్రబంధమును పొందగల్గిన ఆంధ్రులు ధన్యులు.

# సంస్కృతభాషాప్రాశస్త్యము

"సంస్కృతం నామ దైవీ వాక్ అన్వాఖ్యాతా మహర్షిభిః."

(దండి. కావ్యా. 1-33)

సంస్కృతమును దైవభాషగా మహర్షులు కీర్తించిరి—అని దండి సంస్కృతభాషాప్రాశస్త్యమును పేర్కొనెను.

"జనని సంస్కృతంబు సకలభాషలకును" అని వల్లభరాయడు తన "క్రీడాభిరామము"లో నుడివెను. దీనికి కారణము—మన దేశభాషలలో సంస్కృత పదజాలము విరివిగా నుండుట, దేశభాషా వ్యాకరణములపై సంస్కృతభాషావ్యాకరణ ప్రభావము అధికముగా నుండుటయు. రసభావాదులను సంగ్రహముగను, వ్యంగ్య రూపముగను, శక్తివంతముగను వ్యక్తీకరింపగల సామర్థ్యము సంస్కృత భాషకు అనంతము.

సంస్కృత భాషనుగూర్చి మోనియర్ విలియమ్స్ తన "హిందూయిజమ్" అను గ్రంథమున —"భారతదేశములో సుమారు ఐదువందల ప్రాంతీయభాష లున్నను ఒకే దైవభాష, ఒకే పవిత్ర సారస్వతమును ఉన్నవి. ఉత్తమ-నీచ-మత-ప్రాంతీయ-భేదములు లేక భారతీయు లందరు వానిని పూజింతురు. సంస్కృతభాష వేదములకు రక్షణభవనము; భారతీయ న్యాయ వేదాంతాది శాస్త్రములు, పురాణములు మొదలగువానికి ఒక వాహక సాధనము. సంస్కృతభాషాదర్పణమున భారతీయుల భావములు, ఆచార వ్యవహారములు, సంస్కృతి మొదలగున వన్నియు సుస్పష్టముగా గోచరిం

చును. ఇంకను చక్కగా చెప్పవలయునన్న, సంస్కృతభాషను ఒక గనితో పోల్పవచ్చును. ఆ గనినుండి వలయునంత పదార్థమును గైకొని, దేశభాషలను అభివృద్ధి చేసికొనవచ్చును." అని సర్వతోముఖమగు సంస్కృతభాషా ప్రాభవమును కొనియాడెను.

మన ప్రాచీన వాఙ్మయ రహస్యములను, సౌందర్యములను గ్రహించుటకు సంస్కృతభాషాజ్ఞానము అత్యంతావశ్యకము. విషయ పరిజ్ఞానమున కనువాదము లున్నను, కూలంకషపరిశోధనకు గాని, అందలి సహజసౌందర్యముల నాస్వాదించుటకు గాని మూలగ్రంధపఠనము ముఖ్యావసరము. ఈ విషయమును గుర్తించియే మేగ్డనాల్డ్, మాక్సుముల్లర్, కీత్ మున్నగు పాశ్చాత్య పండితులు సంస్కృతభాషాధ్యయనము చేసి, తమ జీవితములను సంస్కృత భాషా సారస్వత వ్యాసంగమునకు వినియోగించిరి. పదజాలములో పరిపూర్ణత్వము, దుర్బోధములగు భావములను కూడ వ్యక్తీకరింపగల సౌలభ్యము, ఉన్నతభావములనుసైతము సంక్షిప్తముగా చెప్పగలుగు సామర్థ్యము, భావ విస్తరణకై క్రొత్త క్రొత్త రూపములను సృష్టించుకొనజాలిన అవకాశము— మున్నగు ఉత్తమ భాషాలక్షణములు సంస్కృతభాషకు గలవు. ఈ అద్భుత గుణములను చూచియే సర్ విలియం జోన్స్ "సంస్కృతభాష-దాని ప్రాచీనత ఎట్టిదైనను-ఆశ్చర్యకరమగు నిర్మాణము గలది; అది గ్రీకు భాషకంటె నిర్దుష్టమైనది; లాటిన్ భాషకంటె సంపూర్ణమైనది; ఈ రెండు భాషలకంటె పరిపక్వమైనది." అనెను.

ఈ భాష ధాతుజన్యము. ధాతుపాఠమున మనకు రెండువేలవరకు ధాతువులు లభించును. ఇవిగాక వైదికభాషకు సంబంధించినవి, సౌత్రము లైనవి మరి రెండువేలధాతువు లుండవచ్చును. ఇన్ని మూలధాతువు లున్న భాష మరియొకటి లేదు. ఈ ధాతువులనుండి చిత్రవిచిత్రములగు రూపములను కల్పించుకొను నవకాశ ముండుటచే నిది విపుల శబ్దజాల సంయుక్తమై యున్నది.

# సంస్కృతభాషా ప్రాశస్త్యము

అనేకదేశ ప్రజలు అనాగరకులై యున్న కాలముననే, భారతీయులు అత్యుత్తమ సంస్కృతిసంపన్నులుగా వెలసిరి. మానవుడు ఐహికముగా తన కవసరమైన వస్తుజాలమును సమకూర్చుకొని, దానివలన సుఖమును, సంతృప్తిని పొందగోరి, ఈ ఉపకరణములలో గూడ సౌందర్యము నాపాదింప యత్నించెను.

మానవుడు తన మనస్సును సృష్టిరహస్యములపై మరలించి, తన విమర్శనాజ్ఞానముతో దర్శింపగలిగిన తత్త్వములను మంత్రరూపమున వెలయించెను. ఆ మంత్రములే వేదము లైనవి. సాయనాచార్యులు వేదభాష్యము లను రచించి, వానిని సులభగ్రాహ్యములుగా జేసెను. సంస్కృతభాషా ప్రాభవమును గుర్తించిన జర్మనీదేశ పండితుడు మాక్సుముల్లర్ వేదరాశిని మథించి, అర్థనిర్ణయము చేసి, సంస్కృతభాష కపారమైన సేవ చేసెను. ప్రపంచవాఙ్మయమున ఋగ్వేదము మొదటిదన్నను అతిశయోక్తి కానేరదు. వేదములు అపౌరుషేయము లనియు, ప్రతికల్పమునను మహర్షు లా మంత్రము లకు ద్రష్ట లగుదు రనియు, పరమాత్మవలె నవియు అనాద్యనంతము లనియు మన విశ్వాసము. ప్రాచీనమహర్షులు దర్శించిన యీ మంత్రము లేకరాశిగా నుండగా కృష్ణద్వైపాయను డా రాశినుండి ఛందోబద్ధములగువానిని ఋక్కులు గను, గీతరూపము లగువానిని సామములుగను, వాక్యరూపము లగువానిని యజుస్సులుగను విభజించెను. ఆనాటినుండి ఈ మూడు వేదములకు 'త్రయి' అను పే రేర్పడినది. అధర్వవేదము యజ్ఞోపయుక్తము కాకపోవుటవలన దానికి న్యూనత ఏర్పడునని తలచి, ఆ శాఖవా రిరువదియవ కాండను దాని చివర చేర్చి, త్రయీతుల్యత్వమును కల్పించిరి. అధర్వవేదముతో కలసి వేద ములు నాలు గైనవి. కాలక్రమమున వేదభాష ప్రజల కవగాహనము కాక పోవుటవలన, అందలి విషయములను సులభముగా తెలియజెప్పుట కుపనిష త్తులు, శిక్షా వ్యాకరణాదులగు షడంగములు నేర్పడినవి.

ఋగ్వేదమునందలి ఉషోవర్ణనము సహృదయులను ముగ్ధుల జేయ జాలినట్టిది. అందలి భావనాబలము, కల్పనాచమత్కృతి, సౌందర్యదృష్టి రసిక జనుల మనస్సులను రంజింపజేయును. ''ఉషఃకన్య స్వర్గభూదేవతల సంతానము. తల్లిదండ్రుల ఒడిలో పవళించిన ఆ కన్య వారిద్దరిపై కాంతిపుంజమును ప్రసరింపజేయుచున్నది. దివారాత్రము లామె సోదరీమణులు. ఆమె సూర్యభగవానుని వధువు. ధవళ వస్త్ర ధారిణియైన ఆమె ఆతని ప్రక్కన, వరుని సరసన నవవధువువలె, శోభించుచున్నది. సౌదామినీసమూహామువలె ఆమె ప్రపంచమును తేజోవంతముగా చేయును.''

వేదమున గావింపబడిన ఈ వర్ణన ఉషస్సుయొక్క సుందర రూపమును మనోజ్ఞముగా చిత్రించుచున్నది. వేదములలోను, ఉపనిషత్తుల లోను సృష్టితత్త్వము, జీవాత్మ పరమాత్మల స్వరూప నిరూపణమును చేయబడినవి. ధర్మము, సత్యము మున్నగువాని సమగ్రార్థము నిర్ణయింపబడినది.

మన ప్రాచీన విద్వాంసులు చార్వాకాది నిరీశ్వర మతములను ఖండించి, అవి అనుపాదేయములని సప్రమాణముగా నిరూపించిరి. వేద ప్రామాణ్యము నంగీకరించిన అనేకాస్తికవైదికమతము లుత్పన్నము లైనవి. ఈ మతముల లక్ష్యము మోక్షమే యైనను, దానిని పొందుటలో నవి విభిన్న మార్గముల ననుసరించినవి.

ఉపనిషత్కాలానంతరము సంస్కృతభాషలో కొంత మార్పు ఏర్పడినది. ఈ భాషను సంస్కరించుటకై ఐంద్రము, చాంద్రము మొదలగు నవ వ్యాకరణము లేర్పడినవి. ఈ వ్యాకరణము లన్నింటిలో ఉత్తమోత్తమముగా నిలచినది పాణినీయ వ్యాకరణము. ఇది కేవల శబ్దశాస్త్ర గ్రంథముగనే గాక, ఆనాటి భారతీయ సంస్కృతిని, సాహిత్యమును ప్రతిబింబింపజేయు గ్రంథముగా వెలసినది. సోవియట్ ప్రొఫెసర్ స్కేర్‌బాట్‌స్కి ''పాణినీయ వ్యాకర

ణము మానవప్రతిభ సృష్టింపగల విషయములలో అత్యుత్తమమైనది'' అని ప్రశంసించెను. జర్మన్ భాషా పరిశోధకులు దీని నిర్దుష్టతను, పరిపూర్ణతను, హేతువాదబద్ధతను చూచి, సంస్కృత భాషా శాస్త్రాధ్యయనమునకును, దీని నాధారముగా జేసికొని, ఇతర భాషా పరిశోధనకును పూనుకొనుటతో భాషా శాస్త్ర మను శాఖ ప్రత్యేకముగా నేర్పడినది.

సంస్కృతము జీవద్భాష కా దనియు, పాణిన్యాదివైయాకరణు లా భాషావికాసమును సూత్రబద్ధ మొనరించి నిరోధించి రనియు, ఆ కారణము ననే ఈనా డది ప్రచారమునుండి తొలగి, మృతభాషగా నున్నదనియు కొందరి యభిప్రాయము. కాని, పాణిని తర్వాతి కాలమున కూడ సంస్కృత భాష అనంతముగా పెంపొందినది. ఇతని పిదప నూటయేబది సంవత్సరములకు వరరుచి తన వార్తికముల ద్వారా పాణిని వ్యాకరణమును సంస్కరించెను. అతని అనంతరము ఆదిశేషుని అవతారముగా భావింపబడిన పతంజలి దీనికి భాష్యమును విరచించెను. ఈ భాష్యమునకు 'మహాభాష్య' మను ప్రసిద్ధి యేర్పడుటయే గాక ''మహాభాష్యం వా పరనీయమ్, మహారాజ్యం వా పాలనీయమ్'' అను నార్యోక్తియు నేర్పడినది. పాణిని, వరరుచి, పతంజలి అను నీ మునిత్రయ మా నాటి సంస్కృతభాషకు సమగ్రమగు సంస్కారమును గావించిరి.

ప్రభుసమ్మితములైన వేదములద్వారా విజ్ఞానమును బోధించుటకంటె ప్రజలకు సులభగ్రాహ్యమగు రీతిలో జ్ఞానబోధ చేయవలెనని మన మహర్షులు మిత్రసమ్మితములైన ఇతిహాస-పురాణ-ప్రక్రియల నేర్పరచిరి. వైదిక వాఙ్మయమున ప్రకృతి శక్తులయొక్కయు, ప్రకృత్యతీత శక్తులయొక్కయు వర్ణనములు ప్రధానములు; మానవ ప్రవృత్తి, మానసిక స్థితి, హృద్గత మార్దవ కారిన్యాదులు అప్రధానములు. మానవుని సంవేదనానందములకు ప్రకృతియు సానుభూతి ప్రకటించునట్లు కవులు భావించి, చిత్రించిరి

లౌకిక వాఙ్మయమున ప్రథమముగా నావిర్భవించిన గ్రంథరాజము వాల్మీకిరామాయణము. రతిపారవశ్యమున మైమరచి, ఆనందతన్మయమై యున్న క్రౌంచపక్షుల జంటలో నొకదానిని నిషాదుడు కూల్చినాడు. ఆడుపక్షి విలాపమును చూచి, విహ్వలుడైన వాల్మీకిశోకము ఛందోబద్ధమై శ్లోక మయ్యెను—

"మా నిషాద, ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్."
(రామా. బాల. 2-15)

[నిషాదా, కామపరవశమగు క్రౌంచమిథునములో మగపక్షిని చంపి వేసితివి కావున, నీ విక చాల కాలము బ్రదుకవు.]

ఇది సంస్కృతమున కవిత్వావిర్భావమునకు పలికిన నాంది. రస హృదయుడగు కవి, హృదయావర్జకములైన సన్నివేశములను చూచి గాని, భావించి గాని రమ్యముగా వర్ణించును. నిత్యమును మనకు గోచరించు దృశ్య ములే యైనను, ఇవి రసపరిగ్రహణముచే నూతన సౌందర్యముతో శోభిం చును. ఈ భావమునే మన ఆలంకారికు లిట్లు చెప్పిరి —

"దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్,
సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః."
(ఆనందవర్ధనుడు. ధ్వన్యా. 4-4)

[కావ్యవర్ణితములైన పదార్థము లంతకుముందు చూడబడినవే యైనను, రసపరిగ్రహణమువలన వసంతకాలమునందలి వృక్షములవలె నవి యన్నియు వినూత్నములుగనే భాసించును.]

ఆకస్మికముగ తన నోటినుండి నిర్గమించిన ఛందోమయ వాక్కునే భావించుచున్న వాల్మీకికి బ్రహ్మ ప్రత్యక్షమై—

"శ్లోక ఏవ త్వయా బద్ధః, నాత్ర కార్యా విచారణా,
మచ్ఛందా దేవ తే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ,...
రామస్య చరితం సర్వం కురు త్వం ఋషిసత్తమ,...
యావత్ స్థాస్యంతి గిరయః సరిత శ్చ మహీతలే,
తావ ద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి."

(రామా. బాల. సర్గ. 2, శ్లో. 3, 32, 36, 37)

[ఋషిసత్తమ, నీచే నిబద్ధమయినది శ్లోకమే; నా యభీష్టము ననుసరించియే యిట్టి వాగ్దేవి నీ నోట వెలువడినది: రామచరితము నీ ఛందస్సులో కావ్యముగా రచియింపుము. ఆ రామాయణకధ, ఈ లోకమున కొండలు, నదు లెంతవరకుండునో అంతకాలము ప్రచారమున నుండగలదు.] అని ఆదేశించెను. ఆ వాల్మీకియే సంస్కృతసాహిత్యమున కాదికవి. రామాయణము పవిత్ర గ్రంధముగా మనచే నారాధింపబడుచున్నది. దాని కను గ్రహ గ్రంధ మనియు పేరు.

"చరితం రఘునాధస్య శతకోటిప్రవిస్తరమ్,
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్,
శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పద మేవ వా,
స యాతి బ్రహ్మణ స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా."

[శ్రీరాముని చరిత్రము (బ్రహ్మాదిలోకములలో) అనేకకోట్ల శ్లోకములలో విస్తృతమై యున్నది.(వాల్మీకిమహర్షి దాని నీ లోకములో ప్రవర్తింప

జేసెను.) అట్టి రామాయణములో ఒక్కొక్క అక్షరమును మహాపాతకముల నైనను నశింపజేయజాలినట్టిది. ఎవడు రామాయణమును భక్తితో వినునో, శక్తి చాలదేని, అందలి యొక్క శ్లోకపాదమును కాని, ఒక్క పదమును కాని వినునో, అట్టివాడు బ్రహ్మలోకమున కేగును; సర్వదా బ్రహ్మచేత సమ్మానింపబడును.] అని ప్రాచీనులు రామాయణమహిమను కీర్తించిరి. రామాయణమును భగవానుని చరిత్రగనే కాక, ఇతిహాసముగను పఠింపవచ్చును. వాల్మీకి మానవతత్త్వమును మనమునం దుంచుకొనియే రామాయణమునందలి పాత్రలను చిత్రించెను. సులలిత పద సంయుతమై, సుందర కల్పనా రమణీయమై, రసవత్కావ్యమై వెలుగొందుచున్న దీ రామాయణము. దీనిమూలమున వాల్మీకి ఉత్తమసందేశమును లోకమున కొసగెను. ధర్మస్వరూపుడగు శ్రీరామచంద్రునివంటివారు ఆదర్శపురుషులై, ఎల్లరకును పూజ్యు లగుదురు. అధర్మపరుడగు రావణునివంటివా రెంతటి బలసంపన్నులైనను, మహా వైభవోపేతులైనను వినాశమును పొందుదు రనునది రామాయణ సందేశము. వాల్మీకి రామ రావణుల గురించి చెప్పిన శ్లోకములవలన నది నిరూపితమగును. మారీచుడు రాముని ధర్మావతారముగా వర్ణించును —

"రామో విగ్రహవాన్ ధర్మః సాధు స్సత్యపరాక్రమః,
రాజా సర్వస్య లోకస్య దేవానాం మఘవా నివ."
(రామా. అర. 37-13)

[శ్రీరాముడు సాధువు, సత్యపరాక్రముడు; రూపుగొన్న ధర్మము. దేవతలకు దేవేంద్రునివలె, ఆతడే సర్వప్రజలకును ప్రభువు.]

హనుమంతుడు రావణుని గురించి పలుకుచు —

"యత్ర దేవా స్సగంధర్వాః పిశాచపతగోరగాః,
విద్రవంతి సదా భీతాః మృత్యో రివ సదా ప్రజాః."
(రామా. అర. 48-3)

"య ద్యధర్మో న బలవాన్ స్స్యా దయం రాక్షసేశ్వరః,
స్స్యా దయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా."

(రామా. సుంద. 49-18)

[దేవతలును, గంధర్వులును, పిశాచ-పతగ-ఉరగ జాతులవారును, మానవులు మృత్యువున కెల్లప్పుడును భయపడునట్లు, రావణునకు భయపడి, పర్వులెత్తుచుందురు. సీతాపహరణరూపమగు ఈ అధర్మమే బలవంతము కాకుండునేని, దేవలోకమునకును, దేవాధిపతియగు దేవేంద్రునికిని ఈతడే సంరక్షకుడు కాగల్గును.] అధర్మపథగామియే కాకున్నచో రావణు డింద్రునకు కూడ రక్షకుడుగా నుండగలడని శ్లాఘించును. శ్రీరాము డాదర్శప్రాయుడగు పుత్రుడుగా, సోదరుడుగా, ప్రభువుగా, అనురక్తుడగు పతిగా, మానవతను, సత్యమును ప్రేమించు ధర్మశూరుడుగా గోచరించును. కైకేయితో రాము డాడిన మాట లతని సత్యవాక్ప్రియత్వమును వెల్లడించును.

"త ద్బ్రూహి వచనం దేవి! రాజ్ఞో య దభికాంక్షితమ్,
కరిష్యే ప్రతిజానే చ రామో ద్వి ర్నాభిభాషతే."

(రామా. అయో. 18-30)

[తల్లీ, రాజుగారి యభిలషిత మేమో ఆనతిమ్ము. దానిని తప్పక నెర వేర్తును. అట్లని ప్రతిన యొనర్చుచున్నాడను. ఈ రాముడు రెండు మాట లాడువాడు కాడు.]

పట్టాభిషేక సంరంభ మంతయు జరిగి, తాను చక్రవర్తిగా నభిషిక్తు డగు సమయమున, కైకేయికి దశరథు డనుగ్రహించిన వరముల ఫలితముగా,

నతడు కానల కేగవలసివచ్చెను. కాని ధీరోదాత్తు డగు రాముడు ప్రశాంత గంభీరముగనే యుండెను.

"ఆహూత స్యాభిషేకాయ, విసృష్టస్య వనాయ చ,
న మయా లక్షిత స్తత్ర స్వల్పో ప్యాకారవిభ్రమః."
(దశరూపకమున ఈ శ్లోకము ఉద్ధరింపబడినది.)

[పట్టాభిషేకమునకు పిచ్చేయునపుడు గాని, అరణ్యమునకు వెడలు నపుడు గాని శ్రీరామునిలో చిన్ని కలవరపాటైనను కానరాలేదు.]

సీతపై రామునకు గల అనురాగము మాటలతో వెలువరింప నశక్యము. ఆదర్శ దంపతులుగా వారు భారతీయుల స్మృతిపథమున స్థిరముగా నిలచిరి.

"స్వర్గేఽపి సీతయా హీనః శూన్య ఏవ మతో మమ."
(రామా. అర. 62-15)

"సీతయా రహితోఽహం వై న హి జీవామి లక్ష్మణ!"
(రామా. అర. 61-6)

[లక్ష్మణా, సీతలేని స్వర్గమైనను నాకు శూన్యమే. ఆమెను విడచి, నేను జీవింపనేరను.] అని రాముడు వాపోయెను.

పితృవాక్య పరిపాలనమునకై రాముడు వనవాస మేగెను. సహధర్మ చారిణి కావున భర్తతోడిదే లోక మని సీత అతనిని అనుగమించినది. కాని, ఏ ప్రమేయమును లేకయే సుమిత్రానందనుడైన లక్ష్మణుడు మహావైభవశ్రీలను త్యజించి, నూతనవధువగు ఊర్మిళను సైతము కాదని కానల కేగెను. పదు నాల్గేండ్లు నిద్రాహారముల వర్జించి వారిని సేవించెను. అట్టి సోదరునిపై రాము

నకు గల వాత్సల్యాభిమానము లెట్టివో రాముని వాక్కులలో గమనింప వచ్చును—

"దేశే దేశే కళత్రాణి, దేశే దేశే చ బాంధవాః,
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః."

(రామా. యుద్ధ. 101-14)

[ఏ దేశమందైనను భార్యలు దొరకగలరు; బంధువులును లభింప గలరు. కాని, ఏకోదరునివలె నుండెడు భ్రాత దొరకు దేశము మాత్ర మేదియు నా కగుపడుట లేదు.]

సుపుత్రుడగు లక్ష్మణుని అరణ్యమునకు పంపుచు, సుమిత్ర యిచ్చిన వీడ్కోలు, వాల్మీకి సృజించిన స్త్రీపాత్రల యుత్కృష్టతను ప్రదర్శించును—

"రామం దశరథం విద్ధి, మాం విద్ధి జనకాత్మజామ్,
అయోధ్యా మటవీం విద్ధి, గచ్ఛ తాత! యథాసుఖమ్."

(రామా. అయో. 40-9)

[లక్ష్మణా, శ్రీరాముని దశరథు డనుకొనుము; సీతను నన్నుగా భావింపుము; అరణ్యమును అయోధ్య యని తలంపుము. నాయనా, ఇట్టి భావనతో, శ్రీరాముని వెంట సుఖముగా పయనమగుము.]

రామాయణమందలి సీత ఆదర్శమహిళ; ఆదర్శపత్ని. ఆమె అనుభ వించిన కష్టములను, పాతివ్రత్యనిష్ఠను తలచుకొని, భక్తి పారవశ్యమున పులకింపని భారతనారి యుండదు.

"శుద్ధాత్మన్ ప్రేమభావా ద్ధి భవిష్యామి వికల్మషా,
భర్తార మనుగచ్ఛంతీ భర్తా హి మమ దైవతమ్."

(రామా. అయో. 29-16)

[నిర్మలాంతఃకరణా, శ్రీరామా, నాకు భర్తయే దైవము. అట్టి భర్తను ప్రేమభావముతో ననుసరించుచు, పాపరహిత నగుదును.]

"శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేన వా,
అనన్యా రాఘవే ణాహం భాస్కరేణ ప్రభా యథా."

(రామా. సుంద. 21-15)

[రావణా, ఐశ్వర్యముతో గాని, ధనముతో గాని, నన్ను ప్రలోభపెట్ట నేరవు. తేజస్సూర్యులవలె, రాఘవుడును, నేనును విడదీయరానివారము.] అను పలుకులు సీత పాతివ్రత్య దీక్షను వివరించును.

హనుమంతు డుదాత్తుడైన దూత. రామ సుగ్రీవులకు మైత్రి నెరపిన నాడు, సముద్ర లంఘనము చేసి, సీతను చూచి, మాటలాడిన నాడు, దూతగా రావణునికడ వ్యవహరించిననాడు అతడు చూపిన లోకజ్ఞత, వ్యవహారకుశలత, సంభాషణాచాతుర్యము, పాటించిన దౌత్యమర్యాదలును ఆతని స్వరూపమును విస్పష్టము చేయును—

"ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయహారిణీమ్,
అనయా చిత్రయా వాచా త్రిస్థానవ్యంజనస్థయా,
కస్య నారాధ్యతే చిత్తం ఉద్యతాసే రరే రపి,
ఏవంవిధో యస్య దూతః న భవే త్పార్థివస్య తు,
సిధ్యంతి హి కథం తస్య కార్యాణాం గతయోఽనఘ!

ఏవంగుణగణై ర్యుక్తాః యస్య స్యుః కార్యసాధకాః,
తస్య సిద్ధ్యంతి సర్వార్థాః దూతవాక్యప్రచోదితాః.''

(రామా. కిష్కిం. 3-32 నుండి 35)

[లక్ష్మణా, ఈ ఆంజనేయుడు ప్రియముగను, హితముగను మాటలాడుచున్నాడు. స్పష్టోచ్చారణము, బహు భావ స్ఫూర్తియు గల ఇట్టి సంభాషణముతో, చంపుటకై కత్తి దూసిన శత్రువు హృదయమైనను ప్రసన్నము కాకుండునా? ఇట్టి దూత యే రాజున కుండడో, అట్టివాని కార్యము లెట్లు నెరవేరగలవు? ఇట్టి గుణములు గల కార్యసాధకు లుందురేని, ఆ రాజుకార్యము లన్నియు దూతవాక్యప్రేరితములై, ఫలవంతములు కాగలవు.]

ఉపమాకల్పనమునందు వాల్మీకి సిద్ధహస్తుడు. ఇతని ఉపమలు సరళములును, మనోహరములు నై యుండును. రావణుని కఠోర వచనములను వినిన సీత ఆర్తయై, సింహమువలన భయపడిన ఆడు ఏనుగు వలె కంపించినదట —

''సా రాక్షసేంద్రస్య వచో నిశమ్య
తద్రావణస్యాప్రియ మప్రియార్తా,
సీతా వితత్రాస యథా వనాంతే
సింహాభిపన్నా గజరాజకన్యా.''

(రామా. సుంద. 28-1)

[దుఃఖకరము లగు సంఘటనములతో ఖిన్నయైన సీత కర్ణకఠోరము లగు ఆ రాక్షసేశ్వరుని మాటలను విని, అరణ్యమధ్యమున నొంటరియై, సింగమువాత బడిన పిన్న-ఆడు-ఏనుగువలె, గడగడ వణకెను.]

కవికుల గురువగు కాళిదాసు వాల్మీకి యుపమార్గమునుండి అనేక రత్నములను గ్రహించి, విఖ్యాతయశు డయ్యెను.

ఈ మహాకావ్యమును కొనియాడుచు, మేగ్డొనాల్డ్ "No work of world literature has ever produced so profound an influence on the life and thought of the people as the Ramayana." అని పలికెను.

వాల్మీకి తర్వాత సంస్కృత సారస్వత ప్రపంచమున నెన్నదగిన మహనీయమూర్తి వ్యాసభగవానుడు ఇతడు లోకసంగ్రహాపేక్షతో అష్టాదశ పురాణములను నిర్మించి, పంచమవేదముగా పరిగణింపబడు మహాభారతమును లక్షగ్రంధ పరిమితమైన ఇతిహాసముగా రచించెను. ఇంతటి విస్తృతమగు గ్రంధము మరి యే సాహిత్యమునను లేదు. చతుర్విధ పురుషార్థములను, ఆధ్యాత్మిక తత్త్వ ప్రతిపాదకములగు కథలను, ఇతరములగు అనేకోపాఖ్యానములను కలిగిన ఈ మహాభారతము భారతీయ విజ్ఞాన సర్వస్వముగా వెలసినది. సర్వోపనిషత్సారము, భారతీయ పరమవేదాంత గ్రంధము నగు భగవద్గీత ఇందులోనిదే. ధర్మతత్త్వ నిరూపణమున, కథాకథనమున, పాత్ర పోషణమున, వస్తువర్ణనమున, మానవ మనస్తత్వ చిత్రణమున వ్యాసుడు ప్రదర్శించిన ప్రజ్ఞ అసాధారణమైనది. తన కాలమునాటి సాంఘిక స్థితిగతులను, ఆచార వ్యవహారములను, రాజకీయ విధానములను, యుద్ధతంత్రములను, సాంసారిక సమస్యలను, వాని పరిష్కారములను అత్యంత సహజముగా చిత్రించి, మహాభారతమును భారతీయ జనసామాన్యమునకు పరమ ప్రామాణిక గ్రంధముగా రూపొందించెను. వ్యాసుడే చెప్పినట్లు—

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!
య దిహాస్తి త దన్యత్ర, యన్నేహాస్తి న తత్ క్వచిత్."

[భరతవంశాగ్రణీ, ధర్మార్థకామమోక్షముల గూర్చి ఇం దేమున్నదో అదియే ఇతరత్ర గలదు. ఇందు లేనిది మరి యెచ్చటను లేదు.]

లౌకిక సంస్కృత సారస్వతములో నితిహాసముల తర్వాత ప్రముఖముగా పేర్కొనదగినవి పురాణములు. చతుర్విధ పురుషార్థములను సాధించుటకును, ధర్మమార్గ ప్రవృత్తి నభ్యసించుటకును వేదార్థ వివరణ ప్రాయములగు బ్రహ్మాండాది పురాణము లుద్భవించినవి. ఇందు శిశునాగ-నంద-మౌర్య-గుప్త-ఆంధ్రాదుల వంశక్రమములు, అనేకరాజుల చరిత్రములు నభివర్ణింపబడినవి. వీనిలో కొన్ని అతిశయోక్తు లున్నను, అసత్యములు మాత్రము కావు. వీని నాధారముగా గ్రహించి, మన ప్రాచీన భారత చరిత్రను పునర్నిర్మించుట కవకాశ మున్నది.

ఇక, సంస్కృత వాఙ్మయమున కవుల భావనాలోకమునుండి సుందర రూపములతో నవతరించి, తమ మాధుర్య సౌకుమార్యాదులతో పాఠకులను పరవశింపజేసినవి కావ్య నాటకాదులు. తత్కర్తలగు మహాకవు లెందరో మనకు కావ్యామృతరసాస్వాదమును కలిగించి, బ్రహ్మానంద సహోదరమగు కావ్యానందమును ప్రసాదించిరి.

"సంసారవిషవృక్షస్య ద్వే ఏవ రసవత్ఫలే,
కావ్యామృతరసాస్వాదః, సంగమ స్సుజనై స్సహ."

[ఈ సంసార మనెడు విషవృక్షమునకు రసపూర్ణములగు ఫలములు రెండే యున్నవి. ఒకటి- కావ్యామృతరసాస్వాదము, రెండు-సజ్జనసంగమము.] అను ఆర్యుల వచనమునకు మన సంస్కృత కావ్యములు ప్రబల దృష్టాంతములు. భాసుడు, కాళిదాసు, భవభూతి, భారవి, మాఘుడు, బాణుడు, శ్రీహర్షుడు, జయదేవుడు మొదలగు మహాకవులెందరో అనర్ఘములైన కావ్య నాటకాదులను రచించి, సంస్కృత సాహితీ సౌధమును దేదీప్యమాన మొనర్చిరి. కాళిదాసు కావ్యములు ప్రపంచప్రసిద్ధములు.

"కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా."

[కావ్యములలో నాటకము రమణీయమైనది; నాటకములలో శాకుంతలము రసవంతమైనది.] అను కీర్తి గడించిన "అభిజ్ఞాన శాకుంతల" మెన్నియో భాషలలోని కనువదింపబడినది. శాకుంతలము కాళిదాసుని అద్భుతసృష్టి. శకుంతల ప్రకృతి పుత్రిక. ఆమె లతలను పెంచి, అవి పుష్పించిననాడు మహోత్సవమని పరవశించును. అందులకే కణ్వుడు, శకుంతల పతిగృహమునకు తరలిపోవు నపుడు, ప్రకృతిని అనుజ్ఞయిమ్మని ప్రార్థించును —

"పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మా స్వపీతేషు యా,
నాదత్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేన యా పల్లవమ్,
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే
యస్యా భవ త్యుత్సవః,
సేయం యాతి శకుంతలా పతిగృహం,
సర్వై రనుజ్ఞాయతామ్."

(శాకుం. 4-9)

[వృక్షాధిదేవతలారా, ఏయమ, మీకు నీరుపోయక, తన దప్పిక దీర్చుకొనదో, అలంకరించుకొనుటలో ప్రీతి గలదయ్యు మీయందలి ప్రేమతో చిగురుటాకు నైనను త్రుంపదో, మీ ప్రథమ కుసుమోద్భవకాలమును తనకు పండువుగా భావించుకొనునో, అట్టి ఈ శకుంతల పతిగృహమున కేగుచున్నది. మీ రందరును అనుమతి నిండు.]

ఉదాత్తభావములను లలిత మధురముగా వెలిబుచ్చగలుగుట కాళి దాసుని ప్రతిభా విశేషము. రమణీయార్థకములైన శబ్దములతో, రమ్యమగు భావముతో కాళిదాసుని యే శ్లోకమైనను ప్రసన్నముగా నుండును. శకుంతలా వర్ణనమే దీనికి నిదర్శనము—

"సరసిజ మనువిద్ధం శైవలే నాపి రమ్యం,
మలిన మపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి,
ఇయ మధికమనోజ్ఞా వల్కలే నాపి తన్వీ,
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్?"

(శాకుం. 1-18)

[నాచుతీగలనడుమ నున్నను తామరపూవు సుందరముగనే యుండును. నల్లని మచ్చయు చంద్రునికి అందమునే ఇచ్చును. ఈ తన్వి (శకుంతల) నారచీరలను ధరించియు మనోజ్ఞముగనే యున్నది. సుందరాంగుల కేది అలంకారము కానేరదు?]

వర్ణన రెండు విధములు. చలద్వస్తు వర్ణనము, స్థిరవస్తు వర్ణనము. ఇందు చలద్వస్తువర్ణనము దుస్సాధ్యము. అత్యంతప్రతిభాశాలియగు కవి యీ రెండింటిని అనాయాసముగ నిర్వహింపగలడు. ప్రాణభీతితో పరుగిడు చున్న జింకను దుష్యంతుడు వర్ణించిన తీరు చలద్వస్తువర్ణనమున కుదాహర ణముగా గైకొనవచ్చును—

"గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి
స్యందనే బద్ధదృష్టిః,
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతనభయాత్
భూయసా పూర్వకాయమ్,

దర్భై రర్ధావలీఢైః శ్రమవివృతముఖ -
భ్రంశిభిః కీర్ణవర్త్మా,
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతి బహుతరం
స్తోక ముర్వ్యాం ప్రయాతి."

(శాకుం. 1-7)

[సారథీ, ఈ జింక, ఒయ్యారముగ మెడను త్రిప్పి, వెంటదరుము కొనివచ్చు మనతేరిని మాటిమాటికి చూచుచు, బాణము పైబడునో యను భయముతో తన దేహమును కుదించుచు, పర్వెత్తునప్పటి శ్రమతో తెరచిన నోటినుండి సగము నమలిన దర్భలను త్రోవపొడవునను రాల్చుకొనుచు, గంతులు వేయుచుండుటవలన నాకసముననే ఎక్కువగను, నేలపై తక్కువ గను పర్వెత్తుచున్నది. ఈ వింత చూడుము.]

మృగయావినోదమున నున్న దశరథుడు నెమిలిని కూల్పకుండుటకు కారణము నెంత చక్కగా నూహించెనో చూడుడు—

"అపి తురగసమీపా దుత్పతంతం మయూరం
న స రుచిరకలాపం బాణలక్ష్యీచకార,
సపది గతమనస్కః చిత్రమాల్యానుకీర్ణే
రతివిగలితబంధే కేశపాశే ప్రియాయాః."

(రఘు. 9-67)

[వేటాడు దశరథుడు, తన గుఱ్ఱముసమీపముననే, పురివిప్పి యాడు చుండు నెమిలిపై బాణము తొడుగజాలడాయెను. ఆ పురిని చూచినవెంటనే, రంగురంగుల పూదండలతో నొప్పి, రతికేళి సమయమున ముడివీడిన తన ప్రియురాలి కేశపాశ మాతని మనమున మెదలుటయే దీనికి కారణము.]

ఉపమాప్రయోగనైపుణ్యమున కాళిదాసు వాల్మీకి ననుసరించినను "ఉపమా కాళిదాసస్య" అను ఖ్యాతి ఆతనికి మాత్రమే దక్కినది. కావ్య నాటక సారస్వత కర్తల కుపమాసౌందర్యములను వేయివిధములుగా చూపిన వా డాతడే. రఘువంశములోని ఇందుమతీ స్వయంవర ఘట్టమునందలి యీ యుపమానమును పరికింపుడు —

"సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా,
నరేంద్రమార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాలః."

(రఘు. 6-67)

[ఇందుమతి తమ్ము ఏరింపవచ్చు నను ప్రత్యాశతో వచ్చిన రాజుల ముఖములు, ఆమె వారిని కావని ముందునకు సాగగనే, వెలవెలబారినవి. ఆ స్థితిలో నున్న భూపాలురు, రాత్రి రాజమార్గమున కొనిపోబడు దీపకాంతిలో తళతళలాడి, అది ముందునకు పోవగనే, చీకటిలో వివర్ణములగు సౌధముల వలె, నున్నారట.] ఇట్టి సుందరోపమాకల్పనముమూలముననే ఈ కవికి 'దీపశిఖా కాళిదాసు' అను ప్రసిద్ధి యేర్పడెను.

రావణవధానంతర మయోధ్యకు తిరిగిపోవు సమయమున శ్రీరాముడు సీతకు గంగాయమునల సంగమస్థానమును చూపి, యిట్లు చెప్పును—

క్వచిచ్చ కృష్ణోరగభూషణేవ
భస్మాంగరాగా తను రీశ్వరస్య,
పశ్యానవద్యాంగి! విభాతి గంగా
భిన్నప్రవాహా యమునాతరంగైః."

(రఘు. 13-57)

[తెల్లని భస్మము నలదుకొని, కృష్ణసర్పముల నాభరణములుగ ధరించిన శివునివలె, ఆ సంగమము శోభించుచున్నదట.] శుద్ధ గంగాజలము, నల్లని యమునాజలము కలసిన దృశ్యము రమణీయముగను, ఉదాత్తముగను వర్ణింపబడినది.

"అగ్నిం వా ఆదిత్యః సాయం ప్రవిశతి"—సూర్యకాంతి సాయంకాలమగ్నిలో ప్రవేశించును—అను వైదికాంశము నుపమానముగ గ్రహించి, కాళిదాసు రఘుమహారాజు రాజ్యస్వీకారము నిట్లభివర్ణించెను—

"స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ,
దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః."

(రఘు. 4-1)

[సాయంకాలమున సూర్యు డొసగిన తేజముతో వెలుగు నగ్నివలె, దిలీపు డొసగిన రాజ్యముతో రఘురాజు మిక్కిలిగా ప్రకాశించెను.]

పార్వతీ వర్ణన విషయమున కూడ కాళిదా సిట్టి వైదికాంశము నుపమానముగా గ్రహించెను—

"మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వళిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపాన మివ ప్రయుక్తమ్."

(కుమా. 1-39)

[వేదివలె సన్నని మధ్యము (నడుము) గల ఆ పార్వతి తన నడుమున, మన్మథు డధిష్ఠించుటకై నవయౌవనము నిర్మించిన సోపానపంక్తియో యనునట్లు, వళిత్రయము నత్యంత సుందరముగా ధరించియుండెను.]

## సంస్కృతభాషా ప్రాశస్త్యము

మందాక్రాంతావృత్తములో సుందర మంద గమనముతో సాగిన మేఘసందేశము ఒక గీతికావ్యము వంటిది. శాపవశమున రామగిరిసానువు లందు విరహార్తుడై యున్న యక్షుడు, మేఘుని మూలమున, తన ప్రియు రాలికి సందేశమును పంపుచు, యక్షాంగనాస్వరూపమును వర్ణించును. కాళి దాసు చిత్రించిన ఆ మనోజ్ఞరూప మిది—

"తన్వీ, శ్యామా, శిఖరిదశనా, పక్వబింబాధరోష్ఠీ,
మధ్యే క్షామా, చకితహరిణీప్రేక్షణా, నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా, స్తోకనమ్రా స్తనాభ్యాం,
యా తత్ర స్యాత్ యువతివిషయే సృష్టి రాద్యేవ ధాతుః."
(మేఘ. 2-21)

[మేఘుడా, నా ప్రియురాలు - చాలినంత అవయవపుష్టియు, నల్ల కలువపూవువలె నిగనిగలాడు చామనచాయయు, పండిన దానిమ్మగింజలవంటి పలువరసయు, మాగిన దొండపండువంటి పెదవియు, సన్నని నడుమును, బెదరిన లేడి చూపులును, లోతైన నాభియు, పిరుదుల బరువుచే మందమంద ముగా నుండు నడకయు, స్తనభారముచే కొంచెము వంగిన పూర్వకాయ మును గలిగియుండును. బ్రహ్మదేవుని స్త్రీసృష్టిలో ఆమె మొట్టమొదట ఎన్న దగిన దేమో అనున ట్లుండును.]

సంస్కృత సాహిత్యాకాశమున కాళిదాసు జగజ్జేగీయమానముగా వెలుగు ధ్రువతార. అతడు సృష్టించిన నాయికలు, నాయకులు ఉత్తమ చరిత్రులై, లోకైక ప్రణయస్వరూపులై, ప్రపంచ సాహితీ రసికుల హృదయాంతరములలో చిరస్మరణీయులై నిలచిరి. అతని భావనారంగమున తళుక్కున మెరసిన దృశ్యములు మన మనఃఫలకములపై శాశ్వతముగా హత్తుకొనినవి. అతని ప్రణయసందేశము లోకోత్తరమై దేశకాలాతీతమైనది.

సంస్కృత పంచమహాకావ్యములలో భారవికృతకిరాతార్జునీయమును, మాఘకృత శిశుపాలవధమును—భారవి, మాఘము నని కవినామములతోనే వ్యవహరింపబడుచున్నవి.

"ఉపమా కాళిదాసస్య, భారవే రర్థగౌరవమ్,
దండినః పదలాలిత్యం, మాఘే సంతి త్రయో గుణాః."

[కాళిదాసు కావ్యములలో ఉపమయు, భారవి ప్రబంధములో అర్థగౌరవమును, దండికృతులలో పదలాలిత్యమును, మాఘుని కావ్యములో పై మూడు గుణములును ఉన్నవి.] అను నిరుక్తినిబట్టి అర్థగౌరవ విషయమున భారవి ప్రసిద్ధుడు. అల్పశబ్దములతో అనల్పార్థబోధన, నిర్ణేయవిషయ సంబంధియగు అనుకూల ప్రతికూల వాదముల విపులచర్చ, సప్రమాణమగు సిద్ధాంతీకరణము, అర్థాంతరన్యాసపూర్వకమగు అర్థనిర్ణయము—అనువానిని అర్థగౌరవ మని భావింపవచ్చును. మహాకవులు తమ కవిత్వధర్మముల నన్యముఖమున కావ్యముననే వ్యంగ్యముగ వ్యక్తము చేయుటయు కలదు. భారవియు ధర్మజునితో నిట్టి మాటలను పలికించెను. ఆగ్రహావిష్టుడగు భీమసేనుని, దుష్టద్విరదమునువలె, సాంత్వనపరచుచు, ధర్మరా జిట్లనును—

"స్ఫుటతా న పదై రపాకృతా,
న చ న స్వీకృత మర్థగౌరవమ్,
రచితా పృథగర్థతా గిరాం,
న చ సామర్థ్య మపోహితం క్వచిత్."

(కిరాతా. 2-27)

భీముని మాటలు స్ఫుటార్థములు కలవి; అర్థగౌరవము కలవి; పునరుక్తులు లేనివి;పరస్పరసాకాంక్షములు—నని దీని భావము.ఈ లక్షణములు భారవికవితాలక్షణములే యని మన మూహింపవచ్చును.

దుర్యోధనుని వీరభట సమృద్ధిని భారవి యిట్లు వర్ణించెను—

"మహౌజసో మానధనా ధనార్చితాః
ధనుర్భృత స్సంయతి లబ్ధకీర్తయః,
నసంహతా స్తస్య నభిన్నవృత్తయః
ప్రియాణి వాంఛం త్యసుభి స్సమీహితుమ్."

(కిరాతా. 1-19)

ఇందలి ఒక్కొక్క విశేషణమును అర్థయుక్తము. వారు మహాబల వంతులుగాన, బహుధా వారి యుపయోగ ముండును; మానధనులు గాన, బల గర్వముతో నకార్యకరణమునకు పూనుకొనరు; ధనసత్కృతులు గాన, దుర్యోధను నెన్నడును వీడరు; రణరంగమున నారితేరిన యోధులై విపుల యశస్సు నార్జించినవారు గావున వా రెన్నడును మోహమునకు లోనుగారు; స్వార్థపరులు గాకుండుటవలనను, భిన్నప్రవృత్తి లేనివా రగుటవలనను స్వామిద్రోహులు కారు; ప్రాణముల నొసగియైనను ఆనృణ్యమును సంపా దింపగోరుదురు——అని దీని భావము. ఇట్లాతని పద్యములు విశాలార్థ ప్రతి బోధకములు.

ఈ కవి-అర్థాంతరన్యాసములు బహుసుందరములై, ప్రకృతార్థమునకు మిక్కిలి పరిపోషకములుగా నుండును.

"హితం మనోహారి చ దుర్లభం వచః"

(కిరాతా. 1-4)

[హితమును, ప్రియమును నగు వాక్కు దుర్లభము.]

"వరం విరోధోఽపి సమం మహాత్మభిః"

(కిరాతా. 1-8)

[మహాత్ములతో విరోధమైనను (అల్పులతో స్నేహముకంటె) శ్రేష్ఠమే.]

"న తితిక్షాసమ మ స్తి సాధనమ్."

(కిరాతా. 2-43)

[ఓర్పుతో సమమగు సాధనము లేదు.]

"అల్పీయాన్ బహు సుకృతం హిన స్తి దోషః."

(కిరాతా. 7-15)

[దోషము చిన్నదే యైనను గొప్ప సుకృతమును కూడ నాశనము చేయును.]

ఇట్టి అర్థాంతరన్యాసములు కిరాతార్జునీయమున నసంఖ్యాకములు. ఇవి క్రమముగా లోకోక్తులై వ్యవహరింపబడుచున్నవి.

మందాక్రాంతా వృత్తరచనలో కాళిదాసు ప్రసిద్ధిగనినట్లు, భారవియు వంశస్థవృత్తమును నడపుటలో నద్వితీయుడు. 'దీపశిఖాకాళిదాసు'వలె ఇతనికి 'ఛత్రభారవి' యను ప్రసిద్ధి ఏర్పడెను. దీనికి కారణ మాతడు వాత్యావిధూత పుష్పపరాగమును కనకాతపత్రముగా నూహించి వర్ణించుటయే.

"ఉత్ఫుల్లస్థలనలినీవనా దముష్మాత్
ఉద్ధూత స్సరసిజసంభవః పరాగః,
వాత్యాభి ర్వియతి వివర్తిత స్సమంతాత్
ఆధత్తే కనకమయాతపత్రలక్ష్మీమ్."

(కిరాతా. 5-39)

కైలాస పర్వతమున స్థలనలినీవనములో, వాయువశమున మెట్ట తామరలనుండి రాలిన పుప్పొడి పైకి నిటారుగా సెగసి, ఆకాశమున సమంతాద్వివర్తితమై, సువర్ణచ్ఛత్రమువలె భాసించుచున్నదని కవి వర్ణించెను.

వ్యాఖ్యాతృశిరోమణి యగు మల్లినాథుడు భారవివాక్కులు నారికేళఫల సమ్మితము లనియు, అర్థముచేసికొన్న నవియే రసనిర్భరములై, రసికుల కాస్వాదయోగ్యము లగు ననియు చెప్పెను. మధురావిజయకర్త్రి యగు గంగాదేవియు భారవిరచన వకుళమాలికవలె విమర్దవ్యక్తిసౌరభ్య యనెను.

"కావ్యేషు మాఘః, కవి కాళిదాసః." కవులలో కాళిదాసగ్రగణ్యుడైనట్లు, కావ్యములలో మాఘకావ్య మగ్రగణ్యమట. అందుననే మల్లినాథుడు 'మాఘే మేఘే గతం వయః' అని సగర్వముగా చాటుకొనెను. మాఘుని అసాధారణమైన పాండిత్యప్రకర్ష కావ్యమున సర్వత్ర గోచరించును. "నవసర్గే గతే మాఘే నవశబ్దో న విద్యతే." మాఘ కావ్యమున తొమ్మిది సర్గలవరకును చదివిన పాఠకునకు క్రొత్త శబ్దమే ఉండదట. మాఘమునకు పూర్వము, భారవికృతమగు 'కిరాతార్జునీయము' ఉత్తమ కావ్యముగా పరిగణింపబడి, సర్వకవి పండిత ప్రశంసకును పాత్రముగా నుండెను. భారవిపై స్పర్ధతో మాఘుడు 'కిరాతార్జునీయము' కంటె ఉత్తమ కావ్యమును రచింపబూని, 'శిశుపాలవధము'ను విరచించెను. మాఘ కావ్యము ముందు భారవి కావ్యము వెలవెలబోయిన దని లోకము విశ్వసించెను. ఈ అంశమున నొక లోకోక్తి కూడ ఏర్పడినది.

"తావ ద్భా భారవే ర్భాతి, యావ న్మాఘస్య నోదయః,
ఉదితే చ పున ర్మాఘే, భారవేః భా రవే రివ."

[మాఘోదయమునకు పూర్వము, భారవికీర్తి అనంతమై విలసిల్లుచుండెను. కాని, మాఘావిర్భావము తర్వాత, భారవిప్రకాశము, మాఘమాసమందలి సూర్యకాంతివలె, తేజోహీనమై పోయినదట.]

మాఘకావ్యమునకు వ్యాఖ్య వ్రాయుచు మల్లినాధుడు—

"యే శబ్దార్ధపరీక్షణప్రణయినో,
యే వా గుణాలంక్రియా-
శిక్షాకౌతుకినో, విహర్తుమనసో
యే చ ధ్వనే రధ్వని,
క్షుభ్యద్భావతరంగితే రససుధా-
పూరే మిమంక్షంతి యే,
తేషా మేవ కృతే కరోమి వివృతిం
మాఘస్య సర్వంకషామ్."

ఎవరు శబ్దార్థ పరీక్షణమున ప్రీతిగలవారో, ఎవ్వరు గుణాలంకారాభ్యాసమున కుతూహలపడుదురో, ఎవరు ధ్వని మార్గమున విహరింప గోరుదురో, ఎవ్వరు భావతరంగితమగు రససుధాపూరమున తేలియాడ దలతురో, అట్టివారికొరకై మాఘకావ్యమునకు సర్వంకష యను వ్యాఖ్యను వ్రాయుదు నని చెప్పుచు,ఈ కావ్యమందలి ఉత్తమ లక్షణ సంపత్తిని తెలియ జెప్పెను.

మాఘుడు గొప్ప భావమును సైతము తక్కువ పదములతో వ్యక్తము చేయగల సమర్థుడు. మెత్తనివారి నందరు నభిభవింతు రను భావము నీతడు చక్కగా వివరించెను —

"తుల్యేఽపరాధే స్వర్భానుః భానుమంతం చిరేణ యత్,
హిమాంశు మాశు గ్రసతే తన్మ్రదిమ్నః స్ఫుటం ఫలమ్."
(శిశు. 2-49)

[అపరాధము తుల్యమే యైనను, రాహువు సూర్యుని చిరకాలమునకు గాని మ్రింగలేక యున్నాడు; చంద్రుని నతిశీఘ్రముగా కబళించుచున్నాడు. మెత్తదనమునకు ఫల మిది.] రాజులు శాంతము వహించిన, పరులు దానిని అసమర్థతగా భావించి, విజృంభింతు రనుటకు ఈ నిదర్శనమును చూపెను.

రమణీయత కీ కవి యొసగిన నిర్వచనము అమూల్యమైనది. "క్షణే క్షణే య న్నవతా ముపైతి,తదేవ రూపం రమణీయతాయాః."ఎన్ని మారులు చూచినను తనివితీరక, అనుక్షణము వినూతనత్వమును పొందునదియే రమణీయత్వమట. ఎంత చక్కని దీ నిర్వచనము!

వాఙ్మయములోని వైచిత్రి నీతడు వర్ణించిన తీరు కడు రమ్యమైనది.

"వర్ణైః కతిపయై రేవ గ్రథితస్య స్వరై రివ,
అనంతా వాఙ్మయ స్యాహో! గేయ స్యేవ విచిత్రతా."

(శిశు. 2-72)

[కతిపయ స్వరములతో (సప్తస్వరములతో) మాత్రమే కూర్పబడిన సంగీతమందలి విచిత్రతవలె, కతిపయ వర్ణములతో (50 అక్షరములతో) విరచింపబడు వాఙ్మయమందలి విచిత్రత అనంతమైనది గదా!]

సూర్యచంద్రులను గంటలుగా వర్ణించినందున, మాఘునకు ఘంటామాఘు డను ప్రసిద్ధి యేర్పడె నని వల్లభదేవుని యూహ. ప్రభాతసమయమున రైవతకాద్రి నీ కవి ఈ విధముగ వర్ణించెను—

"ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా -
వహిమరుచౌ హిమధామ్ని యాతి చాస్తమ్,
వహతి గిరి రయం విలంబిఘంటా -
ద్వయపరివారితవారణేంద్రలీలామ్."

(శిశు. 4-20)

రైవతకాద్రికి ఒకవైపున సూర్యు డుదయించుచుండెను. రెండవ వైపున చంద్రు డస్తమించుచుండెను. ఈ యిరువురి కిరణములును ఆకాశ మధ్యభాగమువరకు పొడవుగా వ్యాపించినవి. ఇట్లు సూర్యోదయ-చంద్రా స్తమయములతో విచిత్రశోభావిలసితమగు ఆ కొండ ఒక గజరాజు వలెను, సూర్యచంద్రులు దాని కిరుపార్శ్వములందును వ్రేలాడు గంటల వలెను, పై కెగసిన కిరణజాలము గంటలను కట్టు సూత్రముల వలెను భాసించుచున్నవట. కాళిదాసుని ఉపమాసౌందర్యము, భారవి అర్థగౌరవము, దండిపదలాలిత్యము అను నీ మూడు గుణములును మాఘునిలో కలవని ఆర్యోక్తి.

"గద్యం కవీనాం నికషం వదంతి." [కవులకు గద్యము ఒరపిడి రాయి యని యందురు.] పద్యరచనకంటె గద్యరచన క్లిష్టతరమైనది. ఛందోబద్ధములగు పద్యములను వ్రాయు కవి స్వతంత్రుడై, విశృంఖలముగా నుండజాలడు. గద్యమున ఛందోబంధము లుండవు గాన, కవిప్రతిభా వ్యుత్ప త్తులే గాక, దొసగులును అందు స్ఫుటముగా వ్యక్తమగుచుండును. అపార మగు సంస్కృత సారస్వతమున గద్య కావ్యములు చాల విరళములై యుండుట యీ కారణముననే. పద్యకావ్యములు లెక్కింపలేనన్ని యుండగా, గద్యకావ్యములు వ్రేళ్ళపై గణింపదగినన్ని మాత్రమే యున్నవి. ఇట్టి గద్య రచనమున నద్వితీయ ప్రజ్ఞాధురంధరుడై, సంస్కృత సాహిత్యవిశ్వమున సర్వేశ్వరుడుగా వెలుగొందు కవి బాణుడు. బాణు డన్నంతనే ఆతని అద్భుత సృష్టి యగు 'కాదంబరి' స్ఫురణకు వచ్చును. ఇదియే బాణుని అమరుని గావించినది. ఇతని సర్వతోముఖజ్ఞాన మసాధారణము. సార్వభౌముని అంతఃపుర సంప్రదాయములు, షాడ్గుణ్యప్రయోగచాతురి, మహర్షి-తదాశ్రమ ధర్మతత్త్వములు, వామాచారపరాయణులగు వంచక ధార్మికుల దురాశా-దురాచారములు, ఆటవికజన జీవనపద్ధతి-ఇత్యాది వర్ణిత విషయజాల మంతయు ఈతని మేధాసంపత్తికిని, పరిశీలనాశక్తికిని ద్యోతకమగుచున్నది. శుకనాసోప

దేశ మొక్కటియే యీతని అపార విజ్ఞానమున కాదర్శముగా నిలువగలదు. ఇత డూహింపని రీతి, వర్ణింపని పద్ధతి, ఇతని దృష్టి కందని వర్ణ్యవస్తువు, ఇతడు తడవని విషయమును లేకపోవుటచే "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" [బాణుడు చప్పరించి, ఉమ్మివేసినదే ఈ జగత్తంతయు] అను నానుడి ఏర్పడినది. ఇతని రచనలో విషయ వైవిధ్యము మెండు. 'కాదంబరి' యొక రసఖండము. ఇందలి కవితాగుంఫనము సుపరిపక్వమైనది. వృత్తగంధి, చూర్ణము, ఉత్కలికాప్రాయము నను గద్యరీతులను మూడింటిని నిపుణముగా నిర్వహించిన మేటి. "కాదంబరీరసజ్ఞానా మాహారోఽపి న రోచతే" [కాదంబరీరసాస్వాదనతత్పరులకు ఆహారముకూడ రుచింపదు.] అను సత్యము అనుభవైకవేద్యము. చంద్రకుడను ఒకానొక కవి—

"శ్లేషే కేచన, శబ్దగుంఫవిషయే
కేచిత్, రసే చాపరే,
ఽలంకారే కతిచి, త్సదర్థవిషయే
చాన్యే కథావర్ణనే,
ఆ సర్వత్ర గభీరధీరకవితా-
వింధ్యాటవీచాతురీ-
సంచారీ కవికుంభికుంభభిదురో
బాణ స్తు పంచాననః."

అని, బాణుని సర్వోత్కృష్టు డని కొనియాడెను. [సుబంధ్వాదులు శ్లేషరచనా ధురంధరులు; జయదేవాదులు శబ్దగుంఫనప్రవీణులు; కాళిదాస-భవభూత్యాదులు రససిద్ధులు; శ్రీహర్షాదులు ఉత్ప్రేక్షాద్యలంకారవల్లభులు; భారవ్యాదు లర్థగౌరవగురువులు; దండ్యాదులు కథాకథనదక్షులు; కాని, బాణుడు సర్వత్ర

గభీర ధీర కవితా వింధ్యాటవీ చాతురీ సంచారియు, కవికుంభి కుంభ భిదురము నగు పంచాననమే యట!]

కాదంబరిలో ఇంద్రాయుధ మను తురంగమ పాత్రచిత్రణ మతివిచిత్రము, సుందరము నైనది. ఆ యా సన్నివేశములం దిత డొనరించిన అశ్వవర్ణన మనితరసాధ్యము. ఈ ప్రత్యేకమగు వర్ణనమును బట్టియే ఇతనికి తురంగమబాణు డను ప్రసిద్ధి యేర్పడినది.

ఆంధ్రుడైన జగన్నాథకవి ఉద్దండపండితుడై, అలంకారశాస్త్ర నిర్మాణ దక్షుడై, మధురకవియై, ఢిల్లీవరకును తన పాండిత్య ప్రతాపమును వ్యాపింప జేసెను. ఇతడు తన కవిత్వమును గురించి చెప్పికొనిన మాటలు ఇవి—

'గిరాం దేవీ వీణాగుణరణనహీనాదరకరా
యదీయానాం వాచా మమృతమయ మాచామతి రసమ్,
వచ స్తస్యాకర్ణ్య శ్రవణసుభగం పండితపతేః
అధున్వన్ మూర్ధానం నృపశు రథవాఽయం పశుపతిః."

(శాంతివిలాస. 27)

[జగన్నాథుని కవితామృతమును గ్రోలిన సరస్వతి, తన వీణావాదనమును కూడ చాలించినదట. అట్టి మధురకవిత్వమును వినియు, తల యూపనివా డున్నచో, వాడు నరపశువైనను కావలెను, లేదా పశుపతియైనను కావలె నట!] ఈ ఆత్మవిశ్వాస మెంత యుదాత్తమైనది!

లలితపదబంధురమైన ఇతని కవిత్వము సంగీతమువలె శ్రవణపేయముగా నుండును. లవంగీ ప్రణయదృ గంగీకారమే తనకు చాలు నని ఇతడు చెప్పికొనెను.

## సంస్కృతభాషా ప్రాశస్త్యము

"న యాచే గజాలిం, న వా వాజిరాజిం
న విత్తేషు చిత్తం మదీయం కదాఽపి,
ఇయం సుస్తనీ మస్తకన్యస్తహస్తా
లవంగీ కురంగీదృ గంగీకరోతు."

(చాటువు)

[ఏనుగులనో, గుఱ్ఱములనో నేను కోరను. నా మనస్సు ఎప్పుడును ధనమున కఱ్ఱులు సాచలేదు. ఈ సుస్తని, సారంగాక్షి, (నాట్యభంగిమలో) తలపై చేతి నిడుకొనియున్న లవంగి, ప్రియునిగా నన్నంగీకరించిన చాలును. ఇంతకంటె నాకీ లోకమున కోరదగినది లేదు.]

అనంత ప్రతిభావ్యుత్పత్తు లున్నను, స్వదేశమును వదలిపోవుటకు పండితులు సుముఖులుగా లేనికాలమున, ఢిల్లీవరకు విజయయాత్ర చేసి, మొగలుపాదుషాను మెప్పించి, పండితరాయలై, మహితయశోమండనుడైన జగన్నాథుడు మనవాడై నందులకు గర్వింపవలసినదే.

ఆంగ్లభాష మనదేశమున ప్రవేశింపకముందు, భిన్నప్రాంతీయులైన భారతీయులకు సామాన్య వ్యవహారభాష సంస్కృతమే. ఈ విషయము శ్రీహర్షుని నైషధ కావ్యమువలన విదితమగును. దమయంతీస్వయంవరమునకై అనేక ప్రాంతములకు జెందిన రాజులును, దేవలోకమునుండి ఇంద్రాది దేవతలును వచ్చిరి. అప్పుడు వారు, తమ తమ ప్రాంతీయ భాషలు ఎదుటి వారికి అర్థముకావను తలంపుతో, సంస్కృతభాషలోనే సంభాషించుకొనుటతో దేవత లెవరో, మానవు లెవరో నిశ్చయించుటకు వీలుకాలేదని శ్రీహర్షుడు చమత్కరించెను.

"అన్యోన్యభాషానవబోధభీతేః
సంస్కృత్రిమాభి ర్వ్యవహారవత్సు,
దిగ్భ్య స్సమేతేషు నృపేషు తేషు
సౌవర్గవర్గో న నరై రచిహ్ని."

(నైష. 10-34)

ఈ నాడు ప్రాంతీయభాషలలోని కెన్నియో సాంకేతిక విషయముల ననువదించుటకు సంస్కృతము ఉపయోగకారిగా నున్నది. ఆసేతుహిమాచలము జాతిసమైక్యమును సమకూర్చుట కీ సంస్కృత భాష అనాదినుండి సంధాన సూత్రముగా నుండినది. నేడును భారతదేశ మెదుర్కొనుచున్న విపత్కరపరిస్థితులలో జాతీయసమైక్యమును సంపూర్ణముగా నెలకొల్పుటకై, మన ఆర్షసంస్కృతికి మూలకందమైన సంస్కృత భాషాధ్యయనమును ప్రోత్సహించి, దాని ప్రచారమునకు సర్వతోముఖమైన కృషిచేసి, మన ప్రాచీన సంస్కృతివైభవమును పునరుజ్జీవింపజేయుట మన కర్తవ్యము.